శ్రీ నిర్మలశైవసాహితీగ్రంథమాలికా చతుర్థ ప్రసూనము

శివశ్రీ బండారు తమ్మయ్యగారి

# వ్యాసావళి

## ద్వితీయ భాగము





కర్త

విమర్శకాగ్రేసర

శివశ్రీ బండారు తమ్మయ్యగారు

ఉ. ఈ సిసుమంత సోకనితెగింపున జెప్పదలంచుకొన్న నీ
వ్యాసము లాంధ్రసాహితికి బంగరుపంటలు, గుండెసూటిగా
దూసికొనంగ వాకొనెడిధోరణి చెల్లుబడిన్ విమర్శకా
గ్రేసరు దీత దన్ననటికిన్ సయిదోడు గదోయి ధీమణీ!

—శ్రీ వద్దిపర్తి [illegible]

చ. సరసవిమర్శనాపటిమ, సన్నుతపాండితి, తెల్గుపల్కు
[illegible] నస్తవనీయవిశాలభావ[illegible]
[illegible]జ్ఞరసజ్ఞత, సాధుశీలము
[illegible]తముం బ్రణుతింతు నె[illegible].

[illegible] గిద్దలూరు చెంచుబసవ[illegible] B. A.

[illegible] సితశరీరక!
[illegible]లయాంబురుహాంబక!

[illegible]

[illegible], శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు.

ఉ. ఈ సిసుమంత సోకనితెగింపున జెప్పదలంచుకొన్న నీ
వ్యాసము లాంధ్రసాహితికి బంగరుపంటలు, గుండెనూటిగా
దూసికొనంగ వాకొనెడిధోరణి చెల్లుబడిన్ విమర్శకా
గ్రేసరు డీవ దన్ననుటకిన్ సయిదోడు గదోయి ధీమణీ!

—శ్రీ పద్దిపర్తి చలపతిరావు.

చ. సరసవిమర్శనాపటిమ, సన్నుతపాండితి, తెల్గుపల్కు...
...నస్తవనీయవిశాలభావ...
...జ్ఞరసజ్ఞత, సాధుశీలము...
...తముం బ్రణుతింతు నె...

...గిద్దలూరు చెంచుబసవరా... A.

...సితశరీరక!
...బయాంబుజహాంటక!

...

...

...

..., శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు.

శివశ్రీ బండారు తమ్మయ్యగారి

# వ్యాసావళి

## ద్వితీయ భాగము


కర్త

విమర్శకాగ్రేసర, ఐతిహాసికసమ్రాట్, ధర్మభూషణ,
శైవసాహితీసార్వభౌమ, శివశరణ, సోమసాహిత్యాచార్య.
బిరుదాంకిత

బండారు తమ్మయ్యగారు

కాకినాడ





ప్రకాశకులు

శ్రీ నిర్మలశైవసాహితీ గ్రంథమాలిక

నండూరివారివీథి, గాంధినగరము

కాకినాడ-4 తూ॥గో॥ జిల్లా.

ప్రథమముద్రణము
ప్రతులు 1000
జూలై 1969



వెల రు. 4-50



ప్రతులు దొరకు చోటు
గ్రంథకర్త
శివశ్రీ బండారు తమ్మయ్య.
సాలిపేట, కాకినాడ-1

శ్రీ నిర్మలశైవసాహితీగ్రంథమాలిక
నండూరివారివీధి.
గాంధినగరము, కాకినాడ-4.

# ప్రకాశకవిజ్ఞప్తి

శివశ్రీ బండారు తమ్మయ్యగారి వ్యాసావళి ద్వితీయ భాగము శివానుగ్రహమున ఇప్పుడు ప్రకటించుచున్నం దుకు సంతసించుచున్నాము. మొదటిభాగము అవతారికలో మేము, శివశ్రీ తమ్మయ్యగారు కావించిన విజ్ఞప్తుల ననుస రించి శ్రీ శ్రీజగద్గురు నిడుమామిడి మహాస్వాములవారు వారి ఆశీర్వాదములతో 101 రూపాయలు విరాళమును మా ఉద్య మమునకు అనుగ్రహించినందుకై మేము వారికి ప్రణామసహ స్రములు అర్పించుచున్నాము. వీరశైవమఠములు తాము విచ్చలవిడిగా చేయు నితరవ్యయములకన్న ఇట్టియుద్యమము లకు తమయాదాయమును కొంత వినియోగించి యుపకరిం తురుగాక యను హెచ్చరికను శ్రీ T. H. M. చంద్రశేఖర శాస్త్రి B. A., B. L., గారు, బళ్లారినుండి వెలువడు "నవ సందేశ" వారపత్రికయందు కావించియున్నారు. వారికి మే మెంతయు కృతజ్ఞులము. వీరశైవమఠాధిపతులును, వీరశైవ సోదరులును శ్రీ నిడుమామిడి మహాస్వాములవారి మార్గము ననుసరించి మా ఉద్యమమునకు చేయూత నొసంగెదరుగాత మని ప్రార్థించుచున్నారము.

శ్రీ తమ్మయ్యగారి వ్యాసావళి తృతీయభాగమును వేమన యోగినిగురించి వారు రచించిన చరిత్రగ్రంథమును త్వరలో ప్రకటించుటకు కృషిచేయుచున్నాము.

కాకినాడ,
...-6-69.

ఇట్లు,
ప్రకాశకులు.

# పీఠిక

ఇదివఱలో నేను వ్యాసావళి ప్రథమభాగము పీఠికలో వ్రాసినప్రకారము ఇప్పుడు శ్రీనిర్మలశైవసాహితీగ్రంథమాలిక వారు వ్యాసావళి రెండవభాగమును ప్రకటించుచున్నారు. ఇందులో ముఖ్యముగా మొదటి అయిదువ్యాసములును శ్రీ కళ్యాణబసవేశ్వరునిచరిత్రమునకు సంబంధించినవి. శ్రీబసవచరిత మను పేర ప్రత్యేకగ్రంథ మొకటి యాంధ్రులయుపయోగార్థ మాంధ్రవచనమున రచింపవలె ననెడిసంకల్పము నాకు చిరకాలమునుండి కలదు. కాని యది జరుగలేదు. "మతోద్ధారకుఁ" డను పేరితో నామిత్రులు శ్రీ గంటి జోగిసోమయాజులుగారు అదోనిలో నున్నప్పుడు బసవేశ్వరునిగూర్చి ఒక పద్యకావ్యమును వ్రాసి దానిని దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారికి అంకితము చేసియున్నారు. అదిగాక, బసవేశ్వరునిఁగూర్చి యాధునికులలో వీరశైవులు గాని యితరులు గాని వ్రాసిన ప్రత్యేకాంధ్రగ్రంథమేదియుఁ గానరాదు. ఈనడుమను బసవేశ్వరునిఁగూర్చియును నాఁటిమత రాజకీయ సాంఘికపరిస్థితులగుఱించియును చాల పరిశోధనలుజరిగి బెంగుళూరులో బసవసమితి యను పేరనొకసంస్థ స్థాపితమై 1967, 68 సంవత్సరములలో బసవేశ్వర అష్టమశత వార్షికోత్సవములు దేశములోపలుతావులజరుపఁబడినవి.ఆసందర్భమున మైసూరు ప్రభుత్వము వా రొక ప్రత్యేకసంచికను ఆంగ్లభాషలో వెలువరించియున్నారు. దానిలో "Basaveswara in Telugu Litarature" అను పేరితో నాంగ్లవ్యాసమొకటి నేనుగూడ వ్రాసియున్నాను. దాని ఆంధ్రానువాదముగూడ "బసవేశ్వ

రుని గూర్చిన "యాంధ్రవాఙ్మయము" మను పేరితో నిందులో నయిదవవ్యాసముగఁ బ్రకటిత మయినది. అష్టమశతవార్షికోత్సవ - ఆంగ్లసంచికను సమగ్రముగఁ జదివినవిద్వాంసులకు బసవేశ్వరునిఁగూర్చి యాంధ్రమున నొకగ్రంథమే వ్రాయుటకు వలయుసామగ్రి లభింపఁగలదని మనవిచేయుచున్నాను. కర్ణాటకవిశ్వవిద్యాలయముతో సంబంధముగల ప్రొ॥ పి. బి. దేశాయిగారుకూడ నీనడుమ నొకవిపులపరిశోధనాగ్రంథమును "Basaveswara and his times" అనునామముతో రచించి యిరువదిరూపాయల మూల్యమేర్పఱచి ప్రకటించినట్లు తెలియుచున్నది. ఆగ్రంథము తెప్పించి చదువుభాగ్యము నాకుఁ గలుగలేదు. కర్ణాటకవిశ్వవిద్యాలయములో లైబ్రేరియన్‌గానున్న శ్రీ యస్. ఆర్. గుంజాల్ ఎం. ఏ. గారుకూడఁ గన్నడభాషలో 'బసవసాహిత్యదర్పణ' అనునామముతో నొకగ్రంథమును వ్రాసి బెంగుళూరు బసవసమితిపక్షమున ప్రకటించియున్నారు. దానినిబట్టి బసవేశ్వరునిఁగూర్చి తెలుఁగులోను కన్నడములోను ఆంగ్లములోను గణింపఁదగినవాఙ్మయము మున్నట్లు కానవగును. గ్రంథవిస్తరభయమునఁ దాని నిచ్చట వివరించుటలేదు. కావున వీరశైవులు, తదితరులు నీగ్రంథములనెల్లఁ జదివి బసవేశ్వరునిఁగూర్చి యొక ప్రత్యేకగ్రంథమును వ్రాసి ప్రకటింతురుగాక యని యాశించుచున్నాను. నావలన నట్టిగ్రంథము వెలువడు నవకాశ మీచరమదశలో లేదు.

మిగిలినవ్యాసములలో ముఖ్యమయినది వీరశైవపంచాచార్యులలో చతుర్థాచార్యులగు పండితారాధ్యునకు సంబం

ధించినది. లోకములో నీ చతుర్థాచార్యుఁడే పాలకురికి సోమ నాథుని ద్విపదపండితారాధ్యచరిత్ర కథానాయకుఁడైన మల్లికార్జునపండితారాధ్యుఁ డను నొకదుర్భ్రమ కలదు. దానిని ఖండించుటయే ముఖ్యముగా నీవ్యాసోద్దేశము. ఇతర వ్యాసము లితరవిషయములను సంబంధించిన చిన్నవ్యాస ములు.

వ్యాసావళి ప్రథమభాగపీఠికయందు నేను గావించిన యభ్యర్థనము దిలకించి, శ్రీ శ్రీశైలజగద్గురు నిజుగుణాఖుడి మహాస్వాములవారు దయతో నాకు "సోమసాహిత్యాచార్య" యను బిరుదము ననుగ్రహించుచుఁ దమ ఆశీర్వాదముతో రు 101-00 లు ఈగ్రంథముద్రణకుగాను విరాళముగాఁ బంపి యున్నారు. వారికి నా ప్రణామసహస్రములు. వారి ఆశీర్వా దపత్రమును ఆంధ్రలిపిలో నిందు ప్రకటించుచున్నాను.

ఈ వ్యాసములనెల్ల సేకరించి యీగ్రంథము ప్రకటిం చిన శ్రీ నిర్మలశైవసాహితీగ్రంథమాలికవారి కెంతయుఁ గృతజ్ఞుఁడను. ఆంధ్ర కర్ణాట వీరశైవసోదరులు వారియుద్య మమునకుఁ దోడ్పడెదరుగాక! యనియు నా యితరవ్యాస ములును, నముద్రితగ్రంథములును వారు త్వరలో వెలువరిం చుట కుచితసాహాయ్య మొనరింతురుగాక! యనియుఁ బ్రా ర్థించుచున్నాను.

ఇట్లు,

భక్త విధేయుఁడు

**బండారు తమ్మయ్య.**

**ఆంధ్రసాహిత్యపరిషదధ్యక్షులు.**

# ఆశీర్వాదపత్రము

శ్రీ జగద్గురు పండితాచార్యః ప్రసీదతు
వీరశైవమతాచార్యః పండితారాధ్యః జగద్గురుః
యో వీరశైవసిద్ధాంతం స్థాపయామాస భూతలే.

శ్రీ ౧౧౦౮ జగద్గురు పండితారాధ్య పరంపరాగత
శ్రీగిరిరాజమణిఖచిత కనకసూర్యసింహాసనాధీశ్వర
శ్రీమన్నిడుమామిడి శ్రీశైలజగద్గురు చెన్నబసవరాజదేశి
కేంద్రశివాచార్యమహాసన్నిధియవరు
(గూళూరు, బాగేపల్లి తాలుకా, కోలార్ జిల్లె.)

శ్రీ విమర్శకాగ్రేసర బండారు తమ్మయ్య
అవరిగె అనుగ్రహిసిద ప్రశస్తిపత్రికె.

నాడిన శైవసాహిత్యక్షేత్రదల్లి ఆదర్శపూర్ణవాద సేవె
సల్లిసుత్తిరువనిమగె దినాంక 24-1-1969 రందు రథసప్తమీ
సందర్భదల్లి.

"సోమసాహిత్యాచార్య"

ఎంబ ప్రశస్తి యన్ను అనుగ్రహిసలాగిదె.
సన్మంగళపరంపరె యల్లి నిమ్మ భవిష్య బంధురవాగలి
భద్రం, శుభం, మంగళం.

ముకాం—బెంగళూరు. ఇత్యాశిషః

# విషయసూచిక

# వ్యాసావళి

## ద్వితీయ భాగము

### బసవేశ్వరుని శీలము: జీవిత తత్త్వము

(1955 ఏప్రెల్ అనంతపుర బసవజయంతియధ్యక్షోపన్యాసము)

ఉ. శ్రీగురులింగతత్పరుఁ, డశేషజగన్నిధి, శుద్ధతత్త్వ సం
యోగసుఖప్రపూర్తి, వృషభోత్తమమూర్తి, యుదారకీర్తి, ది
వ్యాగమమార్గవర్తి, బసవయ్య కృపాంబుధి మీకు దివ్యసం
భోగములన్ ప్రసాదసుఖభోగములం గరుణించుఁగావుతన్.

శ్లో. యత్సంగీతనిధిర్యమాహురభవం యేనార్చితం సూనృతం
యస్మైస్వస్తియతస్తదీయముదభూ ద్యద్వీరశైవవ్రతమ్
యస్యాపాంగసహోదరీచ కరుణాయస్మిన్మహత్త్వాదయః
సర్వాంగ్శ్రీశివగంతి పాహి బసవామాత్యేశచూడామణే!

మహాజనులారా! వీరశైవ సోదరులారా!

వీరపూజ, వీరారాధనము భారతీయులలోనే గాక సమస్త ప్రపంచమునందుఁ జిరకాలమునుండిపరిపాటిగాజరుగుచున్నది. వీరుఁడనఁగా నవక్రమపరాక్రమమునెఱపి శత్రుసంహారమొనర్చుశూరుఁడనుభావము, సర్వసాధారణముగా వ్యవహారమునందున్నది. ఇట్టియర్థముననే రామాయణవీరుఁడు శ్రీరాముఁడనియు

భారతవీరుఁడు పార్థుఁడు (అర్జునుఁడు) అనియుఁ గీర్తింపఁబడుచు న్నారు. ఇట్లే ముప్పదిమూఁడుకోట్ల దేవతల మోది మోది దక్షయజ్ఞధ్వంస మొనర్చిన రుద్రావతారుఁడగు వీరభద్రునకు వీరశబ్దము పర్యాయముగ నేర్పడినది. కాని కేవలశౌర్యమే వీరధర్మముగా మనదేశముననేమి తదితరదేశములందేమి విజ్ఞానులగు పెద్దలు పరిగణించియుండలేదు. వీరశబ్దమున కిం చుమించుగ సమానార్థకముగ Hero అనుపదము ఆంగ్లభా షలో వ్యవహృత మగుచున్నది. సుప్రసిద్ధ విద్వాంసుఁడు (Thomas Carlyle) తాను రచించిన Hero Worship (వీరారాధనము)అనుగ్రంథములో Hero as a Poet, Hero as a Prophet, Hero as a Philosopher ఇత్యాదిగా వీరవర్గమును బలువిధములుగ విభజించియున్నాఁడు. గీర్వాణ వాఙ్మయమును మథించి యలంకారశాస్త్రమును రచించిన మన యాలంకారికులుగూడ నాయా కావ్యనాటకములందలి నాయకులను దయావీరుఁడు, దానవీరుఁడు, ధర్మవీరుఁడు మున్నగువిధములుగా వారివారి ప్రధానోత్తమగుణముల ననుసరించి నిర్వచించి యుల్లేఖించియున్నారు. కావున నొక ఖడ్గబలముచే శత్రుల నిర్జించి దేశసౌభాగ్యమును గూర్చిన వారేగాక తమ కలముబలిమి (కవితాశక్తి), బుద్ధిబలము (తత్త్వజ్ఞానము), మతప్రచారము (ప్రవక్తృత్వము) దయా దానధర్మాది సద్గుణగరిష్ఠత్వముల మూలమున సంఘము దేశము నుద్ధరించి దేశకల్యాణమునకు సాధకులయిన మహో

పురుషు లందఱుకూడ వీరశబ్దవాచ్యులయి తరువాతి తరముల వారికి పూజనీయు లగుచున్నారు. వీరశైవవాఙ్మయమున "విశబ్దే నోచ్యతే విద్యా శివజీవైక్యబోధినీ తస్యాం రమ తయస్తస్మై వః వీరఇత్యభిధీయతే" అని శివజీవైక్యవిద్యాసాధకుఁడు వీరుఁడని చెప్పఁబడియున్నది. కావున వీరశైవులెల్ల రకుఁగూడ నామైకదేశమున వీరశబ్దము వ్యవహృత మగుచున్నది. పూర్వోదాహృతములయిన యుత్తమగుణము లెన్నియో పుంజీభవించి యేకాశ్రయము నొంది యవతరించిన మహాపురుషుఁడు క్రీ. శ. ౧౨ వ శతాబ్దియందు కర్ణాటదేశమున హింగుళేశ్వరబాగవాడియందు జననమొంది పశ్చిమ చాళుక్యాధీశుఁడగు బిజ్జలుని ప్రధానమంత్రియై, కూడలి సంగమేశ్వరచరణారవిందవిలగ్న మిళిందాయమాన మానసుండై జంగమవ్యసన మహిష్ఠుండై, వీరశైవ మతోద్ధరణ మొనర్చి విశ్వజ్యోతియై వెలింగి చిరస్మరణీయుఁడైన కల్యాణబసవేశ్వరుఁడు. అట్టి లోకోత్తరవీరుని యారాధనరూపకముగ వీరశైవలోక మేఁటేఁట యాతనిజయంతి జరుపుట విధ్యుక్తధర్మమని వేఱుగఁ జెప్పనక్కఱ లేదు. ఈ ధర్మనిర్వహణములో వ్యగ్రోత్సాహములఁ బ్రకటించువీరశైవసంఘముల భాగధేయము ప్రశంసనీయము.

జగజ్జేగీయమానములయి, వీరశైవలోకమునకు నిత్యపారాయణములైన బసవేశ్వరుని గుణగణముల వివరించుటకు నేను సర్వథా యసమర్థుఁడను. ఆ మహనీయుని చరితమును

రచించి హరీశ్వరుఁడు, పాలకురికి సోమనాథుఁడు, భీమకవి, సింగరాజు మున్నగు కర్ణాటాంధ్రకవులు తమ వాణిని పునీతమొనర్చి కృతినాయకునితో పాటు తామునుగూడ శాశ్వత యశశ్శరీరులై విరాజిల్లుచున్నారు. అందునను పాలకురికి సోమనాథుఁడాంధ్రుఁడయ్యు బసవేశ్వరునెడ ప్రకటించిన భక్తిపారవశ్య మనన్యసామాన్యము. భీమకవి కన్నడబసవపురాణమునకు సోమనాథుని తెలుఁగు బసవపురాణమే మాతృకయని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. బసవని చరితమును సోమనాథుఁడు బసవపురాణ మను పేరితో పురాణరూపకముగ రచించుటయేగాక వృషాధిపశతకము, చతుర్వేదసారము, బసవోదాహరణ యుగ్మము, పంచప్రకారగద్య, నమస్కారగద్య, అష్టోత్తర శతనామగద్య, అక్షరాంక గద్య పద్యములు, బసవరగడ, బసవాష్టకములు, పంచరత్నములు మున్నగు నెన్నియో లఘుకృతులరూపమునఁ గూడ వెల్లడించియున్నాఁడు. "బసవన్నమహిమ శుంభద్భక్తి యుక్తి బసరించితిని గద్యపద్యాది కృతుల నర్ణవావృతధాత్రియుం దొప్ప బసవ వర్ణనల్ చేసితి" నని భక్తు లుగ్గడించినట్లు బాతఁడు పండితారాధ్యచరిత్రావతారికలో వ్రాసికొన్నాఁడు. బసవేశ్వరుఁడు నాల్గులక్షల యిరువది నాల్గువేల గీతములు రచించినట్లు సోమనాథుఁడు తనబసవపురాణమున నుదాహరించినాఁడు; బసవేశ్వర వచనములని కర్ణాటవాఙ్మయమునఁ బ్రశస్తిగాంచిన యీగీతములలో శ్రీ ... మున్నగు పరిశోధకుల విశేష

పరిశ్రమపూర్వకముగ నిప్పటికేతొమ్మిదివందలలోలభ్యమగుట దుస్తరమయినది. వేదవేదాంతసారములయి అసంఖ్యాకము లగు బసవేశ్వరుని గీతము లనేకములు కాలగర్భమున నడఁగి పోవుట లోకముయొక్క దురదృష్టము. ఇట్టిగతియే సోమనాథుని బసవస్తవములకును ఘటిల్లినది; లెక్కకుమిక్కిలిగ నాతఁడురచించిన లఘుకృతులలో మనకు దొరకినవి బహుస్వల్పములు మాత్రమే. బసవజయంతిని జరుపుటలో శ్రద్ధానుభూతిని జూపు సంస్థలు, సంఘములు, వినష్టములయిన బసవగీతములను సోమనాథునికృతులనుగూడ వెలికిఁదీసి ప్రకటించుటకయి తగినకృషిగావించి చరితార్థత నొందుదురుగాక యని ప్రార్థించుచున్నాను. బసవేశ్వరుని తత్త్వము, చరిత్రము గ్రహించుట కితరులు వ్రాసినకృతులకన్న నాతఁడు స్వయముగ గేయరూపకములుగ రచించిన వచనములే యెక్కువ ప్రామాణ్యమును వహింపఁగలవనుట నిర్వివాదము. రాను రాను ప్రక్షిప్తములుగూడఁ గొన్ని చేరి యీపేరితో వ్యాప్తిలోనికి వచ్చినను శైలి, భాష, లాలిత్యము, మాధుర్యము మున్నగు విశేషములఁబట్టి కర్ణాటవిద్వాంసులు వానిని వేఱుపఱుపఁ గల్గుదురనియే నావిశ్వాసము.

"ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అనునట్లు ధర్మమునకు గ్లాని కలిగినప్పుడు భగవంతుఁడే దానినుద్ధరించుటకయి యవతరించునని భారతీయుల విశ్వాసము. దక్షిణహిందూస్థానమున బసవేశ్వరుని కాలమునకు ముందిట్టి

ధర్మగ్లానిగలిగి, బౌద్ధ, జైన, చార్వాకాదినాస్తికధర్మములు, ఆచరణశూన్యమగు సర్వాద్వైతధర్మము ప్రబలి ప్రజలలో భక్తి నశించి గుణములచేఁగాక జన్మము (కులము) చేతనే మానవుని యాధిక్యము గణ్యమై, యగ్రజన్ముల యొత్తిడి కోర్వఁజాలక సామాన్య మానవలోకము దారిగానక తహతహ లాడుచున్నప్పుడు ధర్మస్థాపనము, వీరమతోద్ధరణము నొనర్ప పరమేశ్వరుఁడే తనకు వాహనము నభిన్నుఁడునగు నందీశ్వరు (ద్వితీయశంభుని) బసవేశ్వరునిగా నవతరింపఁజేసెనని సోమనాథుని బసవపురాణమువలనఁ దెలియుచున్నది. హరీశ్వరుఁడు వృషభముఖుఁ డను ప్రమథుఁడు కొండొక శాపవశమున బసవఁ డయి జన్మించెనని తన బసవరాజదేవరగళెలో వ్రాసి యున్నాఁడు. ఏదియైనను నిందలి ఫలితార్థ మించుమించుగ నొక్కటియే. సర్వమానవసౌభ్రాత్రము బసవేశ్వరుని జీవితము నకు ప్రధానసూత్రము. అందుచే స్త్రీపురుష విభేదము, జాతి విభేదములేక యందఱుఁగూడ నాత్మజ్ఞానముగలిగి శివజీవైక్య సిద్ధిని బడసి తరించుట కర్హులనెడి వీరశైవమతధర్మము నుద్ధరించి క్రియారూపకముగ ననతికాలములో నీమతమును కర్ణాట దేశమున విస్తరింపఁజేసినమహావ్యక్తి బసవేశ్వరుఁడు. "దీయతే లింగసంబంధః క్షీయతేచ మలత్రయమ్ దీయతే క్షీయతే యస్మాత్ తస్మాత్ దీక్షేతి కథ్యతే" అను శివాగమప్రమాణముచే వీరశైవదీక్ష నొందినంతనే సాధకుని మాణవిక, కార్మిక, మాయామలములు నశించి భౌతికశరీరము లింగశరీరముగ మాఱి

యాతని తొంటికులములు, మలములు దగ్ధములయినట్లే గణిం పఁదగుననని, కావున వీరశైవదీక్షితులందఱుసోదరప్రాయులేయని వారిపూర్వజాతిని స్థితిని స్మరించుట పాతకహేతువని శివాగ ములవలననే తెలియుచున్నది. కాని సనాతనమైన యీ ధర్మ ము నామమాత్రమై యాచరణశూన్యమగుటచే పంచాచార్య స్థాపితమయిన వీరశైవము గుంటపూవులు పూయుచు బసవే శ్వరుని కాలమునాఁటికిఁ జాల క్షీణదశయందుండుటచే "సంఘే శక్తిః కలౌయుగే" అనుసూక్తిని జింతించి సనాతనధర్మము నుద్ధరించి వీరశైవ దీక్షాస్వీకారార్హతవిషయమున దేశమున వేళ్లువాఱియున్న వర్ణాశ్రమ వ్యవస్థ ననుసరించి పాటింపఁబడు చుండిన కాలవ్యవధిసంబంధికనిర్బంధముల సడలించి, తొంటి కులములు నాచారము లెట్లున్నను దీక్షితులైన వెంటనే వీరశైవ విశిష్టులైన అష్టావరణ పంచాచారము లవలంబించినంతనే భ్రమరకీటన్యాయమున నంత్యజులుకూడ కులజులుగానే పరిగ ణింపఁబడి పూజింపఁదగుదురని బోధించి తన్మూలమున పతిత జనోద్ధరణమునుగూడ సాధించి వీరశైవమతమును జీవకళా చైతన్యములతో బసవేశ్వరుఁడు సత్వరముగ విస్తరింపఁజేసె ననియు, ఇదియే పంచాచార్యుల వ్యవస్థ కాతఁడు గావించిన ప్రధానసంస్కరణమనియు నేను తలంచుచున్నాను; ఆనాఁడు పంచాచార్యులతో బసవేశ్వరున కీవిషయమున ప్రతిఘటన ముండినట్టులాధారము లేవియు లేవు. ప్రతిఘటన మేదయిననున్న నది స్మార్తబ్రాహ్మణులతోనే యని బసవపురాణమునుబట్టి

ద్యోతకమగును. ఇట్టివిశాలహృదయుఁడగు సంస్కర్త యవతరించుటవలననే దక్షిణహిందూస్థానమున వీరశైవము నేటికిని విస్తరించియుండఁగల్గినది. అట్టివాఁ డుత్తరహిందూస్థానమున నవతరింపకపోవుటవలననే పంచాచార్యసింహాసనములు రెండు కాశీకేదారములయందు నిలిచియున్నను వీరశైవసంఘమచ్చట నామమాత్రావశిష్టముగ నుండుట యేర్పడినది. దీనినిబట్టియే నేటి వీరశైవసంఘము బసవేశ్వరునిఘనకార్యముల కెల్లబుబుణపడియున్నదో గ్రహింపఁదగును. బసవేశ్వరుఁడు గావించిన యీసంస్కరణము నుద్దేశించియే వేమనశివయోగి "ఉర్వివారి కెల్ల నొక్కకంచముపెట్టి పొత్తుగుడిపి కులము పొలియఁజేసి తలనుజేయిపెట్టి తగ నమ్మఁజెప్పరా విశ్వదాభిరామ వినుర వేమ" అని గానమొనరించినాఁడని నాయభిప్రాయము. బసవేశ్వరుఁడుగావించిన పతితజనోద్ధరణ మాపతితజనుల నంతరంగ బహిశ్శుద్ధులకుఁ దానకమయి శాశ్వతఫలదాయక మయినది. నేటిసంస్కర్తల హరిజనోద్ధరణ మట్టిది కాదు. అగ్రిజాతుల మనుకొనువారు, హరిజనులతోఁ జేతులు చేతులు కలిపికొనితిరుగుటవలనను, వారికి దేవాలయములలోఁ బ్రవేశమొసంగినంత మాత్రమునను వారికి వాస్తవముగ నొలికిన దేమియు లేదు. కావున వీరశైవదీక్షామూలకముగ బసవఁడు కావించిన పతితజనోద్ధరణమునకు నేటివారి హరిజనోద్ధరణమునకు హస్తిమశకాంతరమున్నది. త్రికరణశుద్ధి, లింగజంగమములయెడ నభేదభావముతో తను మనో ధన సమర్పణము, అనన్యశరణ్య

బుద్ధితో పరమేశ్వరుఁడగు కూడలిసంగమేశ్వరునందలి విశ్వాస
ము, అన్యదేవతాస్మరణ, భజనరహితమగు నేకేశ్వరోపా
సనము, పరసతీపరధనపరాఙ్ముఖత్వము ననునవి బసవేశ్వరుని
శీలమునకు సహజాలంకారములు. ఇందుఁగూర్చిన హెచ్చరిక
లాతనివచనములలో బహుముఖములఁబ్రిస్ఫుటమగుచుండును.
దయాసత్యశౌచములు లేని మానవునిజీవితము నిరర్థకము;
పురుషార్థములలోఁ బ్రథమమగు ధర్మమునకు దయయే
మూలమని బసవేశ్వరుని యుద్ఘోషము. 'దయ యిల్లద ధర్మ
వదేవుదయ్యా' దయలేని ధర్మ మెట్టిదని యాతఁడు లోకమును
ధట్టించి ప్రశ్నించెను. అతని ధార్మికజీవనమున కాతని కరుణా
ర్ద్రహృదయమే మూలస్తంభము. బసవని ఈ యుత్తమగుణ
విశేషము నెక్కుడుగా గణించి సోమనాథుఁడు 'నీవు దయా
పయోనిధివి' 'బసవయ్య కృపాంబుధి' 'యస్యాపాంగ సహోద
రీచ కరుణా' 'ఇన్వసుమతిఁ బుట్టి భక్తజనవశ్యుఁడవైన కృపా
సముద్ర!' ఇత్యాది వర్ణనములఁ జాల చేసినాఁడు. కరుణారస
మనుగ్రహించువానిని పరిగ్రహించువానిని నిరువురను పవిత్ర
మొనర్చునని పేక్సిఁయరుమహాకవిగూడ వర్ణించినాఁడు.
ఇఁక దానవిషయములో నన్నిదానములలో నన్నదానము
మిన్నయని 'నాన్నోదక సమం దానమ్' ఇత్యాది సూక్తులలో
మనపెద్ద లుద్ఘోషించియున్నారు. జీవికి దీనివలనఁగలుగుతృప్తి
మఱి దేనివలనఁగలుగ నేరదనుట సర్వానుభవసిద్ధము. జంగమ
శబ్దము వీరశైవవాఙ్మయమున కలవాచకముగఁగాక చరలింగ

(జీవిరూపమునచరించు శివుఁడు) ద్యోతకముగనే యుదాహృత మయిన సంగతి విజ్ఞులెల్లరకు విదితమే. కావున నది శివభక్తు లందఱకుఁగూడఁ జెల్లునదియే. 'చరతీతి చరః' 'జంభృశంగచ్ఛ తీతి జంగమః' అను వ్యుత్పత్త్యర్థములు గూడ దీనినే నిరూ పించును. లింగమునకు జంగమమే వదనమని చెప్పి జంగమ సేవవలననే లింగానందముకలుగు ననెడి దృఢవిశ్వాసముతో తనుమనోధనముల నెల్ల నందుకయి వినియోగించిన భక్తి భాండారి బసవఁడు. నిత్యము నాతఁడు లక్ష తొంబది యారు వేల జంగములకు గణార్చన మొనర్చెడివాఁడను వాడుక తర తరఁబుల నుండి వినవచ్చుచున్నది. ఇట్లని సోమరిపోతులెల్ల బసవనియింటఁ జేరి యాతనికందాలో విందు లారగించెడి వారని లోకము భ్రమింపరాదు. బసవఁ డొనర్చెడి జంగమ దాసోహవ్రతములో నర్థి దాత యను తారతమ్యమే లేదు. ఆనాఁటి శరణులుగూడ తృణీకృతహరిబ్రహ్మపురందరులు. అఱలేని శివభక్తి యరచేతిచింతామణియై యుండ బసవని వలెనే వారుగూడ తమయాప్తిశార్థములఁదామే పడయఁగల వలఱులేగాని బడుగులు కారు. "కాయకమే కైలాస" మని గుర్తించి యేదోయొకకాయక మవలంబించి జీవితము నెఱపిన వారేగాని సోమరు లానాఁటి భక్తులలో లేనేలేరు. కట్టెల మారయ్య, కలకేత బ్రహ్మయ్య, మడివాలు మాచయ్య మున్నగుభక్తుల చరిత్రములఁ దిలకించిన నిందలితత్త్వము తెలి యసగును. కావున బసవని భక్తిగౌరవములఁ కలరిమే యూ

నాఁటి భక్తలోక మాతనిసపర్యల స్వీకరించెనని మనము గ్రహింపఁదగును.

'నాకన్న పిన్నలు లేరు. శివభక్తులకన్న పెద్దలు లేరు. నీ పాదసాక్షి. నా మనస్సాక్షి. కూడలసంగమ దేవా! నా కిదియే శ్రేష్ఠము' అను నర్థముగల "ఎన్నిందకిఱియరిల్ల శివ భక్తరిందహిరియ రిల్ల నిమ్మపాదసాక్షి ఎన్నమనస్సాక్షి కూడల సంగమదేవా! ఎనగిదే దివ్య" అను గీతము బసవని యహంకార శూన్యతకు ప్రబలాదర్శము. మఱియు భక్తులెల్ల సాక్షాత్తు కూడలిసంగమేశ్వరుని మాఱటమూర్తులే యని యాతని నిర్మలభావము. ఇందుకొక చిన్నదృష్టాంత ముదాహరింతును. బసవన్న యనుయాయులలో మడివాలు మాచయ్య పేరెన్నిక గన్నవాఁడు. త్రికరణశుద్ధిలో నాతఁడు బసవని కుద్దియైనవాఁడు. నిష్కాపట్యము గల నిష్ఠురవాది. బసవనిభక్తి స్వర్ణభాండారమున కాతఁడు నికషోపలము (గీటురాయి) వంటివాఁడు. ఒకనాఁడొక భక్తుఁడు, బసవనిగీతము నొకటి మాచయ్యయెదుట పాడివినిపించెను. అందెందు చేతనో మాచయ్యదృష్టికిం దక యహంకృతిచ్ఛాయ గోచరించెనఁట. అందుకెంతయుఁగినిసి బసవఁడెంత యవివేకియయ్యెనని, యా జంగమము నెదుట మాచయ్య యేమేమియో యుపన్యసించెను. అనంతర మీసంగతి నాజంగమము తెలుపఁగా బసవఁ డొక్కపరువున యాచయకడ కేఁగి యాతని పాదముల కెరగి 'ఆక్రాంత సంతతాహం[illegible]ధు,

నూర్జితక్రోధు వివర్జితసత్త్వు, దుర్జనాకారు, వనిర్జితకాము, సజ్జానపుంజమున్మ. నపగతి శౌచు, విజ్ఞాన హీను, వివేక విదూరు, నిర్భాగ్యచూడామణిని, భక్తిరహితు, దుర్భావకు. నవినీతుని నన్నునింకఁ, గాచి రక్షింపవే కారుణ్య పాత్ర! యేచిన మద్గర్వ మెల్లమాయించి"- ఇత్యాదిగా నాత్మనింద గావించికొని, "లాలితంబుగ నాల్గులక్షల మీఁద, నోలి నర్వదినాల్గు వేల గీతములఁ, గావించు టెదియెల్లఁ గని యేవగించు, భావన నా కమ్యె నీవు గైకొనమి, నాయతప్రీతి నో యనకున్న నింక, చాయనవయ్య యోసంగయ్యదేవ!" అని మాచయ్య కుమారుణమును వేఁడికొనెను. గంభీరవిగ్రహుఁడయి నెత్తి వాచునట్లు నిష్ఠురోక్తుల నెట్టయెదుట తనతో నాడుచున్నది మాచయ్యయైనను అట్లు పలుకునది నిజగురుఁ డగు సంగమేశ్వరుఁడే యను బసవని భావము గమనింపఁ దగినది. "తండె నీను, తాయినీను, బంధునీను, బళగనీను, నీనల్లదె, మత్తారూ, ఇల్లయ్య! కూడలసంగమదేవా! హాలలద్దు నీరలద్దు (తండ్రివి నీవు, తల్లివి నీవు, బంధువు నీవు, బలగము నీవు, నీవుగాక ఇంకెవ్వరు లేరయా కూడల సంగమ దేవా! పాలముంచుము, నీటముంచుము) సంగమేశ్వరుఁడే సకలమ్మని నెమ్మనమ్మున ముమ్మరమ్ముగ నమ్మిన మహాభక్తునకే యిది చెల్లును గదా!

బసవేశ్వరుఁడు ప్రజ్ఞాచక్షు వని, మహారాజ సచివుఁ డవుటచేత చారచక్షు వని లోకమున కెఱుకపడిన విషయము.

"పలుసందియములఁ దొలఁచుచు, వెలయించు నగోచరార్థవిజ్ఞానము లోకులకక్షి శాస్త్ర మయ్యది, యలవడ దెవ్వనికి వాఁడె యంధుఁడు జగతిన్" అనుసూక్తి కనుగుణముగ శాస్త్రజ్ఞుఁడగుటచే జ్ఞానచక్షుష్మంతుఁడనియు తెలియునగును. ఇట్లీన్ని విధముల చక్షుష్మంతుఁడయిన బసవనికి సోమనాథుఁడు విలక్షణముగా నొకతీరుజను మాంధత్వమును (పుట్టుగ్రుడ్డితనమును) గల్పించినాఁడనిన నది మిక్కిలి విపరీతముగా గోచరింపకపోదు. అదెట్టిదియో శీలకింపుఁడు. "పరవనితాజన భాసురతర ముఖమండల వీక్షణ విధి జాత్యంధాత్" యని చెప్పిన విరోధము కవివర్ణనములో ప్రతిపాదితమయిన విషయము బట్టి విరోధాభాసాలంకారరూపముగ నివారితమయినది. పరవనితాముఖ విలోకన విధియందు బసవేశ్వరుఁడు జాత్యంధుఁడని దీని యర్థము. మహాకవుల వర్ణనము లిట్లే యుండును. బసవేశ్వరుని పరవనితావిముఖత్వమును సామాన్యకవులింతదృఢతరముగ నిరూపింపఁజాలరు. పరధనముపట్లఁగూడ నిట్లేబసవఁడెంతయువిముఖుఁడు, విరక్తుఁడునని ముందే చెప్పియుంటిని. అది యతనకి విషతుల్యము. బసవేశ్వరుని నిత్య జంగమారాధనముల కాతనికి ధనమెట్లు చేకూరుచున్నదని శంకించి, కొండిమంత్రు లాతఁడు రాజభాండాగారమునందలి సొమ్మునే విచ్చలవిడిగా వెచ్చించుచున్నాఁడని బిజ్జలునకు కొండెములు చెప్పుటయు, రాజామాటలువిని కోశాగారమందలిధనమును పలుమాఱులు లెక్కవేయించిచూడఁగ తఱుగేమియు...లేక... యుగా లెక్క... న్నపగ యుండుటయుఁ

గాంచి లజ్జించి చాడీకోరులను శిక్షించుటయు మున్నగు కథలు బసవపురాణాదికములవలన తెలియుసగును. బసవనికి బిజ్జలుఁడొసంగు వేతనమువల్లనే యాతఁడీజంగమారాధనములునిర్వహింపఁగల్గెనా యని కొందఱు శంకింపవచ్చును. నిక్కముగాలోచించిన బిజ్జలుని బొక్కసమందలి రొక్కముమాత్ర మిందుకు సరిపోవునా! అనన్యశరణ్యాబుద్ధితో సంగమేశ్వరుని నమ్మియుండిన మహాభక్తున కసాధ్య మేముండును? ఇందుకు వలసినధన మొసంగునది సంగమేశ్వరుఁడే! జంగమముఖమున దాని నారగించునదియు నాతఁడే! ఒడయలధనమునే యొడయలకొసంగితినని హాజరుజవాబుగా బసవఁడొసఁగెడి సమాధానమందలి పరమార్థ మిదియే. బసవనిశీలమునకు మెఱవడిఁ గూర్చిన గుణగణములఁగూర్చి యిట్టు లెంతయేని చెప్పఁదగును. ఇట్టి మహాపురుషుల స్మరణార్థముగ నిట్టి జయంతులొనర్చుటవలని ప్రయోజనము వారి వర్తనముల నాదర్శములుగ మనమున నిడుకొని కొంతవఱకయిన వానిని మన మనుసరింపఁ గలుగు నాఁడే నెఱవేఱును.

కావుననే, "మనియుండెడి జనమెల్లను, చనిపోయిన వారిదివ్యసత్కథ లెలర్పఁగ, వినవలెఁ గనవలె మనవలె, ననిమిషులకు నైనఁ దెలియ దంత్యము వేమా!" అని వేమనయోగి హెచ్చరించినాఁడు. కావున వీరశైవ సోదరులెల్ల బసవని గుణగణకీర్తనముతో తృప్తిపడక వానిని తమ వర్తనములకు వరవడిగ గ్రహించి యాచరించిననాఁడే చరితార్థత నొందఁగల రని మనవి చేయుచున్నాను.

## బసవేశ్వరుఁడు — బిజ్జలుఁడు

చ. ధరణిని వీరశైవమతధర్మము సన్నగిలంగఁ దత్సము
ద్ధరణముకై శివాజ్ఞఁ బ్రమదంబు మెయింజనుదెంచు నందికే
శ్వరు నవతారమైన బసవప్రభు నాతని రాజు బిజ్జలుఁ
గర మనురక్తినెంచి కలకాలము సన్మతి సంస్మరించెదన్.

వీరశైవమతోద్ధారకుఁ డగు బసవేశ్వరుఁడు పశ్చిమ చాళుక్యచక్రవర్తియగు బిజ్జలునివద్ద మంత్రియై వీరశైవమతమును సంస్కరించి విస్తరింపఁజేసెననుట ప్రఖ్యాతవిషయము. ఇప్పుడు నిజామురాష్ట్రమున గుల్బర్గా ప్రాంతమందున్న కల్యాణపట్టణము పశ్చిమచాళుక్యులకు రాజధానిగా నుండుట చరిత్రప్రసిద్ధము. బిజ్జలుఁడు మొదటఁ బశ్చిమచాళుక్యచక్రవర్తియు, త్రైలోక్యమల్లబిరుదాంచితుఁడు నగు మూఁడవ తైలపదేవుని సామంతుఁడుగా నుండి యాతని ప్రతినిధిగా క్రీ॥ శ॥ 1145 – 1162 ప్రాంతములందు, తద్దవాడి మున్నగు సీమలను బరిపాలించుచు క్రీ॥ శ॥ 1162 సంవత్సరమున స్వతంత్రుఁడయి స్వామిద్రోహ మొనర్చి కాకతిప్రోలరాజు మొదలగువారిసాయముతోఁ దైలపదేవుని నోడించి కల్యాణపట్టణము నాక్రమించి పశ్చిమచాళుక్యరాజ్యమందలి కొంతభాగము నపహరించెను.

అప్పుడు తైలపుఁడు కల్యాణపట్టణమును విడిచి యన్నిగేరి, బనవసి మున్నగు ప్రాంతములందుండి మిగిలిన రాజ్య

భాగములను బరిపాలన మొనర్చుచుండెను. బిజ్జలుఁడు, నాతని పుత్రులు కల్యాణపట్టణమున రమారమి క్రీ॥ శ॥ 1162 – 1182 వఱకుఁ బరిపాలించిరి. మూఁడవ తైలపుని కుమారుఁడు నాలుగవ సోమేశ్వరుఁడు క్రీ॥ శ॥ 1182 ప్రాంతమున బిజ్జలుని పుత్రుల నోడించి తనతండ్రి గోల్పోయిన రాజ్యభాగమును మరలఁ గైకొనెను. ఇవి యుపలబ్ధములయిన శాసనములవలన నిర్ధారితములయిన సుప్రసిద్ధచరిత్రాంశములు.

బసవేశ్వరునిగుఱించి తొలుదొలుత వెలువడిన ప్రమాణగ్రంథ మాంధ్రభాషలో పాలకురికి సోమనాథకవి ద్విపదగా రచించిన బసవపురాణము. సోమనాథుఁడు బసవేశ్వరుని నిర్యాణమునాఁటికి బాలుఁడయి యటుపిదప నాతఁ గాకతిరుద్రదేవుని (మొదటి ప్రతాపరుద్రుని) కాలమున క్రీ॥ శ॥ 1190 ప్రాంతమున బసవపురాణమును రచించి క్రీ॥ శ॥ 1240 ప్రాంతమువఱకు జీవించియున్నవాఁడు. బసవేశ్వరుని యనంతర మత్యంత సమీపకాలమున వెలువడిన గ్రంథమగుటచే బసవేశ్వరుని చరిత్రమువిషయమై యీ గ్రంథమునకున్నంత ప్రామాణ్యము దీనితరువాత వెలసిన మఱి యేకృతులకు నుండఁజాలదు. వీరశైవమతోద్ధరణమున కయి నందీశ్వరుఁడే శివునియాజ్ఞ చొప్పున బసవేశ్వరుఁడయి యవతరించెనని చెప్పి సోమనాథుఁడు బసవేశ్వరుని చరిత్రమును బూసలలో దారమువోలె మఱికొందఱు పురాతనాధునాతన సమకాలీనభక్తుల చరిత్రములతో [illegible] గ్రంథమున

సంఘటించినాఁడు. బసవేశ్వరునివలె సోమనాథుఁడుగూడ నవతారపురుషుఁడే యని వీరశైవుల విశ్వాసము. క్రీ॥ శ॥ 1550 ప్రాంతమున ద్విపదబసవపురాణమును బద్యకావ్యముగా వెలయించిన పిడుపర్తి సోమనాథుఁడు గూడ నీక్రిందిపద్యమునం దీ విషయము నిట్లు వర్ణించెను.

చ. అసదృశ తన్మహామహిమ మారవితారకమై చెలంగ శ్రీ
బసవపురాణమున్ సకలభక్తకథామణి సూత్రభాతిగా
వెస రచియింపు మీవు పృథివీస్థలికింజని నాఁగ భృంగిసం
తసమునఁ బుట్టెఁ బాల్కురికి నామపురీవరసోమనాథుఁడై.

బసవేశ్వరుఁడు తత్సమకాలికు లగు కొందఱుభక్తులు చూపిన మహిమలు బసవపురాణమున నద్భుతముగ వర్ణింపఁబడుటచే నట్టివానియందు విశ్వాసములేని కొందఱు, బసవేశ్వరుఁడు సోమనాథునిచే సృష్టింపఁబడిన యొక కల్పితపురుషుఁడే గాని చారిత్రకవ్యక్తి కానేరఁడని చెప్పు సాహసమునకుఁ గడంగుచున్నారు. భక్తిశూన్యులకు భక్తులమహిమలందు నమ్మకము లేకుండుట సహజమే. కాని భగవంతుని యందును నాతని యత్యద్భుతశక్తిమహిమము లందును విశ్వాసముగలవారికి భగవద్భక్తుల శక్తిమహిమములందుఁ గూడ నవిశ్వాసము కలుగనేరదు. భక్తపరతంత్రుఁడు భక్తపరాధీనుఁడు నగు భగవంతుఁడు భక్తులకుఁ బ్రత్యక్షమయినప్పుడు తనకంటెఁ దనభక్తు లెక్కువవారని వక్కాణించియుండుట శైవ వైష్ణవపురాణములెల్ల ముక్తకంఠముతోఁ బలు

మాటలు ఘోషించియున్నవి. కావున మహాభక్తులు పర
మేశ్వరుని యవతారమూర్తులే యని తలఁచువారికి సోమనా
థుని వ్రాఁతలయం దవిశ్వాసము పొడముటకుఁ గారణము
లేదు.

బసవేశ్వరుఁడు చారిత్రకవ్యక్తి కాఁడని తలంచు ప్రబు
ద్ధులు వచించు కారణాభాసములలో ముఖ్యము లయినవి.

(1) అట్టిపురుషుఁడు వాస్తవముగా నుండి పశ్చిమ
చాళుక్యచక్రవర్తి యగు బిజ్జలునకు మంత్రిగానే యున్నచో
నాతనిశాసన మొక్కటయిన దొరకకుండునా యనుట.

(2) బిజ్జలునిశాసనములందయిన నాతఁ డుదాహృ
తుఁడు గాకుండుట. నేఁటివిద్యాధికులకు శిలాతామ్రశాసనము
లందలి వ్రాఁతలపైఁ గల ప్రమాణబుద్ధి మహాకవులకావ్య
ములలోని వాక్యములయెడ లేకుండుట శోచనీయము.

శాసనములు వెలయించుటకు బసవేశ్వరుఁడు మంత్రి
గనేగాని సార్వభౌముఁడుగా నుండలేదని పాఠకు లెఱుంగవ
లెను. భూము లిచ్చినను, నగ్రహారము లిచ్చినను, దాని
రాష్ట్రాధిపతియే యగుటచే శాసనము లాతని పేరనే యుండు
గాని యాతనిమంత్రులపేర వెలువడనేరవు. ఇంతకు బసవేశ్వ
రుఁడు మహాభక్తుఁడు. ఆతఁ డొసంగినదానములు పేరు కొఱ
కుఁ గీర్తికొఱకుఁ జేయఁబడినవి కావు. అతఁడు నిరంతర మొ
ర్చిన [illegible] భక్తులకర్పించినమే కా
ప్రత్యేకవ్యక్తులకు స్థిరవసతిరూపమున నొసర్చిన భూ

చానము కాదు. మఱియునప్పటిభక్తవరులుకూడఁ దృణీకృత హరిబ్రహ్మపురందరులు. అర్థి, దాత యను తారతమ్య బుద్ధితో బసవేశ్వరుఁ డర్చనము చేసియున్నచో నాతనిసపర్య లను వారు గణించెడివారు కారు. సకలార్థసిద్ధిప్రదం బగు శివభక్తి వారి కరిచేతిచింతామణి యై యుండ నిచ్ఛామాత్ర మునసే యిష్టార్థములఁ బడయుటకు వారు సమర్థులయియుం డిరి. బసవేశ్వరుఁ డెంత మహాభక్తుఁ డయినను మధ్యమధ్యఁ గొన్ని భక్తిధర్మసూక్ష్మములలోఁ దేలిపోవుచుండెననియు, మడివాలు మాచయ మున్నగు భక్తవరు లిట్టియెడల బసవే శ్వరునిచర్యలను దీవ్రముగ నిరసించి యాతనికి వినిర్మలభ క్తిని బ్రబోధించుచుండిరనియు బసవపురాణము, బ్రభులింగ లీలయుఁ జదివినవారికిఁ దెలియఁగలదు.

Iఁ స్వాతిశయసూచకముగఁ గాఁబోలు బసవేశ్వరుఁ డెప్పుడో రచించిన చిన్నగీత మొకభక్తుఁడు గాన మొన ర్పఁగా మడివాలు మాచయ్య "శివశివా" యని చెవులు మూసికొని బసవేశ్వరుని దూలనాడినవాక్యములను నీసంగతి విని మాచయ్యకుఁ బాదాక్రాంతుఁ డయి బసవేశ్వరుఁ డాత నిని వేఁడికొనిన క్షమావచనములను దిలకింపుఁడు.

"మఱికొన్నిదినముల కలలేక బసవఁ
డఱిముఱి నొకగీత మానతిచ్చుకును
శివ శివ యని కేలు సెవులఁ జేర్చుచును
నవినీతుఁ డిట్లుండె హా ! కల్లినాథ !

చెల్లబో ! దీనులఁ జేసి శరణుల
కెల్లను దా నొక యిచ్చువాఁడయ్యె
ఎన్నఁడు గోఁతియయ్యెను వెక్కిరింప
ఎన్నఁడు గఱచె నిం కెక్కడిభక్తి
దోసంబు గాదె భక్తులు దీని విండ్రె
బాసలు గీసలు వాటవాడకుఁడు
మాయొద్ద ననుచును మాచయ్య గినిసి
కాయకంబున కరుగంగ నిక్కడను
నంతనంతయు విని యాత్మలోఁ గలఁగి
యంతంత ధరణి సాష్టాంగంబు లిడుచు
బసవఁడు భక్తజనసహాయుఁ డగుచు
వెస నేఁగుదెంచి భయసమగ్రవృత్తి
మడివాలు మాచయ యడుగులపొంతఁ
బుడమి సర్వాంగముల్ వొందంగ మ్రొక్కి
"యాక్రాంతసంత తాహంకారనిరతు
నక్రమాలాపు నిర్వక్రాపరాధు
నూర్జితక్రోధు వివర్జితసత్యు
దుర్జనాచారు ననిర్జితకాము
నజ్ఞానపుంజంబు నపగతశౌచు
విజ్ఞానహీను వివేకవిదూరు
నిర్భాగ్యచూడామణిని భక్తిరహితు
[illegible]

గాచిరక్షింపవే కారుణ్యపాత్ర
యేచిన మద్గర్వ మెల్ల మాయించి

*   *   *

యనుచు నిట్లాత్మనిందాతిదీనోక్తు
లను విన్నవించుఁడు విననట్లు వినియు
జంగమపరతంత్రుఁ డంగావికారి
లింగదమాచఁ డాలీఢశౌర్యుండు
"అధముఁడా! క్రొవ్వితే హరభక్తు లరయ
నధములే? నీ వొక యర్థాధిపతివే
అడిగెడువారు లే కయ్యె నీవింత
బడగవైతివి! మజ్జ! బాపురే! యనుచు
అట్టియాచకుల నే నటుగందుఁ గాని
యిట్టిత్యాగులఁ గాన మేలోకములను
పాన విన్నియు నేలఁ బసవ! నీయిచ్చు
నేసికదున్నలు నిలఁ బచ్చమన్న
గుఱ్ఱపుఁగాడిదల్ గుటీలంపుసతులు
నట్టికోకలు బ్రాఁతియే శరణులకు
నీదిక్కు చూడుమా నాదుజంగమును
పేదఱికము లేని పెల్లుసూపెదను

*   *   *

"నీమహత్త్వముఁ జూడ నే నెంత వాఁడ
ధీమణి! సంగయ్యదేవ! సర్వజ్ఞ!
నీవు శంకరుఁడవు నేను గింకరుఁడ

నీవు నిర్మలుఁడవు నేను దుర్మలుఁడ
*　　　*　　　*
పొరినిట్టి దుర్గుణంబుల ప్రోఁకలోన
నరయంగఁ గలదె నాయందు సద్గుణము
రక్షింపు మిట్టిగర్వ ప్రాపు నన్ను
శిక్షింపవే! యయ్య! జియ్య! నాదైన
యపరాధశతసహస్రావలి సైఁచి
విపరీతమహిమాఢ్య! వేయును నేల!"
అనుచున్న బసవన్న నందంద కౌఁగి
టను జేర్చి కారుణ్యవనధి నోలార్చె.

11. బసవపురాణము పంచమాశ్వాసమున వర్ణితమై
మోళిగ మారయ్యగారి కథలోఁగూడ బసవేశ్వరునికి గర
భంగ మయినమజీయొక సంవిధానము గాననగును. మారయ
యడవిలోఁ గట్టెలుకొట్టి తెచ్చి యమ్మికొని జీవించుచు
యథాశక్తి భక్తిశ్రద్ధలతో జంగమార్చనలు సలుపుచుండెను
ఈతనిచే నర్చితులయిన జంగములు బసవేశ్వరునింటి కే
నప్పు డీతని యర్చావిశేషములఁగూర్చి ముచ్చటించి
కాయకష్టమునకు లోనయి జీవించుచు నిట్టి జంగమార్చనల
సేయు మారయ్యవృత్తాంతమునకు సంతసించి బసవేశ్వరు
డట్టిభక్తునకుఁ దానుగూడ సాయ మొనర్చుట విధియ
తలంచి జంగమవేషమున మారయ్య యింటలేనిసమయము
వచ్చుటి కేతెంచి "అమ్మా! యాఁకలిచే బాధప

చున్నాను. మారయ్యగారు వచ్చువఱకు నిలువఁజాలను. చరచర ప్రసాదము వడ్డించి యాఁకలిని బోకార్పు" మని యాతనిభార్యతోఁ జెప్పి యామె యొసంగినపదార్థముల భుజించి యామెకుఁ దెలియకుండ రెండువేల బంగారు మాడల నొకపల్లెరముక్రింద నిడికించి వెడలిపోయెను. మారయ్య యింటి కేతెంచి జంగమార్చనావసరమునఁ బళ్ళెరముల సవరించుటలో నీబంగారుమాడలను గాంచి యవి యెట్లువచ్చినవని భార్యను బ్రశ్నించెను. ఆమెయు నిర్విణ్ణయై "నా కేమియుఁ దెలియదు మీ రింటలేనప్పు డొకయయ్య యేతెంచి యాఁకలికిఁ దాళఁజాలనని ప్రసాదము భుజించి వెడలిపోయెను. ఇంతకన్న నే నేమియు నెఱుఁగ" నని ప్రత్యుత్తర మొసంగెను. మారయ్య యిది బసవనికృత్యమయి యుండునని గ్రహించి యాతనికి బుద్ధిచెప్పెదఁగాకయని జంగమములను బూజించి వారి పాదోదకమును దాను దెచ్చిన కట్టెమోపులపైఁ బ్రోక్షించెను. అప్పు డాకట్టెలన్నియు సువర్ణఖండములు గాఁగ జంగమమున కొకవేయి మాడలు చొప్పునవానినెల్ల మారయ్య వారికి సమర్పించెను. ఈ వృత్తాంతమును జంగములవలన విని బసవఁ డచ్చటి కేతెంచి మారయ్యగారిపాదములపైఁబడి "మహాత్మా! నాయపరాధమును సైరింపవే" యని ప్రార్థించెను. మారయ్యయు నాతనిఁ గాంచి "అయ్యా! నీ వేమియపరాధ మొనర్చితివి? నేను నిన్నేమంటిని? నేను నిన్ను క్షమింపవలసిన దేమి? విడిము

డిగల యొడయఁడవు. నీవుగాక మావంటిబడుగులకు మఱి యేడుగడ యెవరు" అని మృదురీతి నాతని మందలించి లేవ నెత్తి ప్రబోధించెను.

III. భక్తజనోద్ధరణమునకయి యవతరించిన యల్లమ ప్రభువుచరిత్రము నాకర్ణించి యా మహానుభావుఁ డెప్పుడు తనకు దర్శన మిచ్చి తన్నుఁ దరింపఁజేయునా యని బసవే శ్వరుడు నిరీక్షించుచుండెడివాఁడు. అట్టియెడ నొకనాఁ డల్ల మాఁడు కల్యాణమున కేతెంచి వీధిలో నిలువఁబడి తనరాకను బసవేశ్వరునకు ద్వారపాలకుల ద్వారమున గబురంపెను. అప్పుడు బసవేశ్వరుఁ డిష్టలింగార్చనమం దుండెను. సాక్షా చ్ఛివస్వరూపుఁ డగు నల్లమప్రభు వేతెంచినపు డిష్టలింగార్చ నముతో నేమి యని వెంటనే యిష్టలింగపూజ నంతతోఁ గట్టిపెట్టి యెదురేఁగి శరణుచేసి యల్లముని స్వయముగా లోనికిఁ దీసికొనివచ్చుటకై చనుదేరక బసవేశ్వరుఁడు 'లోనికి దయచేయుఁ' డని యొక చారునివలన నల్లమునకు వర్తమాన మంపెను. ఇది విని యల్లముఁడు చరలింగపూజకన్న నిష్టలింగ పూజన మెక్కు డనుబుద్ధి బసవని కెవరు చెప్పిరని నవ్వి లోని కేఁగక వచ్చినదారినే మఱలిపోఁదొడఁగెను. అప్పుడుకూడ మడివాలు మాచయ్య బసవనిఁ దగువిధమున మందలించి భక్తిమర్మములం దింకను బాలుఁడయియున్న బసవనికి వాని నుద్బోధించి మన్నించుట మంచిదిగాని కినుకతో మఱలిపో వుట పాడికాదని యల్లముని సాంత్వవచనములతో వేఁడికొని యూతనిని ప్రసన్నునిఁ గావించెను.

"మృడునిభక్తులలోని మెరమెర వోవఁ
గడిగి నిర్మలములు గావించుకతన
మడివాలుఁ డనెడునామము దగు ననఁగ
మడివాలు మాచయ్య మహి వన్నెకెక్కె."

అని ప్రభులింగలీల మాచయ్యనుగూర్చి చెప్పుచున్నది.

ఇట్టిపరిస్థితులలో సట్టిమహాభక్తులనడుమ వర్తిల్లిన బసవేశ్వరుఁడు విజయశ్రీ ప్రశస్తికై శాసనము లేమయిన నెలకొలిపిన నాతని గౌరవ మేమయిన నిలుచుట కవకాశ ముండెడిదేమో పాఠకు లూహింతురుగాక. బసవేశ్వరుఁడు చాళుక్యరాజ్యమంత్రి యైనను నాతనిశాసనములు లేకుండుటకిదియే కారణము ఇఁక బసవేశ్వరుఁడు నిజమహిమచేతనే తన యాశ్రియుల యభిమతములఁ గూర్పఁగలిగినప్పుడు తన యేలిక యగు బిజ్జలునిచే వారిని సత్కరింపఁ జేయవలసిన యావశ్యకత యాతనికి లేకుండెను. ఇందుచే బిజ్జలుని దానశాసనములలోఁగూడ నాతనిప్రసక్తి యుండుట కవకాశము కలుగలేదు. కావున శాసనములలో నుదాహృతుఁడు కానంతమాత్రమున బసవేశ్వరుఁ డొక కల్పితవ్యక్తియని బుద్ధిమంతులు దలంపఁజాలరు. సోమనాథుఁ డెంతబసవభక్తుఁడయినను బసవేశ్వరుని గుణదోషములనెల్ల నిష్పక్షపాతముగఁ దాను విన్నవిధమున వర్ణించియున్నవాఁడు. కావున నాతఁడు బసవపురాణమునఁ జెప్పినవిషయము లతిశయోక్తు లనిగాని యప్రమాణము లనిగాని త్రోసిపుచ్చుట కవకాశము లేదు. ఇఁక

బసవేశ్వరునిసమకాలీనులుగ సోమనాథుఁడు వర్ణించినభక్తులలో ఏకాంతరామయ్యనుగూర్చి యాతఁడు వర్ణించిన విషయములు క్రీ॥ శ॥ 1190 ప్రాంతమున కామదేవుఁ డను కదంబరాజుకాలమున వెలసిన అబ్లూరుశాసనములో నించుమించుగ నొకేవిధమున నుదాహృతములగుటచే సతనిత్రాంత లయొక్క ప్రామాణ్యము మఱింత రూఢి యగుచున్నది.

ఈ శాసనమున బసవేశ్వరుని పేరుదాహృతము గాకున్నను ఏకాంతరామయ్య చూపినమహిమలు నాతనికి బిజ్జలుఁ డొనర్చిన సమ్మానము పేర్కొనఁబడినవి. ఈ శాసనమును బట్టి యానాఁటిభక్తుల మహిమలఁ గూర్చియు బసవేశ్వరాదుల యునికిని గూర్చియు నిప్పుడు చాలమందికిఁ గొంత యెక్కయిన నమ్మకము కలుగుచుండుట సంతసింపఁదగియున్నది. ఏకాంతరామయ్యయే బసవేశ్వరుఁ డయియుండునేమో యని కొందఱు తలంచుచున్నారు. అది కేవల మసంగతము. వారు భిన్నవ్యక్తులని సోమనాథుని బసవపురాణమునలన విశద మగుచున్నది. క్రీ॥ శ॥ 1280 నాఁటి మరడీపురశాసనమున నుదాహృతు లయినభక్తులలో సంగనబసవయ్య ఏకాంతరామయ్య యనునామములు వేర్వేఱుగఁ బేర్కొనఁబడినవి.

ఇట్లుండ మైసూరువాస్తవ్యులు శ్రీ యస్. శ్రీకంఠశాస్త్రి, ఎం. ఏ. గారు కర్ణాటసాహిత్యపరిషత్పత్రిక బహుధాన్యసంవత్సర మార్గశీర్షసంచికలో బసవేశ్వరునిఁగూర్చి వ్యాసము వ్రాయుచు నాతని తరువాత నొకశతాబ్దిలో

అనఁగా క్రీ॥ శ॥ 1251 - 1280 సంవత్సరముల మధ్య వెలసిన కొన్నికన్నడ శాసనములలో బసవేశ్వరునినామోల్లేఖన ముండుటచేతను, యాదవ కృష్ణరాజుల అర్జునగి (అర్జునవాడ) శాసనము (క్రీ॥ శ॥ 1260) వలన మాదిరాజపుత్రుఁ డగు సంగనబసవని వంశమువారు దానము గ్రహించిరని తెలియుటచేతను సంగన బసవేశ్వరుఁడు చారిత్రకవ్యక్తియే యను విషయము స్పష్టమగుచున్నదని యంగీకరించుచు నాతని యేలిక యగు బిజ్జలుని కాలమును సరిగా నిర్ణయింపనేరక యాతనింగూర్చి కొన్ని సంశయములం బ్రకటించిరి. వీరి వ్యాసమున కనువాదమును శ్రీ జి. వీరనాగేంద్రులుగారు విభూతిపత్రిక నాల్గవసంచికలోఁ బ్రకటించియున్నారు.

శ్రీకంఠశాస్త్రిగారు తమ వ్యాసములోఁ దాము పేర్కొన్న హిరియూరు, అర్జునగి, చౌడదానుపుర, కల్లెదేవరపుర, మరడీపుర, కణ్ణనూరు శాసనము లన్నియు బసవని కాలముకంటె సుమారు ఒక శతాబ్దికిఁ దరువాతివనియు వానియం దనేక చరిత్రానర్హ విషయము లంతర్గతము లైయున్నను గొన్ని తథ్యాంశములు కనఁబడుచున్నవనియు, గ్రంథములుకూడ రెండవప్రతాపరుద్రుని సమకాలీను లగు పాల్కురికిసోమన, హరీశ్వరుల యనంతరమే ప్రాముఖ్యము నంది యుండుటచే బసవనిసమకాలీనములు కావనియు వ్రాసియున్నారు. సోమనాథుఁడు, హరీశ్వరుఁడు రెండవప్రతాపరుద్రుని కాలమువారని తలంచుటలో వీరు గొప్పప్రమాదమునకు

లో నైరి. అల్లించుటకుఁ గల కారణము లనైనను వీరు తమ వ్యాసమునఁ బ్రకటింపరైరి. కర్ణాటకకవిచరిత్రకారు లగు శ్రీ నరసింహాచార్యులుగారు హరీశ్వరుఁడు బసవేశ్వరునకు సమకాలీనుఁడై క్రీ॥ శ॥ 116 – 1168 ప్రాంతములం దుండెన నియు; సోమనాథుఁడు బసవేశ్వరునితరువాత నత్యంత సమీపకాలమున మొదటిప్రతాపరుద్రుని కాలమున క్రీ॥ శ॥ 1195 ప్రాంతమున నుండెననియు నిర్ణయించియున్నారు. సోమనాథునిఁగూర్చి వీ రొనర్చిన యీ కాలనిర్ణయమును ఆంధ్రకవిచరిత్రకారు లగు శ్రీ వీరేశలింగముపంతులుగారు, ఆంధ్రులచరిత్ర రచించిన శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు, బసవపురాణపీఠికాకర్త లగు శ్రీ ప్రభాకరశాస్త్రిగారు నించుమించుగ నంగీకరించియున్నారు. నేనుగూడ 1922 సం॥ ర ప్రాంతమునుండి సోమనాథునిఁగూర్చి పరిశోధన మొనర్చి వ్రాసిన వివిధవ్యాసములలోఁ బయి కాలనిర్ణయము నంగీకరించుచు నాతఁడు బసవేశ్వరునకు సమకాలీనుఁడు మాత్రము కాఁడనియు, బసవేశ్వరుఁడు లింగైక్య మొందిన క్రీ॥ శ॥ 1168 ప్రాంతమునాఁటికి పది పదిరెండేండ్ల బాలుఁ డయియుండి మొదటిప్రతాపరుద్రుని కాలములో క్రీ॥శ॥ 1195 ప్రాంతమునాఁటికి బసవపురాణాదిరచనముచేఁ బ్రసిద్ధుఁడయి క్రీ॥ శ॥ 1220–1230 ప్రాంతమునఁ బండితారాధ్యచరిత్ర రచియించి క్రీ॥ శ॥ 1240 ప్రాంతమునవఱకు జీవించియుండెననియు నిరూపించియుంటిని. ఇందొనర్చిన యీనిర్ణయములఁ బరికింపక శ్రీకంఠ

శాస్త్రిగా రన్యథా తలంచుట యాశ్చర్యము. వేయేల! కన్నడకవి సోమరాజు తానురచించిన ఉద్భటచరిత్రము శా॥ శ॥ 1144 (క్రీ॥ శ॥ 1222) సంవత్సరములో రచించితి నని వ్రాసికొని యుందులో హరీశ్వరుని, సోమనాథుని, పద్మ రసు నొక్కపద్యమునందే స్తుతించియున్నాఁడు-చిత్తగింపుఁడు.

మ॥ ప్రమథానీకకథాకర్ణవేందుహరిదేవాచార్యనం ధైర్యనం
సముదంచద్వృషభస్తవామరమహీజారామనం సోమనం
విమలజ్ఞానసుదీపికాస్ఫురితచేతస్సద్మనం పద్మనం
క్రమదిందంబలగొండుపేళ్వెనాసెదానీవొవ్యమంసేవ్యమం.

మ॥ జననాథోత్తమ సోమరాజనుసిర్దీ కావ్యంపలం శాలివా
హనశాకాబ్ద మదెయ్దెసాసిరద నూఱింం సందనాల్వత్తు నా
లు-నె యారంజిత చిత్రభానువరాశ్వీజ్యోత్స్నైకాదశీ
వనజాతారి తనూజ వాసర దొళాదత్తల్లమంగర్పితమ్.

ఇందువలన హరీశ్వరుఁడు, సోమనాథుఁడు క్రీ॥ శ॥1220 కంటె పూర్వపువా రయియుండవలె ననుట నిర్వివాదముగ నంగీకరింపవలెనుగదా. రెండవప్రతాపరుద్రుఁడు కాకతీయ సామ్రాజ్యము ను క్రీ॥ శ॥ 1295 నుండి 1326 వఱకుఁ బరిపా లించినవాఁడు. కావున శ్రీకంఠశాస్త్రిగారి వ్రాఁత కేవల మసంగత మని వేఱ చెప్పనక్కఱలేదు. హరీశ్వర సోమనాథు లించుమించుగ బసవేశ్వరునిసమకాలీను లగుటచే బసవేశ్వరు నిఁగూర్చి వారు వ్రాసినచరిత్రమునకే యెక్కువప్రామాణ్య మొసంగక తప్పదు. తరువాత నెప్పుడో రనూరమి నూఘు

సంవత్సరములలో వెలసిన శాసనములలో నందుకు వ్యతిరేకము లగు విషయములున్నను వానికి హరీశ్వరసోమనాథుల రచనములకంటె విశేషప్రామాణ్యము కలుగనేరదు. ఇంతకు శ్రీకంఠశాస్త్రిగా రుదాహరించిన శాసనము లేవియుఁగూడ నీకవివరుల గ్రంథస్థవిషయముల కెంతమాత్రము వ్యతిరేకముగా లేవనియే నాయభిప్రాయము. పరస్పరసమీకరణ మొనర్చి విమర్శకులు వాని సమన్వయము చేసికొనఁదగును.

మొదట మూఁడవతైలపుని సామంతుఁడుగా నుండి తరువాత నాతనిపశ్చిమచాళుక్యరాజ్యము నాక్రమించి కల్యాణపట్టణము రాజధానిగాఁ దద్రాజ్యమును బరిపాలించిన బిజ్జలుఁడు చంద్రవంశక్షత్రియుఁడు, హైహయాన్వయుఁడు, కలచుర్యవంశ్యుఁడు నని యాతనిశాసనములవలన వ్యక్తమగును. అబ్లూరుశాసనమున నాతఁడ శల్లె యుదాహరింపఁబడినాఁడు. పశ్చిమచాళుక్యరాజ్యపరిపాలకుఁ డగు నీ బిజ్జలుఁడు గాక యీ పేరుగల రాజులు మఱికొంద ఱుండుటచే నిందులో బసవేశ్వరునియేలిక యెవ రనువిషయము సంశయాస్పదముగ నున్నదని వ్రాయుచు శ్రీకంఠశాస్త్రిగారు తమ పూర్వోక్త వ్యాసమున క్రీ॥ శ॥ 1168—1177 ప్రాంతములవఱకుఁ గల్యాణపట్టణము నేలిన రాయమురారిసోవిదేవుని పాదపద్మోపజీవియై యాతనికి సామంతుఁడై తరికాడునాడు పరిపాలించుచుండిన సింద్ వంశ్యుఁడగు బిజ్జలుఁడే (క్రీ॥ శ॥ 1169—1174) బసవేశ్వరుని యేలికకాఁదగునని నిర్ణయించిరి. ఆ కాలమునందే

రాయమురారిసోవిదేవుని నాల్గవపాలనసంవత్సర మగు క్రీ॥ శ॥ 1171 సం॥లో వెలయింపఁబడిన *మడగిహాళుశాసనమునందుఁ జతుర్థకులజుఁ డగు మఱియొక మాళిగె బిజ్జనాయకుఁ డుల్లేఖింపఁబడి యున్నాఁడనియు, తరికాడునాడునందలి మంగళవేఢ యాతని రాజధానిగా నుండెననియు, బిజ్జలుని మరణమునకుఁ గారణుఁడుగా బసవపురాణమున వర్ణితుఁ డయిన మధుపయ్య మంగళవాడయందే వసించియుండెనని 1926వ సంవత్సరము నవంబరు నెల 'శివానుభవ' పత్రిక సంచికలో నున్నదనికూడ వీరు వ్రాసియున్నారు. రాయమురారి సామంతులుగ నించుమించుగ నేకకాలముననే తరికాడునాడు పరిపాలించిన యీ బిజ్జనాయకుఁడు, బిజ్జలుఁడు నేకపురుషుఁడా, భిన్నపురుషులా? యని సందేహము కలుగవచ్చును. కాని వారి తలిదండ్రులపేరులు సోదరుల నామములు బిరుద

* "శ్రీకంఠశాస్త్రిగారు వ్రాసినట్లు మాళిగె బిజ్జనాయకుఁడు మంగళవాడ రాజధానిగాఁ బరిపాలించె ననుటకుఁ దగినయాధారములు కానరావు. మాదగిహాళ శాసనమునం దాతని రాజధాని మాళిగె యను పట్టణమనియే స్పష్టముగాఁ జెప్పఁబడినది. ఆ మాళిగయే తరువాత మాదగిహాళ నామమున వ్యవహరింపఁబడుచున్నది. సిందవంశబిజ్జణున కయినను మంగళవాడ రాజధానిగా నుండె ననుట కాధారములు మృగ్యములు. శాస్త్రిగారు కూడ వాని నుగ్గడించియుండలేదు. కొంతకాలము మంగళవాడలోను నటు తరువాతఁ గల్యాణపట్టణమునను బరిపాలించినవాఁడు రాయమురారి సోవిదేవుని తండ్రి బిజ్జలుఁ డొక్కరుఁడే కావచ్చునున్నాఁడు.

ములుగూడ శాస్త్రిగారు వివరించియుండుటచే వా రిరువు
భిన్నపురుషులే కాఁదగుదని తలంపవచ్చును. ఇరువురన
గూడ నీ సందర్భమునఁ బేరొ్కనుటచే సింద్ వంశ్యుఁ డగ
బిజ్జణుఁడే బసవేశ్వరుని యేలిక యని తుదకు నిర్ణయించి
నను వీరిలో నెవరోయొకరు బసవేశ్వరుని యేలిక కాఁదగున
శ్రీకంఠశాస్త్రిగారి యభిప్రాయ మైనట్లు మనము గ్రహిం
వచ్చును. ఇట్లు వీరు తలంచుటకుఁగల ముఖ్యకారణములు:

(1) హరీశ్వరుఁడు తాను రచించిన రగళయందు బ
వేశ్వరునిఁగూర్చి "నీవు బిజ్జళరాయఁ డుండు మంగళవాడ
హొమ్మ" అని చెప్పియాతఁ డచట బిజ్జలుని సేవించి జీవిం
నని చెప్పియుండుట.

(2) పాలకురికి సోమనాథుఁడు పండితారాధ్యచరి
మున—

"అవనిలోఁ జాళుక్య లను పేరు హరుని
కవిలను దుడిపించి కల్యాణకటక
మీఁడితభక్తిమహిమ్మత పేర్మిఁ
బాడుగా శపియించె బసవనమంత్రి."

అని బిజ్జలుని నాతనిసంతతిని జాళుక్య లని చెప్పి కా
చుర్యు లని చెప్పకుండుట.

(3) బసవేశ్వరునికిఁ బూర్వ మతనిమేనమామ బల
వుఁడు బిజ్జలుని మంత్రిగా నుండెనని బసవపురాణమునఁ జెప్
బడుట పూర్వోక్తావాన్వయము డైవ సింద్ వంశ బిజ్జణుని యధికా

లగు బలదేవనాయక, సొంటూరి దాసిమయ్య, అమృత రాశిదేవులకు క్రీ॥ శ॥ 1174 సం॥ రములో దాన మొసంగఁ బడిన శ్లోకశాసనమునందుఁ జెప్పఁబడుటచే నీ బలదేవనాయ కుఁడే బసవేశ్వరుని మేనమామ కాఁదగునని శాస్త్రిగా రూ హించుట.

హరీశ్వర సోమనాథులు బసవేశ్వరుని స్వయముగ నెఱిఁగినట్లుగాని యాతనికాలముననే కల్యాణపట్టణప్రాంతమున నుండినట్లుగాని తలంచుట కెట్టియవకాశములును లేవు. సోమ నాథుఁ డాంధ్రదేశీయుఁడు, ఓరుగల్లుప్రాంతమందలి పాలకు రికి వాస్తవ్యుఁడు. "ప్రస్తుతింపంగ సద్భక్తివిస్ఫురణఁ, బ్రస్తుతి కెక్కిన బసవనిచరితఁ, జెప్పితి భక్తులచే విన్నయాడ్కిఁ, దప్పకుండఁగను యథాశక్తిఁ జేసి" అని యాతఁడే బసవ పురాణమునఁ జెప్పికొనియుండుటచే నాతఁడు స్వయముగా బసవేశ్వరు నెఱుఁగఁడనియు నాతనికి సమకాలీనుఁడు కానేరఁ డనియు విస్పష్టము. బసవేశ్వరునిర్యాణమునాఁటి కాతఁడు బాలుఁడయి తరువాత మొదటి ప్రతాపరుద్రునికాలమున క్రీ॥ శ॥ 1195 ప్రాంతమునఁ బ్రసిద్ధి కెక్కియుండునని వెనుకనే చెప్పియుంటిని. హరీశ్వరుఁడు పంపావిరూపాక్షస్వామి భక్తుఁ డయి పంపావిరూపాక్షశతకము, గిరిజాకల్యాణము, శివగణ దరగళె యను గ్రంథములను గన్నడమున రచించినవాఁడు కావున నాతనినివాసస్థలము బళ్లారిప్రాంత మని తలంపవచ్చును. ఈతఁడు బసవేశ్వరునిఁగూర్చి ప్రత్యేకగ్రంథ మేదియు రచించి

నట్లు కానరాదు. తాను విన్న పూర్వశివభక్తులఁగూర్చి రగడ రచించుచు నించుమించుగఁ దనసమకాలీనుఁ డగు బసవేశ్వరునిమహిమాదికములనుగూడ వినినవాఁ డగుటచేఁ దన రగడలో నాతనినిగూడ నించుక ప్రశంసించినట్లు కానవగును. సోమనాథునకంటె నాతఁ డొకించుక పూర్వుఁడుగఁ గాన్పించుటచే నాతనివాక్యముల ప్రామాణ్యముగూడఁ ద్రోసిపుచ్చఁ దగినది కాదు. పండరపురసమీపమందున్న మంగళవేఢ యా కాలమునఁ బశ్చిమచాళుక్యరాజ్యమున నొక ముఖ్యస్థానముగ నుండియుండును. మూఁడవ తైలపుని సామంతుఁడుగా నుండిన మొదటిబిజ్జలుఁ డా తైలపదేవుని ప్రతినిధియై, తర్దవాడి, తరికాడు మున్నగుసీమలకెల్ల నధికారియై పరిపాలించుచుండినట్లు కానవచ్చును. ఇతఁడు స్వతంత్రుఁడు గాక పూర్వమితని యధికారులు మైతారదండనాథుఁడు మొదలగువారు ప్రకటించిన విజాపురము, బెలగాము (బలగామి) శాసనములు మున్నగునవి యచ్చట నెలసినవే. కావున నప్పు డతనికి మంగళవేఢ (మంగళవాడ)యే రాజధానిగా నుండియుండును. ఇంతయేల ? శాస్త్రిగా రుదాహరించిన మడగిహాళు శాసనమునందే రాయమురారితండ్రి బిజ్జలుఁడు నాతనిపూర్వులు మంగళవేఢయందే రాజ్య మొనర్చిరని విస్పష్టముగఁ జెప్పఁబడియున్నది. ఈ మంగళవేఢకుఁ బశ్చిమచాళుక్యరాజధాని యగు కల్యాణపట్టణమునకు రమారమి నూఱుమైళ్ల దూరమున్నది. బిజ్జలుఁడు నాతనియనంతర మాతనితనయుఁడు

రాయమురారిసోవిదేవుఁడు కల్యాణపట్టణమున రాజ్యము చేయుచున్నప్పుడుగూడ వారిరాజ్యములో నీ మంగళవేఢ యొక పరిధానస్థానముగా నుండెను. అందుచేతనే రాయమురారి సామంతులకు మాఱిగెబిజ్జరాయకునకు బిజ్జణునకుఁగూడ నిది రాజ్యస్థానముగాఁ బేర్కొనఁబడుటకుఁ గారణ మయినది.

మఱియు రాయమురారి మహామండలేశ్వరుఁడు లఖియదేవుఁడు వెలయించిన శాసనములలో (N-E. R. 160 of 1934) క్రీ॥ శ॥ 1173 లో రాయమురారి మంగళవాడయందే యేలుచుండెనని చెప్పఁబడుటకుఁగూడ నిదియే కారణము. రాజ్యములోని ముఖ్యస్థలములలో నేదియో యొకటి పాలనస్థలముగాఁ బేర్కొనఁబడినంతమాత్రమున నాతని ప్రధానరాజధానీనగరముకూడ నదియే యని తలంప నవసరము లేదు. రాయమురారి కల్యాణపట్టణము నేలుచున్నప్పుడు గూడ మంగళవాడ యాతనియేలుబడిలోనిదే కావున నాతఁడచ్చట నేలుచుండెనని చెప్పుటలోఁ బ్రత్యవాయమేమియు లేదు. అట్లుగాక మంగళవాడయే యాతని రాజధాని యని తలంచినచో నా పట్టణ మాకాలముననే యాతనిసామంతుల రాజధానిగాఁ బేర్కొనఁబడుట యసంగత మగునుగదా! కావున బిజ్జలుఁడు సామంతుఁడుగా నున్నప్పుడు మంగళవేఢలోనుండి స్వతంత్రుఁ డయి పశ్చిమచాళుక్యరాజ్యములో విశేషభాగము నాక్రమించినప్పుడు రాజధానిని గల్యాణమునకు మార్చియుండెనని నిర్ణయించవచ్చును. బస

వేశ్వరుఁడు గూడ మొదట మంగళవేఢలో నున్నప్పుడే బిజ్జ
లునియొద్ద మంత్రిగాఁ బ్రవేశించి తరువాత నాతనితోపాటు
కల్యాణమునకు వచ్చియుండును. స్వతంత్రుఁడయినతరువాత
బిజ్జలుఁడు కల్యాణములోఁ బరిపాలించినది రమారమి యూఱు
సంవత్సరములు మాత్రమే. బసవేశ్వరుఁడు కల్యాణములో
నుండి యీ స్వల్పకాలముననే వీరశైవము నంతగా విస్తరింప
జేయుట యసంగతముగా నుండును గావున మంగళవేఢలో
నున్నప్పటినుండియే యీ మహోద్యమమున కాతఁ డుపక్ర
మించెనని తలంచుటయే సమంజసముగా నుండును.

మఱియు హరీశ్వరుఁడుకూడ "శ్వశ్శ్రేయసం, శివం,
భద్రం, కల్యాణం, మంగళం, శుభం." అను నిఘంటువాకి
వలన కల్యాణ మంగళశబ్దములు పర్యాయము లగుటచే
గల్యాణపట్టణమునే యుద్దేశించియు దానినే మంగళవాడ
యని పేర్కొనియుండును. పాలకురికి సోమనాథునకు బసవేశ్వరు
నేలికయైన కల్యాణపట్టణమం దుండినబిజ్జలుండు హైహయుఁడా
లేక కాలచుర్యుఁడా యనువివరములతోఁ బ్రసక్తి లేదు. మన
పూర్వకవుల కిట్టిసూక్ష్మచరిత్రాంశములపయి దృష్టి యుండె
డిదికాదు. అతఁడేవంశమువాఁడయినను గల్యాణమున నుండి
పరిపాలించినది చాళుక్యరాజ్యము. అందుచే నాదృష్టిలో నే
యాతనిని నాతనిసంతతిని జాళుక్యులనియే యూతఁడు పేర్కొ
నెను. బసవేశ్వరునిఁ గూర్చి చెప్పిన నమస్కారగద్యలో
గూడ నతఁడు "సాధిత చాళుక్యేంద్రాయ నమో" "శాప

హితచాళుక్యాయ నమో" అనియే వ్రాసియున్నాఁడు. కావున నిందులో నసంగత మేదియుఁ గానరాదు. బసవేశ్వరుని పేర నున్న కొన్ని కన్నడవచనములలో బిజ్జలుఁడు చాళుక్యరాజుగా నుదాహృతుఁ డగుటకూడ నిట్టియభిప్రాయముతోడనే యని గ్రహించునది. ఇంతకు బసవేశ్వరునిపేర లభ్యము లగు నీవచనములలో నన్నియు నతఁడు చెప్పినవే యనుటకుఁ దగిన యాధారములు లేవు. కొన్ని ప్రక్షిప్తములుకూడ నందుఁ జేరియుండవచ్చును. పశ్చిమచాళుక్యరాజధానిగా నుండిన కల్యాణపట్టణములో బసవేశ్వరసంబంధికము లగుసన్నివేశము లిప్పటికిని గలవని స్థలజ్ఞులు చెప్పుచున్నారు. బసవేశ్వరుని గద్దె యని పిలువఁబడుస్థలముపయి దుకాణము పెట్టి యమ్మకము చేయు వర్తకులకు విశేషైశ్వర్యము గలుగుచుండెడిదనియు నందుచే నాప్రదేశ మేఁటేఁట వేలమువేయఁబడుచున్న దనియు వర్తకులు దాని నెక్కువసొమ్మునకుఁ బాడుదురనియుఁ దెలియుచున్నది.

కావున నైతిహ్యపరంపరాప్రసిద్ధ మగు నిట్టికల్యాణపట్టణసంబంధము బసవేశ్వరునుండి విడఁదీయుటకు శ్రీకంఠశాస్త్రిగారు చెప్పిన యాధారము లెంతమాత్రము నిలువనేరవు. మూఁడవతైలపదేవుని సామంతుఁడుగా నుండినబిజ్జలుఁడు గాక కల్యాణపట్టణములో రాజ్యము నెఱపినబిజ్జలుఁడు మఱొకఁ డెవఁడు నాకాలమునఁగాని యీసమీపకాలమునఁగాని కానరాఁడు. బసవేశ్వరసమకాలికుఁడుగా బసవ

పురాణమున నర్ణితుఁ డయిన ఏకాంత రామయ్యకు యీ బి
లుఁడే సామంతుఁడుగా నున్నప్పుడు దాన మిచ్చె న
యబ్లూరుశాసనము ప్రకటించుచున్నది. శ్రీకంఠశాస్త్రిగా
పేర్కొనిన యిరువురు బిజ్జలులలో నెవరికిఁగాని కల్యాణప
ణసంబంధము గానరాదు. శాస్త్రిగారు దానిని నిరూపించ
యుండలేదు. కావున 'నదిహరళహల్లి' శాసనము మున్నగు
వానివలన క్రీ॥ శ॥ ౧౧౬౭ వఱకుఁ గల్యాణమును బరిపా
లించుచు, ఆ సంవత్సరప్రాంతమున రాజ్యమును త్యజించి
తనపుత్రుఁ డగు రాయమురారిసోవిదేవునకుఁ బట్టము గ
నట్లు కానవచ్చు బిజ్జలుఁడే బసవేశ్వరుని యేలిక యగును గా
శ్రీకంఠశాస్త్రిగారు తలంచినట్టు లా రాయమురాది సామంత
లుగా నుండిన మాళిగె బిజ్జనాయకుఁడు గాని సింద్ బిజ్జలుఁడ
కాని కానేరఁడని వేఱ చెప్పనక్కఱలేదు. సింద్ బిజ్జలు
కాలమున బలదేవనాయకుఁ డొకఁడు కానవచ్చునంతమ
త్రమున నాతఁడే బసవపురాణమున వర్ణితుఁ డయిన బసవేశ
రుని మేనమామ యని యెంతమాత్రము తలంప నవసరమ
లేదు. రాయమురారితండ్రి బిజ్జలుఁడు నాతని సామంతుల
బిజ్జలనామధేయులు వేర్వేఱుపురుషు లయినట్లే యీ బల
వనాయకులుకూడ భిన్నవ్యక్తులు కాఁదగును. జైను
వ్రాసిన బిజ్జలరాయచరిత్ర మున్నగు గ్రంథములుగూ
వానిలోఁ జరిత్రవ్యతిరిక్తము లగువిషయము లెన్నియున్న
రాయమురారితండ్రి బిజ్జలుఁడే బసవేశ్వరుని యేలికయనియ

బసవేశ్వరునియనుచరులు బిజ్జలుని వధించినప్పుడు బసవేశ్వ రుని జంపుటకయి యిమ్మడిబిజ్జలుఁడగు నీ రాయమురారియే యాతని వెన్నాడె ననియుఁ జెప్పుచున్నవి. సుప్రసిద్ధ ఆంగ్లవిద్వాంసులగు విన్సెంటు స్మిత్, డాక్టరు కృష్ణస్వామి అయ్యంగారు మున్నగుచరిత్రజ్ఞులును, ఆంధ్రచరిత్రపరిశోధకు లగు శ్రీ లక్ష్మణరావు, వీరభద్రరావుగారులుఁగూడఁ దమ గ్రంథములలో క్రీ॥ శ॥ 1168 వఱకుఁ గల్యాణపట్టణమునఁ బశ్చిమచాళుక్యరాజ్యమును బరిపాలించినబిజ్జలునే బసవేశ్వ రుని యేలికగా నిర్ణయించియున్నారు. శాసనములను, గ్రంథ ములను సరిగా సమన్వయము చేసికొనక శ్రీకంఠశాస్త్రిగా రన్యథా తలంచుట శోచనీయము.

ఇఁక సోమనాథుఁడు బసవేశ్వరునిశాపమహిమచే బిజ్జ లుని పుత్రులుగూడ రాజ్యమునకై యన్యోన్యము పోరాడి యాతని వెనువెంటనే మరణించిరనియు వారు చనిపోయిన వార్త విన్నతరువాతనే బసవేశ్వరుఁడుకూడ సంగమేశ్వరమున కేఁగి సంగమేశ్వరలింగమునం దైక్యమన్యొననియు బసవ పురాణమునఁ జెప్పినసంగతులఁగూర్చి విచారింతము. ఇవి చరి త్రసమ్మతములు కావనుట నిష్కపము. అవి సరియేయని చెప్పినచో బసవేశ్వరుఁడు క్రీ॥ శ॥ 1182 ప్రాంతమువఱకు జీవించియుండునని చెప్పవలసివచ్చు ననుట వాస్తవమే. బిజ్జలునితరువాత రాయమురారిసోవిదేవుఁడు క్రీ॥ శ॥ 1177 వఱకును దరువాత నాతనిసోదరులు క్రీ॥ శ॥ 1182 ప్రాంతము

వఱకును జాళుక్యరాజ్యమును బరిపాలించినట్లు శాసనముల వలన వ్యక్తమగును. సోమనాథుఁడు తాను బసవపురాణమును రచించిన క్రీ॥ శ॥ 1195 ప్రాంతమునాఁటికిఁ గల్యాణమున జాళుక్యరాజ్య మంతరించెను. అంతకుముందు పదిరెండేండ్లక్రిందటనే బిజ్జలునిసంతతి నిర్వంశమయ్యెను. కావున సోమనాథుఁడు తనగ్రంథరచనాకాలమునకున్న పరిస్థితులఁ బట్టి తాను విన్నవార్తలనులిఖించుటలో నిట్టి స్వల్పవ్యత్యాసము లేర్పడుటకుఁ గారణ మయినది. ఇట్టి సూక్ష్మచరిత్రాంశములు మన కవులదృష్టి కెక్కనవి కావని మొదటనే మనవిచేసితిని. పండితారాధ్యచరిత్రములోఁగూడ మల్లికార్జునపండితుని శాపమహిమచే వెలనాటిచోడుఁడు నాతనిసంతతియు నశించిన దనుటలోఁగూడ నాతఁ డిట్లే చెప్పినాఁడు. బసవేశ్వర పండితారాధ్యు లవతారపురుషు లని సోమనాథుని గ్రంథములవలన వ్యక్త మగును. వా రొందినది స్వచ్ఛందమరణము. బసవేశ్వరుని దర్శింపనేఁగుచు దారిలో వనిపుర ప్రాంతమున నాతనినిర్యాణవార్త విని పరితపించి పండితారాధ్యుఁడు శివరాత్రివ్రతమును ముగించి బసవేశ్వరుఁ డవతారమును జాలించినప్పుడు తా నుండియుఁ బ్రయోజనము లేదని భావించి, యాతఁడు సంగమేశ్వరునందు సంగమించినట్లు తానుగూడ శ్రీశైలమల్లికార్జునలింగమం దైక్యమయ్యెను. కావున బసవేశ్వర మల్లికార్జునపండితుల శాపమహిమచేఁ గ్రమముగ బిజ్జలుఁడు, వెలనాటిచోడుఁడు, తత్సంత

తియుఁ దరువాత ననతికాలములో నశించినను వారు మాత్రి మంతకుముందే క్రీ॥ శ॥ 1168,1170 ప్రాంతమున నిర్వాణ మొందిరని తలంచుటలో నసంగతమేమియు లేదు. చరిత్రవిషయముల నిట్లే చరిత్రకారులు పరస్పరవైషమ్యములకు, ప్రబలప్రమాణవైరుధ్యములకు నెడ మీయకుండ సూక్ష్మదృష్టితో సమన్వయము చేసికొనఁదగును.

---

## బసవేశ్వరునిగూర్చిన శాసనసామగ్రి

అపరనందీశ్వరుఁ డగు బసవేశ్వరుఁడు కల్యాణపట్టణమునఁ బశ్చిమచాళుక్య రాజ్యమును బరిపాలించిన కలచుర్య బిజ్జలునియొద్ద క్రీస్తుశకము 1162 - 1168 ప్రాంతమున మంత్రిగా నుండి వీరశైవమతము నుద్ధరించె ననుట సుప్రసిద్ధచరిత్రాత్మకవిషయము. బసవేశ్వరునిశాసనములు లభింపనికారణమునఁ గాని, ఉపలబ్ధములైన బిజ్జలునిశాసనములలో బసవేశ్వరుని నామ ముదాహృతము కానంతమాత్రమునఁ గాని బసవేశ్వరుఁడు చారిత్రకపురుషుఁడు కాఁడని తలంచుట సరికాదని చెప్పి యట్టి శాసనములు వెలువడకుండుటకుఁ గల కారణములనుగూడ "బసవేశ్వరుఁడు బిజ్జలుఁడు" అను వ్యాసమునఁ (విభూది సం ౧ సం ౭) జర్చించియుంటిని. కర్ణాట సాహిత్యపరిషత్పత్రికయొక్క బహుధాన్య సంవత్సర మార్గ

శీర్ష సంచికలో (దీని యాంధ్రానువాదము విభూతి సం ౧ సం 3 లోఁ గలదు.) శ్రీయుత ఎస్. శ్రీకంఠశాస్త్రి. M. A. గారు బసవేశ్వరుని యనంతర మొకశతాబ్దిలో వెలువడిన—

హిరియూరుశాసనము (Epicar V Ak P 109) చౌడదానుపురశాసనము (Psoci No. 110) కల్లదేవపురశాసనము (Epicar XI JL 30) మరడీపురశాసనము (Epicar III Md. 33) మున్నగు కన్నడశాసనములలో నుదాహృతు లయిన పూర్వశివభక్తులనామములలో సంగనబసవేశ్వరుని నామోల్లేఖన ముండుటచేతను కన్నడముననే లిఖింపఁబడిన అర్జునవాడశాసనములో (Epi Indica Vol XXI P 9) బసవేశ్వరుని వంశస్థులకు క్రీ॥ శ॥ 1260 సంవత్సరములో యాదవకన్నడరాజుకాలములో దాన మొసంగఁ బడినట్లు కానవచ్చుటచేతను బసవేశ్వరుఁడు చారిత్రకవ్యక్తియే యని నిస్సంశయముగ నేర్పడు నని వ్రాసియున్నారు. పూర్వోక్త శాసనములలో అర్జునవాడ శాసనము చాల ముఖ్యమయినది. పాల్కురికి సోమనాథుని బసవపురాణమువలన బసవేశ్వరుఁడు కర్నాటదేశమందలి హింగుళేశ్వర భాగవాటి* (బాగెవాడి) వాస్తవ్యుఁడగు మండెగ మాదిరాజునకు మాదమాంబికయం దుదయించె ననియుఁ గూడలి సంగమేశ్వరస్వామి జంగమ

*హింగుళేశ్వర మనునది బిజాపూరుజల్లాలో బాగెవాడి సమీప మునున్న యొక గ్రామము.

రూపమున వచ్చి యాతనికి జననకాలముననే లింగధారణ మొనర్చి చనినదిమొద లాతనియం దనన్యసామాన్యమగు భక్తి నెఱపుటచే 'సంగనబసవన' యని వ్యవహరింపఁబడె ననియుఁ దెలియనగును. చామరసుప్రభులింగలీలవలనఁగూడ నీవిషయములు విస్పష్టమగును. పూర్వోక్తమయిన అర్జున వాడ గ్రామము బాగెవాడికి సమీపముననే బొంబాయి రాజధానిలో బెల్గాముజిల్లా హుక్కేరితాలూకాలో నున్నది. అచ్చటి హాలశంకరలింగస్వామి యాలయపుగోడలో పయిని నుదాహరించిన యర్జునవాడశిలాశాసనము చెక్కఁబడి యున్నది. బసవేశ్వరునకు మూఁడవతరమువాఁడో నాలుగవ తరమువాఁడో యగు హాలబసవదేవునకు యాదవకన్నడ దేవుని దండనాథుఁడు మంత్రియు నగు చవుండసెట్టి నాగరసు అనువారు కైలాసపురమును క్రీ॥ శ॥ 1260 సంవత్సరములో అగ్రహారముగా నొసంగినదాన మీ శాసనమున నుదాహృతమయినది. శివానుభవపత్రికాసంపాదకులు బిజాపూరు వాస్తవ్యులు నగు రావుసాహెబు పి. జి. హళకట్టిగారీ శాసనమును మొట్టమొదట గుర్తించియున్నారు. వీరు పంపిన ప్రతిబింబమునుబట్టి దీనిని బూర్వోదాహృతు లగు శ్రీ ఎస్. శ్రీకంఠశాస్త్రిగారే 1933 సంవత్సరములో (Epigraphia Indica Vol. XXI, Part I) లోఁ బ్రకటించియున్నారు. శాసనముయొక్క యవతారికలో బాగెవాడీపురవరాధీశ్వరుఁడగు మాదిరాజుని పుత్రుఁడు సంగనబసవన యని చెప్ప

యాతని జంగమలింగభక్తి ప్రశంసాపూర్వకముగ నొక కంద పద్యము రచింపఁబడి యున్నది. ఇందుచేఁ బాల్కురికి సోమనాథుని బసవపురాణమునకుఁ గథానాయకుఁ డయిన సంగన బసవేశ్వరుఁడును బయి శాసనమునఁ బేర్కొనఁబడి ప్రశంసింపఁబడిన సంగనబసవనయు నిస్సంశయముగ నొక్కఁడే యని నొక్కి వక్కాణింపవచ్చును. ఇంతవఱకు దొరకిన శాసనములలో వీరశైవమతోద్ధారకుఁ డగు బసవేశ్వరునిఁగూర్చి సరియైన వివరములతోఁ బ్రశంసించిన శాసన మిదియొక్కటే యని చెప్పఁదగును.

బసవేశ్వరుఁడు చారిత్రకవ్యక్తి కాఁడేమో యని యనుమానించువారిక దీనిని జదివి తమ యనుమానములను బూర్తిగా విడువనొప్పును. కావున నీశాసనము నాంధ్రవివరణముతో నీవ్యాసమున కనుబంధముగఁ బ్రకటించుచున్నాను. దానప్రతిగ్రహీత హాలబసవదేవునితండ్రి కలిదేవరసయ్యకు సంగనబసవేశ్వరునకుఁ గల సంబంధమును బ్రకటించినపద్యములోఁ గొన్నియక్షరములు శాసనమున శిథిలము లవుటచే బసవేశ్వరునకుఁ గలిదేవరసయ్యకు నడుమనున్న తరములను సరిగా నిర్ణయింపరాకున్నది. శాసనమును బ్రకటించిన శ్రీకంఠశాస్త్రిగారు బసవేశ్వరునిపుత్రుఁడు సంగన, యాతనితనయుఁడు దేవరాజముని, యాతనికొమరుఁడు సంగన, యాతని కొడుకు కలిదేవరసయ్య యని తమయభిప్రాయమును సూచించి బసవేశ్వరునకు హాలబసవదేవునకు నడుమ నాలుగు

తరములు చెప్పినారు. కాని ప్రభుత్వమువారి శాసనపరిశోధక శాఖయం దుద్యోగులగు శ్రీ ఎస్. లక్ష్మీనారాయణరావు, M. A. గారు శాసనప్రకటనకాలముననే శ్రీకంఠశాస్త్రిగారి యభిప్రాయముల కించుక సవరణలఁ బ్రతిపాదించి బసవేశ్వరుని యగ్రజుఁడు దేవరాజముని, యాతనిపుత్రుఁడు కావరసయ్య, యాతనికొమరుఁడు కలిదేవరసయ్య యని యభిప్రాయపడి యందు కనుగుణముగ నీక్రింది వంశవృక్షమును లిఖించి యున్నారు.




(దానప్రతిగ్రహీత) శ్రీ లక్ష్మీనారాయణరావుగారు శాసనకాల మగు క్రీస్తుశకవత్సరము 1260 నుండి తరమున కిరువదియైదు సంవత్సరములచొప్పున వెనుకకు గణించి బసవేశ్వరుఁడు బిజ్జలునితోపాటు క్రీ॥ శ॥ 1168 ప్రాంతమున మరణించియుండునను చరిత్రకారుల సిద్ధాంతమున కనుగుణముగ

నాతనికాలము క్రీ॥ శ॥ 1160–1185 మధ్యనై యుండునని సమర్థించిరి. కాని బసవపురాణమునుబట్టి మండఁగి మాదిరాజునకు నాతనిభార్య మాదమాంబికకు లేక లేక యీశ్వరానుగ్రహమున బసవేశ్వరుఁ డొక్కరుఁడే పుత్రుఁడయి యుదయించెనని కాననగును. ఆతనికి దేవరాజముని యనెడి యన్నగాని తమ్ముఁడు గాని యున్నట్లు కానరాదు.

బసవేశ్వరుని కాతనిభార్య గంగాంబిక వలనఁ బుత్రులెవరయిన నుదయించినది లేనిది గూడ సోమనాథుని బసవపురాణమువలనఁ గానరాదు. కర్ణాటకవిచరిత్రకారులు శ్రీ నరసింహాచార్యగారు భైరవేశ్వర కావ్యకథాసూత్రరత్నాకరమను గ్రంథమువలన బసవేశ్వరునకు బాలసంగయ్య యనుపుత్రుఁ డుదయించెననియు నాతఁడు చిన్నతనముననే మరణింపఁగా బసవేశ్వరుఁడు—

"పుష్పవిద్దంతె మొగ్గను నర్పిసి కొండశివను,
పక్వవాదఫలవిద్దంతె కసుగాయు కోయ్దు శివను."

అని విలపించె ననియుఁ దెలియుచున్న దని వ్రాసియున్నారు. హరిహర (హరీశ్వర) కృతమని చెప్పఁబడు బసవరాజరగళెలో బసవేశ్వరునకు సిద్ధరసు అను కొమరుఁ డుండినట్లు చెప్పఁబడిన దని శ్రీకంఠశాస్త్రిగారు వ్రాసియున్నారు. ఏది యెట్లున్నను అర్జునవాడశాసనములో ముఖ్యమయిన రెండుస్థానములలో నక్షరములు శిథిలము లవుటచే నివిషయమును సరియగు నిర్ణయ మొనర్ప ననువుగాకున్నది. ఇందుకు

సంబంధించిన పద్య మీాదిగువ నుదాహరించుచున్నాను. కుం డలీకరణము లలోని యక్షరములు శిథిలాక్షరములకు శ్రీ లక్ష్మీ నారాయణరావుగారూహించి యొసఁగిన పాఠములు.

క. సంగనబసవనయగ్ర (జ
లింగై) కం దేవరాజ మునిపన తనయుం,
జంగమపరుసం (కావ) *ర
సంగం ప్రియ సుత సెనిప్ప కలిదేవరసం.

ఈ పట్టున నిదమిత్థ మని నిర్ణయించుటకు ముందు మరల నొకసారి శాసనశిలను బరికించుట యవసర మని నా యభిప్రాయము. ఇందుకయి ప్రయత్న మొనరించి తెలియ వచ్చెడి విశేషవివరము లున్న ముందు ప్రకటింతును. ఇంతకు శాసనమందలి దానప్రతిగ్రహీత సంగనబసవనకు మూఁడవ తరమువాఁ డయినను నాలుగవతరమువాఁ డయినను దద్విషయు మీా శాసనమువలన నిర్ధారిత మగు బసవేశ్వరుని చారిత్రక వ్యక్తిత్వమున కేమాత్రము భంగకరము కాదు గదా ! ఈ స్వల్పవ్యత్యాసమువలనఁ బూర్వనిర్ణీత మయిన బసవనికాలమునకుఁ (క్రీ॥ శ॥ 1168 ప్రాంతము) గూడ బాధక మేమియు నుండనేరదు.

అర్జునవాడశాసనము దొరకకపూర్వము 1898–1899 సంవత్సరములోఁ బ్రకటితమయిన Epigraphia Indica,

---

* ఇచ్చట "శరణరసంగం" అని శ్రీకంఠశాస్త్రిగారి సూచన.

Vol. V. లో మనగోళిగ్రామములో లభించిన శాసనములను బ్రకటించుసందర్భమున డాక్టరు ఫ్లీటుదొరగారు బసవేశ్వరుని గూర్చియు నాతనితండ్రి మాదిరాజును గూర్చియు సరిగా బరిశోధింపక కొన్ని యసంగతవాక్యములను సంశయసూచకముగ వ్రాసియున్నారు. మనగోళి యునునది బసవేశ్వరుని జన్మస్థలమగు బిజాపూరుజిల్లా బాగెవాడికి వాయవ్యముగ బదునొకండుమైళ్ళ దూరములో నున్నది. అచ్చట దొరకిన శాసనములలో బిజ్జలునికాలమున క్రీ॥ శ॥ 1161, 1165 లలో వెలువడిన శాసనములు రెంటిని, ఆతని కొమరుండు సంకమరాజుకాలములో క్రీ॥ శ॥ 1178 సంవత్సరములో వెలువడిన శాసన మొకటియు, యాదవజైతుగి క్రీ॥ శ॥ 1200 శాసనము మఱొకటియు శ్రీ ఫ్లీటు దొరగారు ప్రకటించియున్నారు. క్రీ॥ శ॥ 1161 నాంటిశాసనములో మునుముందంతకుంబూర్వము క్రీ॥ శ॥ 1142 సంవత్సరములోం బశ్చిమ చాళుక్యచక్రవర్తి యగు రెండవజగదేకమల్లునికాలమున జరిగిన దానములుకూడం జేర్పంబడినవి. శాసనశిలపై మొదట రెండవజగదేకమల్లు శాసనము చెక్కంబడి యాపిమ్మట మఱికొన్నిసంవత్సరములకు బిజ్జలునిశాసనము చెక్కంబడినట్లు కానగును. మనగోళిగ్రామ మీశాసనములలో మణిగవల్లి, మణింగవల్లి, మాణిక్యవల్లి యనికూడం జేర్పంబడినది. ఈ మొదటిశాసనమునుబట్టి యీ గ్రామము త్రైలోక్యమల్ల ఆహవమల్ల బిరుదాంచితుం డగు రెండవ తైలపదేవునివలన

నాతనిపట్టాభిషేకసమయమున హారీతగోత్రుఁడగు ఈశ్వర ఘళిసాసగురునకు ధారాపూర్వకముగ నొసంగఁబడె ననియు, ఆ యీశ్వరగురుదేవుఁడు దానిని దనతోపాటు అయిదువందల మంది బ్రాహ్మణుల కాచంద్రతారార్కముగ నగ్రహారముగ నుండున ట్లొనర్చె ననియుఁ దెలియవచ్చును. అటుతరువాత నా యీశ్వరగురునివంశమున మాణిక్యవల్లీపురప్రభుఁ డను విఖ్యాతిని గైకొన్న మాధవుఁ డనునతఁడు జనించె నని యీ శాసనమునఁ జెప్పఁబడినది. ఆ పిమ్మట యీగ్రామమహాజను లగు నయిదువందలమంది యగ్రహారికుల విద్యావైభవాదిక ములు వర్ణింపఁబడినవి. వారిలో వాజివంశ్యుఁడు, కాశ్యప గోత్రజుఁడు నగు గోవర్ధనుఁ డనునాతఁ డుండెననియు, నాతనిపుత్రుఁడు దేవదాసనియు, అతనికి నాగదేవుఁడు, విష్ణుఁడు, గొయ్యరుసు, హులిధుఁడు నను నలువురుకుమారులు గలర నియు వీరిలోఁ గడపటివాఁడగు హులిధుఁడు చంద్రమసుఁ డనునామముతో విశేషవిఖ్యాతిని గడించెననియు, చండిరా జనికూడఁ బిలువఁబడు నీ చంద్రమసునకుఁ జంద్రాంబిక యందు బసవయ్య యనునాతఁడు జనించి గొప్ప శివభక్తి గలిగి మణింగవల్లియగ్రహారికులలో నగ్రగణ్యుఁ డయి విశేష గౌరవమును గడించి యీగ్రామమునఁ గైలాసము నతిశ యించు కలిదేవేశ్వరాలయమును నిర్మించెననియుఁ జెప్పఁబడి నది. అటుతరువాత రెండవజగదేకమల్లుఁడు తనదండానాయ కుఁడగు బ[...]మణింగవల్లిమహాజను లగు

మహాప్రభు మాదిరాజు మున్నగువారిసమ్మతితోఁ దన మైదవ విజయరాజ్యవత్సరమును దుందుభిసంవత్సర పుష్యశుద్ధదశమి బృహస్పతివారమునాఁడు, ఉత్తరాయణసంక్రాంతి వ్యతీపాత పుణ్యకాలమునఁ బూర్వోక్తమగు కలిదేవేశ్వరాలయమునకుఁ గానుభుజంగావళీకులతిలకుఁడు కాలాముఖనైష్ఠికపరమతపోనిష్ఠ బ్రాహ్మ్యకులబాలబ్రహ్మచారియు నగు శ్రీసద్యోజాతపండిత దేవునకు ధారాపూర్వకముగ దానము లొసంగెనని చెప్పఁబడినది. అటుతరువాత క్రీ॥ శ॥ 1161 సంవత్సరములో బిజ్జలునికాలమున మణింగవల్లియగ్రహారికుల కోరికపయి నచ్చటిసెట్టులు మున్నగువారు పూర్వోక్తమగు కలిదేవేశ్వరాలయమున కొసంగిన దానములు పేర్కొనఁబడినవి. పయిసంగతుల బాగుగాఁ బరిశోధింపక డాక్టరు ఫ్లీటుదొరగారంతకుఁబూర్వము బసవేశ్వరునకు సంబంధించినశాసనము లేమియు లభింపనందున నీ మనగోళిశాసనమునఁ దాము స్థూలదృష్టితోఁ దిలకించిన బసవరసయ్యయే బసవేశ్వరుఁడు కాఁదగు ననియు, ఈశ్వరఘుళిసానగురుని వంశ్యుఁడుగాఁ జెప్పబడిన మాధవుఁడే శాసనమున నటుతరువాతఁ బేర్కొనఁబడిన మాదిరాజు కానగునని యు, అతఁడే బసవపురాణమున బసవేశ్వరునితండ్రిగాఁ జెప్పఁబడిన మండఁగి మాదిరాజు అయియుండుననియు భ్రమించి సంశయగ్రస్తముగఁ గొన్నివాక్యములు లిఖించియున్నారు. మఱియు నీఫ్లీటుదొరగారు Epigraphia Indica Vol. V లోనే ప్రకటించిన (ఏకాంతరామయ్యనుగూర్చిన)

అబ్లూరు శాసనమునకుఁ దాము వ్రాసిన యవతారికలోఁగూడ నీ గొడవ యెత్తి, గోత్రవిషయమునను, దలిదండ్రుల నామములవిషయమునను గల వ్యత్యాసములకు సమాధానముగా శాసనస్థవివరము లే సరియైన వనియు, వీరశైవగ్రంథములలో బసవేశ్వరుని తలిదండ్రులనామములు మాదిరాజ మాదమాంబిక లని చెప్పియుండుట జనశ్రుతివలన నేర్పడిన ప్రమాదమయియుండు నని లిఖించియున్నారు. మనగోళిశాసనములను సరిగాఁ జిత్తగించినవారికి ఫ్లీటుదొరగారి వ్రాఁతలలోని ప్రమాదములు విశదము కాఁగలవు. రెండవ తైలపదేవుఁడు పశ్చిమచాళుక్యరాజ్యమును క్రీ॥ శ॥ 973-997 ప్రాంతమునఁ బరిపాలించినవాఁడు. ఆతనివలన మణింగవల్లిగ్రామము నగ్రహారముగాఁ గొనిన హారీతగోత్రుఁ డగు ఈశ్వరఘళిసాసుని వంశ్యుఁడగు మాధవుఁడే బసవనితండ్రి మాదిరాజు కాఁదగు ననియు, మరలఁ గాశ్యపగోత్రుఁ డగు చండిరాజపుత్రుఁడు బసవరసయ్యయే బసవేశ్వరుఁడు కాఁదగు ననియు దొరగారు తలంచుట కేవల మవిచారమూలకము. కలిదేవేశ్వరాలయము మణింగవల్లిగామమున రెండవజగదేకమల్లుని శాసనకాలమగు క్రీ॥ శ॥ 1142 సంవత్సరమునకుఁ బూర్వమే యుండియున్నట్లు శాసనమువలనఁ గాననగును. అందుచే నా యాలయనిర్మాణకర్తగా నం దుదాహరింపఁబడిన బసవరసయ్య జగదేకమల్లునికంటెఁ బ్రాచీనుఁ డగు యందువలననే తెల్లము కాఁగ

లము. కావున నాతనినే వీరశైవమతోద్ధారకుఁ డగు బసవేశ్వరునిగాఁ దలంచుట వట్టిభ్రమయే యని చెప్పనవసరము లేదు.

పాలకురికి సోమనాథుఁడు బసవశబ్దము వృషభ, పశుప శబ్దములనుండి ప్రాకృతవ్యాకరణసూత్రములచే నేర్పడినదని సోమనాథభాష్యమున వివరించియున్నాఁడు. అంతమాత్రముచే నీ శబ్దము బసవేశ్వరునిపుట్టువుతోనే దేశమునందు వ్యవహారమునకు వచ్చెనని యంతకుముం దది లేదని తలంపరాదు. బసవేశ్వరునికిఁ బూర్వము వెలసిన కొన్నిశాసనములను బరిశోధింప బసవేశ్వరాలయములు ఆంధ్ర కర్ణాట దేశములలోఁ బలుతావుల నదివఱకే యున్నట్టును, ఆ శాసనము లా యాలయములందుఁ జెక్కఁబడినట్లును గాననగును. కావున బసవనామాంకితు లగు మహాపురుషులు (మణింగవల్లి బసవరసయ్య వంటివారు) కొందఱు కర్ణాటదేశమున బసవేశ్వరునకు ముందే యుండిరని తలంచుట కెట్టియాటంకమును లేదు. అర్జునవాడ శాసనప్రకటనసందర్భమున శ్రీకంఠశాస్త్రిగారుకూడ ఫ్లీటుదొరగారి వ్రాఁతలందలి పొరపాటులఁ గూర్చి యించుక ముచ్చటించియున్నారు.*

---

*బసవేశ్వరునితండ్రి మాదిరాజు బాగెవాడిపురవరాధీశ్వరుఁడు. అతని గోత్ర మేదియో బసవపురాణమునుబట్టిగాని అర్జునవాడశాసనమును బట్టి గాని మనకుఁ దెలియరాదు. మనగోళిశాసనములలో నచ్చటి యగ్రహారికులలో మహాప్రభు మాదిరాజొకఁడు రెండవ జగదేకమల్లుని క్రీ॥ శ॥ 1142 నాటి దాన సందర్భమునను, క్రీ॥ శ॥ 1165నాఁటి బిజ్జలుని మఱియొక శాసనదానసందర్భముననుగూడఁ బేర్కొనఁబడినాఁడు. ఆ

సంగతిసందర్భము లిట్లుండ శాసనములను సరిగాఁ జిత్త గింపక యర్జునవాడ శాసనములే చూడక నా మిత్రులు డా॥

శాసనములఁబట్టి యాతఁడు హారీతగోత్రుఁడు, అగ్రహార ప్రథమప్రతి గ్రహీత యయిన యీశ్వరఘళిసాసగురుని వంశ్యుఁడయినది, కానిది కూడ నిర్ణయింపజాలము. బిజ్జలునిపుత్రుఁడు సంకమరాజునాఁటి క్రీ॥ శ॥ 1178 శాసనములోను యాదవరాజగు మొదటిజైతుగి క్రీ॥ శ॥ 1200 శాసనములోను మణింగవల్లిపూర్వాగ్రహారికవర్ణనములో వ్రాయఁబడిన పద్యములఁబట్టి యీశ్వరఘళిసాసగురుని పుత్రుఁడు మాదిరాజని కానన గును. ఆతఁడే మాధవుఁ డనికూడ వ్యవవహరింపఁబడినట్టు లందువలనన దోఁచును. ఈశ్వరఘళిసాసగురుడు మణింగవల్లిని రెండవతైలపునికాల మున నగ్రహారముగ బడసియుండుటచే నాతడు నాతనిపుత్రుడు మాది రాజు (మాధవుడు) రెండవజగదేకమల్లుని క్రీ॥ శ॥ 1142 శాసనకాలము నాటికే చాల పూర్వులని యేర్పడును. సంకమరాజు క్రీ॥ శ॥ 1178 శాస నకాలమునాటి కున్న మణింగవల్లిమహాప్రభు వీశ్వరదేవు డని యా శాస నమువలన గాననగును. కావున నీ యగ్రహారీకులలో ఈశ్వరదేవ, మాది రాజనామాంకితులు వేర్వేఱుకాలములలో నున్నట్లు స్పష్ట మగును. మణింగవల్లి బాగెవాడికి సమీపములో నుండుటచే బసవేశ్వరునితండ్రి మాదిరాజునకుగూడ నా యగ్రహారములో నొకభాగ ముండిన నుండ వచ్చును.

రెండవజగదేకమల్లుని క్రీ॥ శ॥ 1142 శాసనములోను, బిజ్జలుని క్రీ॥ శ॥ 1165 శాసనములోను నప్పటి యగ్రహారమహాప్రభువుగ బేర్కొనబడిన మాదిరాజుకూడ నాతఁడైన కావచ్చును. కాని యీవిషయ మిదమిత్థమని నిర్ణయింప మనకున్న సామగ్రి చాలదు. బసవేశ్వరుని తం డ్రికి బాగెవాడితోనే యెక్కువసంబంధ మున్నట్లు బసవపురాణము, ప్రభులింగలీల, అర్జునవాడశాసనము వ్యక్త మొనర్చును.

చిలుకూరి నారాయణరావుపంతులు, M. A. గారు ఆంధ్రగ్రం థమాలికలో నూతనముగాఁ బ్రకటిత మయిన పండితారాధ్య చరిత్రకుఁ దాము వ్రాసిన పీఠికలో బహుప్రమాదములకు లోనయి విచిత్రపుటూహలతో బసవేశ్వరునిగూర్చి వింతవింత సంగతులు లిఖించుట యాశ్చర్యకరము.

"సోమనాథుని కాలము" అను శీర్షిక క్రింద 55-6 పుటలలో "కాని ఇంతవంటి చారిత్రకవ్యక్తుల పేర్లు మనకు కనబడుతూవుండగా, ఆ వ్యక్తు లందరికిన్ని కేంద్రమయుం డెనని చెప్పఁబడిన ప్రధానపురుషుఁడైన బసవేశ్వరుఁడు నిరా కారుఁడై మనకు చిక్కకుండడమే అద్భుతములలో అద్భు తము" అనువాక్యముతో నారంభమయి "పైదానినిబట్టి బండారు బసవన్న కోశాధ్యక్షుఁడుగా ఉన్నాఁడన్నవిషయ మంతసులభముగా తోసివేయుదగినది కాదని చెప్పవచ్చును" అనువాక్యముతో ముగిసిన వారియుపన్యాసభాగమును జిత్త గించునది. నేఁటి విద్యాధికులకు ఊలుటప్పలువలె మహా కవులగ్రంథములు ప్రమాణములు కావు. శిలాతామ్రశాసనము లలోని వ్రాఁతలకు సరిపడినచేతప్ప గ్రంథస్థప్రమాణములను వారు విశ్వసింపఁజాలరు. విద్యాధికులలో మన నారాయణ రావుగారుకూడ నిందుకు విలక్షణముగ వర్తింపనేరరు గదా! వీరశైవకవులగ్రంథములలో నంతగా వినుతికెక్కిన మహో ద్ధారకుఁడు బసవేశ్వరుఁడు, బిజ్జలుని యమాత్యశేఖరుఁడు శాసనము కెక్కకుండుట వారికి మహాద్భుతముగాఁ దోఁచె

నది. ఈ శాసనాభావము ప్రాగభావము గాక ప్రధ్వంసాభావమో, ప్రచ్ఛన్నాభావమో యయియుండు ననుతలంపుతో శాసనాన్వేషణమునకుఁ గడంగి బిజ్జలునికాలమునకుఁ గొంచెము ముందువెనుకల నున్న శాసనములఁ బరికింప దొరకొనిరి. బసవయ్య, బసవదండనాయకుఁడు అను నామములు కర్మము చాలక యేశాసనములలోనయినఁ గానవచ్చినచో నాయా పురుషుల బసవేశ్వరునకుఁ బరకాయప్రవేశము గలిగించి వారితో నాతనికైక్యానుసంధానము ఘటింపఁబ్రయత్నించిరి. Madras Epigraphical Reports వెదకఁగా వెదకఁగా 68 of 1904 లో బళ్లారిజిల్లా ఒరవాయి (Oruway) గ్రామములో బెణకప్ప (వెనకప్ప = విఘ్నేశ్వరుఁడు) గుడిలో హొయసలరా జగు రెండవ వీరబల్లాళుని సేనాని యగు బసవనదండనాయకుఁడు ఈశ్వరసంవత్సరములో నొసంగిన దానమొకశాతిపలకపయి చెక్కఁబడినట్లు వ్రాఁత కనిపింపఁగనే యాతఁడే బసవేశ్వరుఁడు కాఁదగునని యూహాలపయి నూహాలఁ బన్ని "క్రొత్త యొకవింత, ప్రాఁత యొకరోఁత" యనువాక్యము ననుసరించి కాఁబోలు వింతసిద్ధాంత మొకటి ప్రకటించిరి. హొయసల రెండవవీరబల్లాళుని రాజ్యకాలములో ఈశ్వరసంవత్సరము క్రీ॥ శ॥ 1217 అగును. ఇందుచే బసవేశ్వరుఁడు బిజ్జలునిమరణానంతర మత్యంతసమీపకాలములో క్రీ॥ శ॥ 1168 ప్రాంతమున మరణించె నను చరిత్రకారుల ప్రాఁత వ్రాఁతలఁ ద్రోసివైచి, బసవేశ్వరుఁడు బిజ్జలుని

మరణానంతర మాతనిపుత్రుఁడు రాయమురారిసోవిదేవునకు
భయపడి పాఱిపోయి కొంతకాలము దాఁగియుండి యాతరు
వాత హొయసలరాజులవద్ద దండనాయకుఁడుగాఁ బ్రవేశించి
బళ్లారిమండలములోని కలచుర్యరాజ్యభాగముల జయించి
యీ రాజ్యవినాశమునకుఁ దోడ్పడి పగ సాధించెనని శ్రీనా
రాయణరావుగారు సెలవిచ్చిరి. అతిసాహసముతో నిట్టి
క్రొత్తసంగతి చెప్పఁబూనినప్పుడు శాసనమును స్వయముగాఁ
జూడవలె ననెడితలంపయినను మామిత్రులకుఁ గలుగకుండుట
శోచనీయము. వీ రుదాహరించిన యీ శాసనము South
Indian Inscriptions Vol. IX Part I లో నెం 334
రుగాఁ బ్రకటింపఁబడినది. అవసరమయినభాగము నీ క్రింద
నుదాహరించుచున్నాను.

"స్వస్తి శ్రీమతు యాదవనారాయణం ప్రతాపచక్ర
వర్తి హొయ్సళ వీరబల్లాళ దేవరాజ్యసముద్ధర బసవణదండ
నాయక గుణప్రభావ వెంతెందడె.

మ. నుడివం సత్యవచోక్తియం సకలధర్మవ్యాప్తియిం దర్థమం
పడెవం విప్రసురాది శిష్టజనతాసంతుష్టి యాగల్కె తా
కొడువం ద్రవ్యమనీ గుణాశ్రయమమం లోకంబ బాప్పెంబినం
పడెదం సద్గుణి దండనాథబసవం ప్రఖ్యాతియం కీర్తియం.
క. కలియమృత దండనాధర
లలితాత్మజ వెందొడొప్పుగుం కవితనము

సలె సత్యామృతవాక్యం
కులతిలకం బసవదండనాథాధిపనొళ్.

శ్రీమ దీశ్వరసంవత్సర శ్రావణబహుళ అమావాస్యా శుక్రవార సూర్యగ్రహణమందు శ్రీవినాయకదేవర్గె రణధవళ బసవచమూపం ధారాపూర్వకం మాడికొట్టు.........

మహాశయులారా ! ఈ శాసనమందలి బసవదండనాయకుఁ డెవరో చూచితిరా? అతఁడు కలియమృతదండనాథుని పుత్రుఁడు, "రణధవళ" బిరుదాంచితుఁడు. వీరబల్లాణదేవ రాజ్య సముద్ధారకుఁడు, అతనికి వీరశైవమతోద్ధారకుఁ డగు బసవేశ్వరునకు నేమాత్రము సంబంధము లేదని చెప్పనక్కఱ లేదు గదా ! శ్రీ నారాయణరావుగా రింతతో నూరకొనక యీ యొరవాయి శాసనములోని బసవదండనాయకునిఁ బూర్వోక్త మయిన మనగోళిశాసనములోని కశ్యపగోత్రుఁడు, చండిరాజపుత్రుఁడు నగు బసవరసయ్యతోఁగూడ నైక్య మొనర్చుటకయి చేసిన ప్రయత్నము మఱింత పరిహాసనీయముగ నున్నది. ఫ్లీటుదొరగారి ప్రమాదములఁ బుడికిపుచ్చుకొనుటయేగాక మఱికొన్ని క్రొత్తప్రమాదములకుఁ గూడ శాసనమును సరిగాఁ జదువక వీరు లోనయిరి. ఆ శాసనములో రెండవతైలపునివలన నగ్రహారము వడసినట్లు చెప్పఁబడిన యీశ్వరఘళిసాసగురుని వంశ్యుఁడగు మాధవుని (మాదిరాజును) వీరు తిన్నగా రెండవతైలపుని వంశమువాఁడని చెప్పి యాతనికి క్షత్రియత్వము గూడఁ దెచ్చిపెట్టిరి. శాసనములో

ఈశ్వరగురుని వర్ణనానంతరమున్న "ఆ ప్రభువినన్వయు దల్లి" అను వచనమునకు సరియయిన యన్వయము చేసికొననందు వలనఁగలిగిన యనర్థ మిది. నారాయణరావుగారి యీ క్రింది వాక్యములు చిత్తగింపుఁడు.

"ఇక ఆ శాసనములోనే మాదిరాజును గురించిన వృత్తాంత మిది :— చాళుక్యరాజయిన తైలుని (రెండవ తైలపుఁడు) వంశములో మాధవుఁడు పుట్టినాఁడు. అతఁడు మనిగవల్లిగ్రామమునకు మహాప్రభువు. ప్రఖ్యాత హారిత గోత్రమునకు విష్ణువంటివాఁడు అని ఈమాధవుఁడే శాసనములో మాదిరాజనికూడఁ బేర్కొనఁ బడినాఁడు. ఈశాసనము బసవనికాలమునాఁటిది కాబట్టి విశ్వాసపాత్రమని చెప్పవలెను. కాని, బసవనిది కాశ్యపగోత్రమనిన్ని అతని తండ్రి మాదిరాజుది హారితగోత్రమనిన్ని ఉన్నది. బసవఁడు మాదిరాజుకొడుకు కాడు, చంద్రమసుని కొడుకు. మరొక్క-చిక్క-బసవఁడు బ్రాహ్మణమతమును ధిక్కరించినాఁడని వీరశైవపురాణములు చెప్పుతూఉంటే ఈ శాసనము మనిగపల్లిలోని ఏ నూర్గురుబ్రాహ్మణుల హృదయాబ్జములకున్న అతఁడు సూర్యునివలె ఉన్నాఁడని చెప్పుతున్నది."

పై శాసనములోని విషయములే సత్యములు కా వచ్చును. రాను రాను జనశ్రుతిలో తారాస్మరులు కలిగి యుండవచ్చును. మనిగోలిశాసనములోని కాశ్యపగోత్రజుఁ డైన బసవఁడు షికార్‌పూరుశాసనములో కశ్యపుఁడని వ్యవహ

రింపఁబడ్డాఁడని నాయభిప్రాయము. జనశ్రుతిలో మనిగవల్లి మహాప్రభు వైన మాదిరాజు బసవనికి తండ్రి అయినాఁడు.

మనిగవల్లి శాసనములోని మాధవ, మాదిరాజ, బసవరసయ్యలఁగూర్చి వలసినంతచర్చ యిదివఱకే చేసియుంటిని. దానివలనఁ జనులకు యథార్థము బోధపడి నారాయణరావుగారి వ్రాఁతలందలి యప్రామాణ్యము తెల్లము కాఁగలదు. ఈ శాసనమందలి కశ్యపగోత్రజుఁడగు బసవయ్యయే బిజ్జలునికాలమునాఁటి షికార్పూరుశాసనములో కశ్యపనాయకుఁడుగా నుదహరింపఁబడినాఁడని శ్రీ నారాయణరావు తలంచుట మఱింత వింత. ఎవఁడయినను దనకు వేఱొక పే రున్నప్పు డా పేరితోఁగాక తనమూలపురుషుఁ డయిన గోత్రికర్తనామముతో వ్యవహరింపఁబడునా? ఇందు కెందయిన దృష్టాంతములను నారాయణరావుగారు చూపఁగలరా? దారి తెన్ను లేని దుర్భ్రమలకు లోనయి వీ రిట్టి యసంగతములు వ్రాయుటకు నే నెంతయుఁ జింతిలుచున్నాను. పరిశోధన లిట్టి విచిత్రపరిణామముల నొందుట కాలవైపరీత్యమే. ఇంతకు బిజ్జలుని సేనానాయకుఁ డని వీరు చెప్పు కశ్యపనాయకునిఁగూర్చి వీ రుదాహరించిన షికారుపూరుశాసనమునకు వీ రొసంగిన సంఖ్యాసూచనము (ఎపిగ్రాఫియా కర్నాటికా ఏడో సంపుటము నె 7 రు) నాకు రుజువు కాలేదు. నె 7 రు అనునది నె 102 రుకు పొరపాటేమో యని నేఁ దలంచుచున్నాను. అందు బిజ్జలదేవ

మహీపాలన శ్రీ పాదపద్మోపజీవి యను విశేషణముతో "కసపయ్య నాయకుఁ" డొకఁడు పేర్కొనఁబడినాడు. అతనినే నారాయణరావుగారు కశ్యపునిఁ గావించినారు కాఁబోలు. మనగోలిశాసనమందలి బసవరసయ్య రెండవజగదేకమల్లుని కాలమునకుఁ జాలపూర్వముండు దున్నవాఁడని యీశాసనము వలనఁ దెల్లమగునని యిదివఱకే చెప్పియుంటిని. అతనికి బిజ్జలుని సేనాని యగు కసపయ్యనాయకునకు నెట్టిసంబంధమును లేదు. శాసనములను సరిగాఁ జదువకుండఁ జారిత్రికవిషయ నిరూపణమునకు, నందునను భ్రాంతసిద్ధాంతముల ద్రోసిరాజని క్రొత్తసిద్ధాంతముల వెలువరించుటకు నిఁక ముందయి నను శ్రీ నారాయణరావుగారు పూనకుందురుగాక యని సుహృద్భావనముతో విన్నవించుచున్నాను.

దుర్భ్రమలకు లోనయి యెవ రెన్నియసత్యములు వ్రాసినను, అర్జునవాడ శాసనమువంటి సరియగు శాసనముల వలన బసవేశ్వరుని చారిత్రకవ్యక్తిత్వమేగాక యాతని కాలాదికములఁగూర్చి చరిత్రకారులు పూర్వ మొనర్చిన సిద్ధాంతములు గూడ స్థిరీకృతము లవుచున్నవని పాఠకులు గ్రహింతురుగాక!

## అర్జునవాడ శాసనము

శ్లో. నమస్తుంగ శిరశ్చుంబి చంద్ర చామర చారవే
త్రైలోక్యనగరారంభ మూలస్తంభాయ శంభవే. ౧

స్రగ్ధర:

శ్రీయం శ్రీకల్లినాథం కుడుగె భవహరం భక్తబృందస్య గౌరీ,
జాయాకాయానుషంగా కలితలళితతాప్రోల్లసద్వామభాగం,

స్వీయసాయత్తశక్తిత్రయమయమహిమం దేవదాయాదఘూయా
పాయాభిప్రాయ లీలం ప్రణతజన దురంతాఘ సంఘట్టశీలం.
వ. మత్తం తర్దవాడి మధ్యగ్రామ బాగవాడి పురవరాధీశ్వర
మాదిరాజన తనూజం బసవరాజన మహిమ యెంతెందడె.
క. మంగళకీర్తి పురాతన
జంగమలింగైకభక్తి నిర్భరలీలా
సంగం సంగనబసవం
సంగతియం మాళ్కె భక్తి యొళ గనవరతం. ౪
ఉ. యాదవభూమిపాల రిళెయం చతురబ్ధిపరీతెయం నిస
ర్గోదయరాశ్వరం తన రొళశ్వచమూచయ వార్ధిసింహణ
క్ష్మోదయితం తదగ్రతనయప్రభవం నృపకన్నరం సమ
స్తోదధివేలెయం పొటిగె బెళ్గొడె యొళ్నెళలం నిమిర్చిదం.
కం. సలె భూదేవర్కళ్గి
త్తలసదె గోభూమిహేమ వస్త్రాదిగళం
మలె వరసుగ లోళ్కొంబం
బలవంతం కన్నరం ప్రతాపసహాయం. ౬
వ. స్వస్తి సమస్తభువనాశ్రయ శ్రీ పృథ్వీవల్లభ మహారాజాధి
రాజ పరమేశ్వర, పరమభట్టారక, ద్వారావతీపురవరా
ధీశ్వర, యాదవకులకమలకలికావికాసభాస్కర, అరి
రాయ జగజ్జంపహంసె, మాళవరాయ, మదనత్రినేత్ర,
గూర్జరరాయభయంకర, తెలుంగురాయ స్థాపనాచార్య,
ఇత్యాది నామావళిసమలంకృత శ్రీమత్ప్రౌఢ ప్రతాప

చక్రవర్తి శ్రీకన్నరదేవం, దేవగిరియు నెలెవీడినొళు సుఖ
సంకథావినోదదె నానవరతం రాజ్యం గెయ్యుత్తమి
తత్పాద పద్మోప జీవి.

కం. చిక్కన చిక్కమగం విభ
వక్కె కుబేరంగె సెణసువం రాయరుమం
మిక్కం బీచుగి యాదా
ర్యక్కారిం పిరియనాతనణ్ణం మల్లం ఆతనతనూభవం

సగ్ధర:

చావుండం పార్వతీవల్లభచరణ సరోజద్వయీ మోదభృంగం
చావుండం త్యాగభోగానుభవ భవసుఖ శ్రీవధూనృత్యరంగం
చావుండం సామభేదప్రభృతి సకలమంత్రాంగవిద్యాసముద్రం
చావుండం వీరవైరిప్రకర సమరసం ఘట్ట కాలాగ్ని రుద్రం.

కం. ఎనె నెగల్దా చావుండన
మనదన్నం నాగరాజ నఖిలనియోగ
జ్ఞనెనిప్ప దివాకర దే
వనపుత్రం వానసాన్వ యాంబరమిత్రం. ౧

ఉ. త్యాగమునక్కె తాయ్వనె సమస్తనృపాలనియోగవర్త
శ్రీగెనివాస మిష్టర విశిష్టర తోషణపోషణంగళో
ళ్ళాగర మెందు బణ్ణిసువు దీదరె పండితపారిజాతనం ౧
నాగన నాజనార్దనన భక్తిభరప్రభ వానురాగనం.

కం. సంగనబసవన యగ్రజ
లింగైకల దేవరాజమునిపన తనయం

జంగమపరుసం (కావ)ర
సంగం ప్రియసుతనెనిప్ప కలిదేవరసం. ౧౨

కం. కలిదేవ మునిప నాత్మజ
సలె మూజగదొళగె మెఱెవ మానవదేవం
గెలిదం అళనబెసనవం
ఛలరధికం హాలబసవి దేవమునీశం. ౧౩

వ. స్వస్తిసమస్తభువనాశ్రియుం, మహామాహేశ్వర, కైలాస పురవరాధీశ్వరరుం, సువర్ణవృషభధ్వజం, తేసత్తిపురాతన పాదార్చకరుం, మహాలింగప్రసాదనియుతరుం, సమయ భక్తిసంపన్న శ్రీబసవరాజాన్వయరుం. అప్ప తపశ్చక్రి వర్తివీరవ్రతి హాలబసవిదేవంగె, ఆ మహాప్రధానం, రట్టు రాజ్యప్రతిష్ఠాచార్యనుం, అప్ప నాగరసరు శకవరుషం సాసిరదనూఱ యెంభత్తయెరడనెయ సిద్ధార్థిసంవత్సరద చైత్రబహుళ అమాసె సోమవార సూర్యగ్రహాళదల్లి హులిగెరెయ సోమనాథదేవర సన్నిధి యల్లి, ఆ చౌడి సెట్టియ రాతీర్థవిశేషమం బెసగొళలు నూలెనాడొలగిన మనితనాడి కైలాసతీర్థం, నాల్కుయుగద పురాణోక్త దిం బంద క్షేత్రవదెం తెందడె కృతయుగదల్లి కైలాస ముని కైలాసనాథ త్రేతెయలి అంకరాజముని అంకనాథ ద్వాపరదల్లి మహారాజముని మహాలింగదేవ కలియుగ దల్లి కవిరాజముని కవిదేవనామ, ఈ మునిగళు ముఖ్య సమస్తగణేశ్వరరు ఆరాధిసి సాలోక్యసారూప్య సామీప్య,

పాయజ్యవం పడెద మహాదేవరిగె అంకనాథవెసరిం అంక వల, తళవృత్తిసి, కుఱువనిగె ఈ హళ్లిమాంధాతచక్రవర్తి చిట్టధర్మ ఆ తీర్థక్కదు శాసనస్థవెంబుదం చవుడిసెట్టియరు కేళ్దు నాగరసరు తావు ఏకస్థరాగి కైలాస పురదొళగె స్వయంభుమల్లికార్జున సంగమేశ్వర, నాగేశ్వర ఈ మూడులింగక్కం అంగభోగ రంగభోగ జీర్ణోద్ధారక్కం పారణేయ జంగమారాధనెగం, కొట్టసి, కుఱువనినెగె తళవృత్తి అంకవల కూండినాడొళు సలువంతె హెజ్జుగ్గియ హబ్బవాం భత్తుదిన సుంకమాత్రత్తిన పరిహార యింతినితుమం సర్వాబాధ సర్వనమస్యనంమాడి చవుడిసెట్టియదు నాగరసరు యతిరాయహాల బసవిదేవంగె పూర్వదత్తవెందు ధారాపూర్వకం మాడి కొట్టరు. ఆ చవుడిడిసెట్టియర నియామదిం నాగర సరుప్రదిం పడువలు తొఱెయ కూడిద హళ్ళనీరు వరియేమేరె యాగిమేగె కలుకటిగ గెఱె బసవగోడి బాడగలు మొసరగుత్తి యేరారవిడిదు మూడలుజంచిగల్ల కణి కుచ్చగోడియిం బంద హళ్ళనీరువరియే ఔంకలు తొఱెయ కూడలు ఈ చతుస్సీమాభ్యంతర కైలాసపురదల్లి సుంక సాద తళసారిగె, బట్టెయ, బాధె, గాళియ, బళియ, నిధి, నిక్షేప అంకె, టంక, ఆణె గోసనె, ముద్రె, నాగేశ్వరకె మల్లేశ్వరకె కుఱువనిగె, సంగమేశ్వరకె పారణేయ జంగమారాధనెగెకొట్టపిరె ఇదక్కె యిదు నివరవందు

నాగరసను కొట్టశాసన నాల్కుం పట్టణంగళు నూలెనా
డొళగె సంతెగళ ఆయదాయ ఱుపంతు కోణన మెఱెదె
రెసుంకహారినెణ్ణు సమయువు ఆఱువత్తమూవరు బణజు
భకుతి భేదవిల్ల కైలాసపురవే శాసనాదవనె బసవరాజనే
శాసని ఎందు ఉభయనానా దేశిముమ్మురి దండంగళు
కొట్టశాసన. ౧౮

---

## బసవచరిత్ర - సోమనాథ హరీశ్వరకవుల కథనభేదపరిశీలన

వీరశైవ మతోద్ధారకుడగు బసవేశ్వరుడు జననమందినది కర్ణాటక దేశమందలి బాగెవాడి యని పలువు రెఱింగిన విఖ్యాతవిషయము. ఆమహాపురుషుడు కర్ణాట దేశీయుడైనను నాతని చరితమును తొలుదొలుత పురాణరూపకముగ రచించి యాతనిని గావ్యడోలికల కెక్కించి యూరేగించి గాన మొనరించిన మహాకవి పాలకురికి సోమనాథు డాంధ్ర దేశీయుడవుట యొక విశిష్టవిషయము. బసవపురాణ వృషాధిపశతకములలో బసవచరిత్రమును వెలయించుటయ గాక సోమనాథుడు గద్యలు, రగడలు, ఉదాహరణములు మున్నగు లఘుకృతుల రూపకముగ గూడ నసంఖ్యాకముగ బసవస్తవములను గూర్చియున్నాడు. ఆంధ్ర కర్ణాటభాషలలో నింత

విరివిగా బసవచరిత్ర స్తోత్రముల గూర్చిన కవి మఱియొకడు నాటికి నేటికి గానరాడు. ఈతని యవతారము బసవచరిత్ర ప్రకటనమే పరమప్రయోజనముగా వెలసినదని వీరశైవలోక మున విశ్వసింపబడుచున్నది. ఈతని శిష్యప్రశిష్యుడు పిడుపర్తి సోమనాథుడు పద్యబసవపురాణావతారికలో వ్రాసిన యీ క్రింది పద్యముగూడ నీ విషయమును నిరూపించును.

'అసదృశతన్మహామహిమ
మారవితారకమై చెలంగ శ్రీ
బసవపురాణమున్ సకల
భక్తకథామణిసూత్రిభాతిగా
వెస రచియింపు మీవు పృథి
వీస్థలికిం జని నాగ భృంగి సం
తసమున బుట్టె బాల్కురికె
నామపురీవరసోమనాథుడై.'

'బసవన్నమహిమ శంభుద్భక్తియుక్తి
బసరించితివి గద్యపద్యాదికృతుల
నర్ణవావృత ధాత్రియం దొప్ప బసవ
వర్ణనల్ సేసితి వసుసన వీను
లారంగ...'

ఇత్యాదిగా దనసమకాలీనభక్తు లుగ్గడించినట్లు సోమ నాథుడే స్వయముగ బండితారాధ్య చరిత్రావతారికలో జెప్పికొన్నాడు. కర్ణాటభాషలో క్రీ. శ. 1369 ప్రాంతమున

భీమకవి భామినీ షట్పదులలో రచించిన బసవపురాణమే బసవ చరిత్ర విషయమున విస్తృతిగలిగిన ప్రామాణికకృతులలో ప్రాథమికము నగ్రగణ్యము నని కర్ణాటదేశీయులు పలువురు తలంచుచున్నారు. అది సోమనాథుని యాంధ్రద్విపద బసవ పురాణము ననువదించి రచించితి నని భీమకవి విస్పష్టముగ దెలిపియున్నాడు. కావున బసవేశ్వరుని చరిత్రవిషయమున తెలుగు కవి పాల్కురికి సోమన రచించిన ద్విపద బసవ పురాణమునకే విశేషప్రామాణ్యము సంభావిత మగు చున్నది.

సోమనాథుడు బసవపురాణావతారికలో దత్కథా సూత్రములను శ్రీశైలక్షేత్రమున జరగిన యొడ్డోలగములలో కరస్థలి సోమనాథుడు మున్నగు పెద్దలవలన నెఱింగితినని చెప్పటయే గాక గ్రంథాంతమున

'ప్రస్తుతింపంగ సద్భక్తివిస్ఫురణ
బ్రస్తుతికెక్కిన బసవని చరిత
చెప్పితి భక్తులచే విన్నమాడ్కి
దప్పకుండంగను దా శక్తిజేసి'

అని వ్రాసియుండుటచే నాతడుకూడ కేవలము బస వనికి సమకాలీనుడయి యాతని చరిత్రము స్వయముగా నెఱి గినవాడు కాడని విశదమగును. అయినను నీతడు బసవని యనంతరము చాల కాలమునకు వెలసినవాడుగాక యించు మించుగ దత్సమీపకాలమువాడేయని గణించుటకు దగిన

యంతసాన్ఫక్ష్య మాతని బసవపురాణ పండితారాధ్యచరిత్రము లందే కాన నగును. మల్లికార్జునపండితుడు బసవేశ్వరుని సందర్శించుటకై కల్యాణపురమున కేగుసందర్భములో మార్గ మధ్యమున, వనిపురములోనుండగా నప్పటి కెనిమిది దినముల క్రిందట గల్యాణమున జరగిన గజిబిజి కతన బసవేశ్వరు డవ తారమును జాలించి కూడలి సంగమేశ్వరునం దైక్యమయ్యె ననెడి వార్త భక్తులవలన విని పండితారాధ్యుడు మిక్కిలి ప్రలాపించి తనప్రయాణము నావెంటనే శ్రీశైలమునకు మర లించి, శివరాత్రి వ్రతముసాగించి, బసవేశ్వరు డీ ప్రపంచము నుండి నిర్గమించినతర్వాత దానుండియు ప్రయోజనములేదు గావున సంగమేశ్వరగర్భమున బసవనింబలె దన్నుగూడ నిజ గర్భమున నైక్య మొనర్చుమని శ్రీశైల మల్లికార్జునుని ప్రార్థించి యాలింగగర్భమునం దంతర్థి నొందెనని పండితా రాధ్యచరిత్రమునం దున్నది. మఱియు పండితుని కల్యాణ ప్రయాణమునకు మునుముందు బెలిదేవ వేమనారాధ్యుడు మున్నగు భక్తులు బసవనిపాలినుండి యేతెంచి పండితా రాధ్యునకు బసవేశ్వరుని మహిమల నివేదించిరనియు, దదనం తరమే బసవనిదర్శించువేడ్కతో నాతడు కల్యాణమునకు బయలుదేఱె ననియు పండితారాధ్యచరిత్రమందలి దీక్షాపరిక రణమున దెలియ నగును. మఱియు సోమనాథునకు బసవ పురాణ కథాసూత్రముల నెఱిగించిన పెద్దలలో ప్రముఖు డయిన కవప్పలి సోమనాథుడు 'పండితారాధ్య కృపాసముద్ధ

తుడు' (పండితారాధ్యునివలన దీక్షనొందిన శిష్యుడు) అని బసవపురాణావతారికలో నున్నది. పూర్వోదాహృతుడైన బెలిదేవవేమనారాధ్యుని మనుమడు పాలకురికి సోమనాథుని విద్యాగురులలో నొక్కరుడని పండితారాధ్యచరిత్రావతారిక వలన దెలియగలదు.

బసవేశ్వరుడు, నాతని యేలిక బిజ్జలుడు నిర్యాణమందినది, క్రీ. శ. 1168 సంవత్సరమునం దని పలువురు పరిశోధకులు నిర్ణయించి యున్నారు. మల్లికార్జున పండితు డాతరువాత నొక్క వత్సరములోపలనే శ్రీశైల మల్లికార్జున గర్భమందైక్యమగుటచే నాతని నిర్యాణకాలము క్రీ. శ. 1170 ప్రాంతమని నిర్ణీత మగుచున్నది. పండితారాధ్యచరిత్రము చివర సోమనాథు డప్పటికి సజీవులయివున్న పండితుని మనుమల నాశీర్వదించియున్నాడు. సోమనాథుని కృతులందు గానను నేతాదృశమయిన యంతస్సాక్ష్యమునుబట్టి యుస్మదాదుల మాతడు బసవేశ్వర పండితారాధ్యుల యనంతరము చిరకాలమునకు వెలసినవాడు కాడనియు, నాతడు వారి నిర్యాణకాలమునకు వారిచరితముల స్వయముగ బాగుగా నెఱుగనేరని యెనిమిది పదివత్సరముల బాలుడయి యుండి క్రీ. శ. 1160 ప్రాంతమున జనించి, 1192 ప్రాంతమున బసవపురాణమును, 1230 ప్రాంతమున పండితారాధ్యచరిత్రమును రచించి 1240 ప్రాంతమువఱకు జీవించియుండునని నిర్ణయించి యున్నాము. కావున బసవని యనంతర మనతికాలముననే

విరచితమయిన సోమనాథుని యాంధ్ర ద్విపద బసవపురాణ మాతని చరితమును నిరూపించు ప్రామాణిక గ్రంథములలో ప్రధానమయినదని గణించుటలో బాధకము లేదు.

సోముని బసవపురాణమునకు భీమకవి గావించిన యనువాదమునకు మున్ను కర్ణాటభాషలో బసవనిగూర్చి ప్రత్యేకముగ రచింపబడిన కృతు లెవ్వియు గానరావు. కాని హరీశ్వరుడు (హరి హరుడని నామాంతరము) అను కవి యఱువత్తు మూవురు మున్నగు పురాతన శివభక్తుల చరితములను గన్నడమున దేశీయచ్ఛందమగు రగళెలో 'శివగణ దరగళె' యను నామముతో రచించి యందులో బసవని చరితమునుగూడ గొంత 'బసవదేవరాజ రగళె' యను పేర వ్రాసియున్నాడు. ఆంధ్రమున సోమనాథునివలెనే కన్నడమున వీరశైవకవులలో హరీశ్వరుడు ప్రథమశ్రేణికి జెందిన ప్రముఖుడు. పంపాక్షేత్రమందలి విరూపాక్షస్వామి భక్తుడయి యాతడా దేవునిపయి పంపాశతకము, రక్షాశతకము మున్నగు స్తోత్రకృతుల రచించుటయే గాక, గిరిజాకల్యాణ మను ప్రౌఢ కావ్యమునుగూడ రచించి కర్ణాటవాఙ్మయమందలి ప్రౌఢ కవులలో విశిష్టస్థాన మలంకరించినవాడు. ఈతడు క్రీ. శ. 1136-1171 ప్రాంతమున హొయసల రాజ్యమును బరిపాలించిన మొదటి నరసింహ బల్లాలుని కరణికుడుగా గూడ నుండినట్లు తెలియుచున్నది. మఱియు క్రీ. శ. 1245 ప్రాంతమున 'సూక్తి సుధార్ణవ' మను సంధానగ్రంథమునుగూర్చిన మల్లి

కార్జును డను కర్ణాటకవియాకృతిలో హరీశ్వరుని గిరిజా కల్యాణము నుండి పెక్కు పద్యముల గయికొని యున్నాడు. ఇందుచే నెన్నివిధముల జూచినను హరీశ్వరుని కాలము క్రీ. శ. 1216 సంవత్సరమునకు బూర్వమేగాని తరువాత గానేరదని కర్ణాటవాఙ్మయపరిశోధకులు పలువురు నిర్ణ యించినారు. కాగా హరీశ్వర సోమనాథు లిరువురు నించు మించుగ సమకాలికులయి బసవేశ్వరుని యనంతర మత్యంత సమీపకాలముననే యున్నవారని గణింపదగియున్నది.

వీ రిరువురు తమ కృతులలో నొకరి నొకరు స్మరించి యుండలేదు. ఇందుకు గారణము వారించుమించుగ సమకా లీనులయి వేర్వేఱు దూరప్రాంతములలో నున్నవారగుటచే, బసవన్నగూర్చిన తమ రచనముల నన్యోన్య మెఱుంగకుండు టయే యని నే దలంచుచున్నాను. సోమనాథుడు హరీశ్వరుని యనంతరముచాలకాలమున వెలసియున్నచో నాతని 'బసవ దేవరాజ రగళె' జూడకుండుటగాని యాతని స్మరింపకుండుట గాని జరుగ నేరదనియే నా యభిప్రాయము. బసవేశ్వరుడు నాతని యనుయాయులు వసించిన మంగళవేడ, కళ్యాణ పట్టణములకు సోమనాథుని పాలకురికికన్న హరీశ్వరుని హం పియే సమీపమగుటచే హరీశ్వరునికే బసవని గూర్చిన సత్య చరిత్రము తెలియుట కవకాశము లుండియుండుననియు, గావున సోమనాథుని బసవచరిత్రకథనముకన్న హరీశ్వరుని కథనమునకే ప్రామాణ్య మొసంగ నగుననియు గర్ణాట విద్వాం

సులు కొందఱు తలంచుచున్నారు. అదియు గొంతవఱకు
సమంజసమే యని నా యభిప్రాయము.

కన్నడ కవులలో సింగిరాజు అను నతడు బసవరు
చూపిన యెనుబదియెనుమిది పవాడములు (మాహాత్మ్య
ములు) కథాంశముగా 'మలబసవరాజ చరిత' మను కావ్య
మును వార్ధకషట్పదులలో రచించియున్నాడు. సోమనాథుని
పండితారాధ్యచరిత్రనుందలి సహస్రగణమాలికలోని దశగణ
త్రయోదశ గణాచార్యులలో సింగి (శృంగి) రాజనామాం
కితుఁడొక డుదాహృతుడవుటచే నాతడే పూర్వోక్తకృతికర్త
కానోపుననియు, నాతడు బసవని సమకాలికుడయి యుండు
ననియ నభిప్రాయపడి కొంద ఱా గ్రంథమే బసవచరిత్రవిషయ
మున ప్రాథమికముగా బ్రమాణతరముగా గణింపదగునని
తలంచుచున్నారు. కాని యీ యూహ సరియైనదనుటకు దగిన
యాధారములు లేవనియు, సింగిరాజు బసవని సమకాలీనుడై
యాతనికాలముననే యీ గ్రంథమును రచించినయెడల పా
ల్కురికి సోమనాథులు గాని, భీమకవిగాని యాతనిని బేర్కొన
కుండుట యసంభవమనియు, అట్టి ప్రాచీన గ్రంథమే
యున్నచో భీమకవి తాను రచించిన బసవపురాణమునకు
సోమనాథుని యాంధ్ర గ్రంథమును మాతృకగా గ్రహించి
యుండడనియు, క్రీ. శ. 1550 ప్రాంతమున మహాదేవియక్క
పురాణమును రచించిన చెన్నబసవణాంక కవికి మున్నున్న
వీరశైవకవు లెవరు సింగరాజును బేర్కొనియుండ లేదనియు,

నిందుచే నాతడు క్రీ. శ. 1500 ప్రాంతమువాడని తలంచుటయే సంగతమనియు కర్ణాటకవిచరిత్రకారులు వ్రాసియున్నారు. వన్నెచిన్నెలతో బసవని మాహాత్మ్యకథలు దేశమున వ్యాప్తమైన పిమ్మటనే బసవని యనంతరము చాల కాలము నకే సింగిరాజపురాణము రచింపబడియుండుననియు, నందు వాస్తవచరిత్రముకన్న గాల్పనికమే యధికముగ నుండు ననియు నే దలంచుచున్నాను. ఎట్లు చూచినను హరీశ్వర సోమనాథుల కృతులకన్న నిది ప్రాచీనము, ప్రమాణతరము కాజాలదు. ప్రామాణ్యామువమాట యెట్లున్నను బసవచరిత్ర విషయమున హరీశ్వర సోమనాథుల కథనములందలి ముఖ్య విభేదములనైన మనము గుర్తించి పరామర్శించుట యావ శ్యకము. కావున వానిని నిరూపించుటయే యీ వ్యాస ప్రయోజనము.

హరీశ్వరుడు బసవదేవరాజ రగళెను స్థలములని పేరి డిన 25 విభాగములుగ రచించినాడు. ఈ ప్రకరణ విభాగ రచనములో నాతడు ముందొక ప్రకరణమున రగళెయు దరు వాతిప్రకరణమున కేవలము వచనము వరుసగ బాటించి యున్నాడు. ఈ గ్రంథమయినను సమగ్రముగ లభింపకుం డుట దురదృష్టము. పదుమూడు ప్రకరణములు గల సగము భాగము మాత్రమే దొరకగా దానిని మైసూరులో 20 సంవ త్సరముల క్రిందట శ్రీ టి. ఎస్. వెంకణ్ణయ్య (ఎం. ఎ.) గారు ప్రకటించియున్నారు.

1. భూలోకమున శివభక్తి క్షీణించుచున్నదని నారదుడు కైలాసమున కేగి శివునకు విన్నవింపగా, దనకు వాహనమైన నందీశ్వరుని (ద్వితీయశంభుని) శివభక్తి, శైవమత సముద్ధరణములకయి భూమియం దనతరింపుమని యాదేశింపగా, సంతానార్థమై నందినోము నాచరించెడి మండగి మాదిరాజ మాదమాంబికా దంపతులకు బసవేశ్వరుడు తనయుడై యుదయించెనని, జనన సమయముననే జంగమరూపమున సంగమేశ్వరు డరుదెంచి యాతనికి లింగధారణ నొనర్చెనని సోమనాథుడు వ్రాసినాడు. శివలోకప్రమథు లా పదమునుండి డిగి మర్త్యలోకమం దవతరించుట కేదే నొక శాపకారణ మాపాదించుట హరీశ్వరునకు జాలపరిపాటి. దాని ననుసరించియే యాతడు బసవని జన్మవిషయమున నీకింది కల్పనము గావించియున్నాడు.

"ఒకనాడు శివుడు కొలువుదీరియుండ మాలకరి యొకండు కొన్ని సంపెగపూల నాతనికి సమర్పించెను. ప్రసన్నతతో వానిని బరిగ్రహించి యా ప్రసాదపుష్పములను సభయందలి ప్రమథులందఱకు బంచిపెట్టుమని పరమేశ్వరుడు వృషభముఖుడను ప్రమథున కాదేశించెను. అతడట్లు గావించుచు నా సందడిలో షణ్ముఖునకు బ్రసాద మొసంగుట మఱచెను. తనకు బ్రసాదము ముట్టలేదని కుమారుడు మనవి సేయ నందుగూర్చి యీశ్వరుడు వృషభముఖుని గద్దించి ప్రశ్నించెను. మఱుపువలన జరిగిన యీ లోపము నంగీకరించి

క్షమింపుడని ప్రార్థించుటకున్నూ ప్రమథుడబద్ధమాడి షణ్ము ఖునకుగూడ బ్రసాదమిచ్చితినని వాకొనుటయుగాక పయిగా దానిని సమర్థింపబూనెను. నిండు కొలువులో నందిఎదుట జరపిన యీ తప్పిదమునకయి కోపగించి వృషభముఖు నుద్దే శించి పరమేశ్వరు డాతనిని 'భూలోకమున జనించి శివభక్తు లకు దానసమ్మానాదికములొనరించి, చేసిన తప్పున కారూప కముగ బాయిశ్చిత్తమంది యనంతరము మత్సన్నిధికి మరలి వత్తువుగాక' యని శపించెను. ఆశాపకారణముననే వృషభ ముఖుడు బాగెవాడి యగ్రహారమున శైవబ్రాహ్మణుడగు మాదిరాజు ధర్మపత్ని మాదాంబిక గర్భమున జనించెను. కారణజన్ముడగు నాతనయునకు సంతసముతో జాతకర్మ మొనరించి జనకులు బసవడని పేరిడిరి.

2. నిజవంశాచారానుగుణముగ తలిదండ్రులు బసవని కెనిమిదవ యేడు గడువకమున్న యుపనయన మొనరింప నుద్యమింప బసవడు తండ్రితో వివదించి జననకాలముననే శివుని వలన లింగధారణ దీక్షనొందిన కర్మసంహరుడగు తన్ను బ్రాహ్మణ కర్మార్ణవమున ముంపవలదని హెచ్చరించి కర్మ ప్రాధాన్యముగల బ్రాహ్మ్యమునకు భక్తిప్రధానమయి మోక్షైక సాధనమగు వీరశైవమునకు గల యంతరముల నుద్బోధించి, తలిదండ్రులవీడి వీరశైవులలోగూడి వీరశైవ మతోద్ధరణమున కయి తన మనోరథనముల నివేదించెనని

సోముని బసవపురాణమున నున్నది. ఇప్పట్టున హరీశ్వరుని కథన మీక్రిందివిధమున నున్నది :

"కొండొక కారణమున మానవజన్మ మెత్తిన ప్రమథ గణేశ్వరుడగు బసవనికి దలిదండ్రుల తగులాట ముండుట తగవు కాదనుటకో యన నాతని మాతాపితలు బాల్యముననే మరణించిరి. అంత నేడెనిమిదేండ్లు ముత్తవ్వపోషణమున బెరిగి యనంతరము పదునాఱేండ్ల యౌవనప్రాయము నంకు రించుసరికి బసవడు, భక్తికి బ్రాహ్మ్యమునను జాలహూరమని సంభావించి కర్మలతికనుంబలె జన్నిదమును ద్రెంపివైచెను. పిమ్మట నాతడు బాగెవాడిని వీడి మలప్రహారి కృష్ణవేణీ సంగ మస్థలమున నున్న కప్పడిసంగమేశ్వరమునకుం జని సంచరిం చుచు నందొక శివాలయమునుగాంచి పూర్వజన్మ స్మృతిగల వాడవుట నా దేవళములోనికిం జని సంగమేశ్వరునకు బ్రణ మిల్లి యందు శివధ్యానాసక్తుడయి కూర్చుండెను. అచ్చటి స్థానపతి *ఈశాన్యగురునామాంకితు డాతని భక్తికి మెచ్చి ఓభక్తవరా! నీవిక్కడనుండి మఱెక్కడకుం జనక యిందే యుండుము. ప్రతిదినము తీర్థపుష్పములదెచ్చి యీ స్వామి నర్చించి తత్ప్రసాదమును బరిగ్రహింపుము' అని యాదేశిం చెను. వల్లెయని బసవం డందేయుండి నిరంతరము సంగమేశ్వ

---

* ఈ స్థానపతిపేరు జాతవేదముని యని, యాతనివలననే బస వడు దీక్షనొంది తచ్ఛిష్యుడై విద్యార్జన మొనర్చెనని కొన్ని తరువాతి కృతులల్లో నున్నది,

ముని బూజించుచు సుఖంబుండెను. నానాటి కాతని భక్తిగాథ తరమగుచుండెను. ఒకనాడాతడు యథాప్రకారము పూజానంతరము ప్రసాదము గ్రహించి రంగమంటపమున సంగమేశ ధ్యాన నిద్రాముద్రితు డయియుండ స్వప్నమున గోచరించి యాదేవదేవుడు 'కుమారా! ఈభూలోకమున నీవు మిక్కిలి వన్నె కెక్కెదవు. బిజ్జలరాజున్న మంగళవాడకుంబొమ్ము' అని యాదేశించినట్లయ్యెను. అంత మెలకువ వచ్చి కన్ను దెఱచి చుట్టుముట్టిచూడ నేపొడయు బొడగట్టదయ్యెను. అంత బసవడు 'దేవదేవా! ఇంతలోనే యంతర్ధానమైతివే. ఏలనన్నిట్లు త్రిప్పులబెట్టెదవు? నిన్నర్చించినందుకు ఫల మిది యేనా?' అని యాక్రోశించెను. పిమ్మట నాత డెప్పటివలె శివపూజ గావించి మోహవశుండయి యా దినమున బ్రసాదము గొనకయే సంగమేశ్వరుని చరణ సన్నిధిని నిర్వేదముతో బదికిలబడెను. అప్పుడు మరల సంగమేశ్వరుడు స్వప్నగోచరుండయి 'కుమారా! నిన్ను విడిచి నే నెందేగెదను? నీకు నిరోధమేమున్నది? నేను నీతోడివాడనే. ఈమధ్యాహ్నవేళ నీవు శుద్ధాంగుడవయి నందికేశ్వరుని ముందఱ గూర్చుండుము. అతని ముఖాంతరమునుండి బహిర్గతమగు నతడే నీకు సద్గురుడు' అని పలికి యంతర్ధానమయ్యెను. అనంతరము హరకరుణోదయమో యన నరుణోదయము కాగా బసవడు మేల్కని శివార్చనాదికముల దీర్చి, రంగమంటపమున కేగి నందికేశ్వరున కభివందన మొనర్చి యాతని

ముందలి సంగమేశ్వరుని ధ్యానించుచు గూర్చుండెను. అంత గొంతసేపటి కానందముఖమునుండి సంగమేశ్వరుడు లింగరూపమున బయలువడ బసవ డా లింగమును దన హస్తమున జేర్చుకొనెను. నందికేశ్వరుడును దత్క్షణమే ప్రత్యక్షమై బసవనికి బంచాక్షరీమంత్రము నుపదేశించెను. ఇట్లు జరగిన పిమ్మటగూడ బసవేశ్వరుడు సంగమేశ్వరుని సాన్నిధ్యము నెడబాయక కప్పడిసంగమేశ్వరమును విడువకుండెను. ఆ దేవుడాతనికి మరల గలలో గనుపించి "ఇటనుండిపోయి బిజ్జలుని మంగళవాడకు బొమ్ము" అని యాదేశించెను. అంత బసవడిట్లువితర్కించి. "ఇదేమి? పదేపదే యీ స్వామినన్నిట్టులాదేశించుచున్నాడు? కాని మ్మాతడానతిచ్చినట్లే కావింతును. నాకు గొంతయక్షరజ్ఞాన మున్నదిగదా! దాని యాధారమున జీవనముగావింప మంగళవాడకుం జని ధన మార్జించి జంగముల సేవించి తదనుగ్రహమున ధన్యుడ నయ్యెదను గాక" అని మదిలో నిశ్చయించికొనెను.

(పైనిజెప్పిన మంగళవాడ నేటి జొంబాయిరాష్ట్రములో బసవేశ్వరుని జన్మస్థలమగు బాగెవాడికి కొంతదూరములో నున్నది. అది పశ్చిమచాళుక్యుల రాజ్యకాలములో నొక ప్రధానస్థలముగా నుండెను. కలచుర్యవంశజుడగు బిజ్జలుడు మొదట పశ్చిమచాళుక్య చక్రవర్తియగు మూడవ తైలపదేవుని సామంతుడుగా, దండనాథుడుగా కర్ణాటదేశ మండలి తర్దవాడిసీమను బరిపాలించుచుండెను. అప్పుడాతని

కాసీమలోని యీ మంగళవాడయే రాజధానిగా నుండెడిది. అంతియేగాని యది యాకాలమున పశ్చిమచాళుక్యుల ప్రధాన రాజధాని గాదు. నేటి హైదరాబాదురాష్ట్రమందలి బీదరుజిల్లాలోని కల్యాణపురమే పశ్చిమచాళుక్యుల కానాడు రాజధానిగానుండి మహావైభవాస్పదమయి యుండెను. క్రీ. శ. 1060 ప్రాంతమున పశ్చిమచాళుక్య చక్రవర్తిగా నుండిన యాఱవ విక్రమాదిత్యుని యాస్థానకవి విజ్ఞానేశ్వరుడు 'నాసీదస్తి భవిష్యతి క్షితితలే కల్యాణకల్పం పురమ్' అని యాపురమును బ్రశంసించినాడు. బిజ్జలుడు మంగళవాడలో పశ్చిమచాళుక్యుల సామంతుడుగా నున్నప్పు డాతని శాసనము లచ్చటనుండియే వెలువడినవి. బిజ్జలుడు రాజద్రోహియై క్రీ. శ. 1162 ప్రాంతమున దన యేలికయగు మూడవ తైలపదేవుని సింహాసనభ్రష్టుని గావించి పశ్చిమచాళుక్య రాజసింహాసనమును దా నధిష్ఠించెను గాని మొదటినుండియు నాతడు కల్యాణపురమునుండి పరిపాలించినవాడు కాడు. కావున బసవేశ్వరుడు మొదట బిజ్జలుని కొలువులో నాతడు చాళుక్యుల సామంతుడుగా నున్నకాలమున మంగళవాడలోనే ప్రవేశించి యచ్చటనే కొంతకాలము ప్రధానమంత్రిగానుండి వీరశైవమతోద్ధరణము సాగించుచు క్రీ. శ. 1162 సంవత్సరములో బిజ్జలుడు కల్యాణపుర సింహాసనము నాక్రమించినప్పు డాతనితో దానుగూడ దన యనుయాయులతో నచ్చటికి వచ్చి క్రీ. శ. 1168 వఱకు బిజ్జలుని ప్రధాన

మంత్రిగా కల్యాణపురమం దుండి యచ్చట శివానుభవ మంటపాదికముల నిర్మించి కడపటి కాలములో దత్పురము నుండియే తన మతోద్ధరణాదికముల నిర్వహించియుండు ననియు, నాతడు బిజ్జలుని మంత్రిగా మొదట జాలకాల ముండినది మంగళవాడయందే యనియు దలంచుటయే సమం జసము. ఏతద్విషయకమయిన చర్చలగూర్చి వావిళ్లవారు ప్రకటించిన ద్విపద బసవపురాణమందలి నా పీఠికలో 'బసవే శ్వరుడు-బిజ్జలుడు' అను శీర్షిక క్రింద వ్రాసిన విషయముల గూడ జూడదగును. సోమనాథుని బసవపురాణములో మంగళవాడమాటయే గనరాదు. అతడు నాతనికి బసవ పురాణకథాసూత్రముల నెఱిగించిన పెద్దలు మంగళ, కళ్యాణశబ్దములు పరియాయపదములవుటచే మంగళవాడ, కల్యాణపట్టణము నొక్కటేయని భ్రమించిరేమో యని యూహింపనైయున్నది. ఉపలబ్ధమైన హరీశ్వరుని రగళె భాగ ములో కల్యాణపుర ప్రశంస యేమియు గనరాదు.

3. బిజ్జలుని కొలువులో బసవేశ్వరుడు ప్రధాన మంత్రిగా గుదిరిన సందర్భముల వివరించుటలోగూడ హరీ శ్వర సోమనాథుల కథనములలో పెక్కు విభేదములున్నవి. బిజ్జలుడు కల్యాణపురములో రాజ్యము సేయుచుండ నాత నికి బసవేశ్వరుని మేనమామ బలదేవుడు ప్రధానమంత్రిగా నుండెననియు, బసవనియుపనయనకార్యమునకయి యాతడు ఛనుదెంచినప్పుడు బసవడుపనయన కర్మమును గర్హించి

తండ్రితో వివరించి, తలిదండ్రుల విడనాడి యగ్రసోదరి నాగాంబికతోగూడ వీరశైవులలో జేరినప్పుడు బలదేవుడు మేనల్లుని ప్రతిభకు నఖండశివభక్తికి సంతసించి తనతనయ గంగాంబిక నాతనికే పరిణయమొనరింతునని ప్రతినచేసి యట్లు గావించెననియు, అనంతరము కొంతకాలమునకు బలదేవుడు పరమపదింప బిజ్జలుడు బసవని ప్రతిభాసామర్థ్యముల విని మేనమామ మంత్రిపదము నాతనికే యొసంగెననియు సోమనాథుని బసవపురాణములో నున్నది. హరీశ్వరునిరగళెలో బసవనికి బలదేవుడను మేనమామ, నాగాంబికయను సోదరియున్నట్లు గాని, బసవనిభార్య గంగాంబ బలదేవుని పుత్రియనిగాని, బలదేవుడు బిజ్జలుని ప్రధానమంత్రి యను విషయముగాని యేమియు గానరావు. అతని కథన మీక్రింది విధమున నున్నది.

"కూడలి సంగమేశ్వరుని యుద్బోధ మనుసరించి బసవడు గణకవృత్తికి దగిన వేషమునుబూని మంగళవాడకుం జని యా పురవీథుల సంచరించుచు దత్పుర వైభవమునకక్కజమంది బిజ్జలుని యాస్థానమునకేగి యచ్చటి భాండాగారమున నిలువయున్న ధనమునకు లెక్క తేల్చుటలో నిమగ్నులయి యున్న గణకోద్యోగుల జూచుచు నిలిచియుండెను. అప్పుడు బిజ్జలుని ప్రధానసచివుడు సిద్ధదండనాథు డరుదెంచి నిలువ మొత్తమెంతయని యాయుద్యోగుల ప్రశ్నింపగా వారు అంబదుకోట్ల మొహరులని ప్రత్యుత్తరమొసంగిరి,

ఇదిచూచి యీ ప్రక్కనున్న బసవన్న యీ లెక్క తప్పె నియు సరిగా గణించినయెడల ధనాగారమందలి మొత్త మయిదుకోట్లకన్న నేమాత్ర మెక్కువయుండదనియు సిద్ధ మంత్రికి నివేదించెను. అపరిచితుడయిన యీ యాగంతుకుని వచనమున కాశ్చర్యమంది సిద్ధమంత్రి నిలువమొత్తమును గణకులచే మరలలెక్క వేయింప నది బసవడు చెప్పినదానికే సరిపోయెను. బసవని గణితశాస్త్రకుశలత కలరి యామంత్రి సత్తము డీవృత్తాంతమును బిజ్జలునకు నివేదించెను. ఇరువురు గూడ నంత సంతసముతో సంవత్సరమునకు 101 బంగరు నాణెముల వేతనమేర్పఱచి బసవని దమభాండాగారోద్యోగిగా నియమించిరి. సిద్ధమంత్రి బసవని దనయింటికి గొని పోయి యాతని పుట్టుపూర్వోత్తరములను, కులగోత్రములను విచారించి, తత్సంబంధము తన కనుగలంబనియెంచి సంతసించి, సంతానహీనుడవుట బసవని బుత్రనిర్విశేష వాత్సల్యముతో నిజగృహమందే యుంచికొని తన్నిర్వహణభార మంతయు నాతనికి యొప్పగించి యాదరించుచుండెను. ఇట్లు కొంతకాలము గతింప సిద్ధమంత్రియు గతించెను. అంత బిజ్జలుని యానతిపయి బసవడే సిద్ధమంత్రి యంత్యక్రియల నాచరించి తానే యాతని సర్వస్వమున కధికారి యయ్యెను. బసవని ప్రతిభావిశేషముల గుర్తించినవాడగుట బిజ్జలు డాతనినే సిద్ధమంత్రిస్థానమున ప్రధానసచివునిగా నియమించెను. ఇది తక్కిన మంత్రులకెల్ల మిక్కిలి కన్నెఱ్ఱగానుండెను. బసవని

పయి వారి కసూయా ద్వేషములు ప్రబలజొచ్చెను. బసవని శివభక్తియు దినదినాభివృద్ధినొంది యాతని కీర్తిని వెలయించుచుండెను. అతడు కేవలము బిజ్జలుని భండారియేగాక భక్తి భండారిగగూడ విశ్రుతికెక్కెను. ఒక్కనా డాకస్మికముగ ఘటిల్లిన యీ క్రింది సంఘటనమూలమున బిజ్జలునకు బసవని యెడగల గౌరవము మఱింత వృద్ధియయ్యెను.

"బిజ్జలుడు కొలువుదీర్చియుండ మాలకరియొకం డొక్కనా డాతనికొక కేతకీపుష్పమును సమర్పించెను. దాని నాతఁ డాదరపూర్వకముగ గ్రహించి యందలి రేకు లనువిచ్చి గద్దెప్రక్క నధివసించిన ప్రధానమంత్రి బసవని కొక రేకు నొసంగెను. తనకు లబ్ధమైన పదార్థములెల్ల శివార్పిత మొనర్చు నియతిగల బసవ డాక్షణము దానిని దన యిష్టలింగమున కర్పించెను. దీనిని గాంచి రాజగురువు నారాయణాశ్రమి యనునతడు బసవనిపయి ననూయా ద్వేషములు గలవాడు. 'శివాగములలో గేతకీపుష్పము శివార్పణమునకనర్హమని యున్నది. మీ మంత్రి యొనర్చిన పని ధర్మవిరుద్ధము' అని బిజ్జలునితో బలికెను. బసవ డిది విని చిఱునగవుతో 'ఓ వెఱ్ఱిబాపడా! భక్తుడు భక్తితో నర్పించున దేదియైనను బరమేశ్వరు డంగీకరించును' అని మాఱుపలికెను. బిజ్జలు డిందుకు దృష్టాంత మేమి యని ప్రశ్నించెను. అప్పటి మాహేశ్వరమండలిని వారు ధరించిన యిష్టలింగములను బిజ్జలుడు చూపుమని బసవడు తనవిచేయు

నం దొక్కటి దానియందు లింగశిరముపయి బసవడు తన యిష్టలింగమున కర్పించిన సేదగిరేకునుబోలిన రేకులే కాన నయ్యెను. అంతియేగాక మంగళవాడయందలి శివాలయము లోని స్థావరలింగచరణసన్నిధినిగూడ నట్టిరేకులే పొడగ ట్టెను. బిజ్జలుడు విస్మితుండయి బసవడు సాక్షాత్కూడలి సంగమేశ్వరుడే యని సంభాషించెను."

బసవేశ్వరుని భక్తిమాహాత్మ్య నిరూపకములగు కథలు హరీశ్వర సోమనాథుల యిరువురకృతులలోను గూడ గలవు. పిడుపర్తి సోమనాథుడు చెప్పినట్లు పాల్కురికి సోమన బసవ పురాణములో బసవని చరిత్రము సకల భక్తకథామణిసూత్ర భాతిగా రచించుటచే నాతని గ్రంథము బసవని యాత్మ చరిత్రముతోకన్న నితర పురాతన, సమకాలీనభక్తుల చరి త్రములతో విస్తృతమయియున్నది. హరీశ్వరు డిట్టి పురాత నభక్తుల చరిత్రములను ప్రత్యేకముగ వేర్వేఱుగా దన 'శివ గణదరగళె' లో రచించుటచే 'బసవ దేవరాజరగళె' లో వానిని బసవచరిత్రములో గ్రథించు నావశ్యకత యాతనికి లేదు. ఆతని దృష్టి చాలవఱకు బసవని యలౌకికధార్మిక జీవ నము పాఠకహృదయములకెక్కునట్లు వర్ణించుటయందే నియుక్తమయ్యెను. అట్టి పట్టులనే యాతడు జాణతనము మెఱయ వర్ణనవిస్తృతిని వైవిధ్యమును బ్రదర్శించియు న్నాడు గాని తక్కినయెడల శాఖాచంక్రమణము పొంత

బోవక కథావేగమున కాటంకములేని వెరవుతో  గేపలము బసవచరిత్రము దా నెఱింగినదానిని వివరించియున్నాడు.

బసవని భక్తిభావనచే దొంగలు వంచకత్వము మెయి మెడలందు వస్త్రముల మాటున ధరించిన వంగకాయలు లింగములయిన కథ; బసవడు శివపూజాసమయమున ధ్యాననిష్ఠుడయి యున్నప్పు డాతనిని దర్శింప (గొత్త జంగమము (ఆగంతుకులు) లరుదెంచుట, ద్వారపాలకులు దర్శనమున కిది యదను కాదని చెప్ప వారు మరల వచ్చుతలంపుతో బురములోనికి విహరింపనేగుట, బసవడు జంగమప్రాణి గావున ధ్యానసమాధిలోనున్న బసవనిప్రాణము లాజంగముల వెన్నింటి వెడలిపోవ నాతడు నిర్జీవియై నేలవ్రాలుట (పండితారాధ్యచరిత్ర దీక్షాప్రకరణమున నుదాహృతమయిన కథ); మహావైభవముతో బసవడు నిత్యవ్రతముగా నొనర్చు జంగమారాధనములు, అతని సపర్య లందిన జంగమములు రాజపుత్రులకన్న మిన్నగా నాడంబరముతో రాజవీథుల విహరించుటలు తిలకించిన బసవనితోడిమంత్రులు నసూయాపరులు భాండాగారమునందలి ధనమునెల్ల బసవడు జంగములకు జూఱలిచ్చుచున్నాడని కొండియములు సెప్ప బిజ్జలు డనుమానముతో బసవని యెదుట బొక్కసమందలి రొక్కము నెక్కింప నది పెక్కురెట్లు లెక్కువగనుండుట, అందఱు విన్నవోవుట - యనుకథలు స్వల్పవ్యత్యాసములతో హరీశ్వరుని రగళలోఁకూడఁ గాననగును.

బసవని మేనమామ బలదేవుడు తన తనయ గంగాంబ నాతనికిచ్చి వివాహమొనర్చెనని బసవపురాణమున నున్న సంగతి నింతకుమున్నే చెప్పియుంటిని. బసవని కీమె కాక మఱి యొకభార్య యున్నట్లు సోమనాథుడు చెప్పలేదు. ఆమె యందైనను బసవని కేమయిన సంగతి గలిగినది లేనిది యాతడు చెప్పలేదు. హరీశ్వరుని రగళలో సిద్ధమంత్రి మరణానంతర మాతని సంపదయు, బిజ్జలుని ప్రధానామాత్యపదవియు దనకొదవిన యనంతరము బసవడు సత్కులీనలు, సుశీలలు నగు గంగాంబ, మాయిదేవియను వనితల బరిణయమయినట్లుగ్గడింపబడినది. కాని యీ యిరువురు నెవరి తనయలో నందుదాహృతము కాలేదు. కొంతకాలమునకు బసవనికి గంగాంబికవలనసిద్ధరసను పుత్రుడు గలిగినట్లు గూడ నందు జెప్పబడినది. బిజ్జలుని కొలువులో గుదిరిన యదనులో దన్నాదరించిన సిద్ధమంత్రి యందలి భక్తిగౌరవములచే నాతని పేరే కుమారునకు బసవడు పెట్టియుండునని యూహింపదగి యున్నది. ఇది సంగతమే. తరువాత దరువాత వెల్వడిన బిజ్జలరాయచరిత్రాదిక కృతులలో బసవనిసోదరి పద్మావతిని బిజ్జలుడు, బిజ్జలునిసోదరి నీలలోచనను బసవడు పరిణయమైరను గాథలకు హరీశ్వరసోమనాథుల కృతుల రెంటనుగూడ నెట్టి యాకరము గానరాదు. బసవనికి బాలసంగయ్య యను మఱొక పుత్రుడు గలిగి పసితనముననే యసువుల బాయ బసవడెంతయు సంతాపించెనని సూచించు నాతని గీతమొకటి

'భైరవేశ్వర కావ్యకథాసూత్ర రత్నాకర' మనెడి మఱొక యర్వాచీనకృతిలో నుదాహృత మయినది. కాని యీకథ కును హరీశ్వర సోమనాథుల కృతులలో నాకరము గన రాదు. బసవేశ్వరుని వంశ్యుడు హోలబసవదేవునకు యాదవ కన్నర భూపాలుని యుద్యోగులు దానమొసంగుచు క్రీ. శ. 1260 లో వెలయించిన అర్జునవాడ శిలాశాసనమునుబట్టి బస వని వంశమాతనితో నంతరింపలేదని వ్యక్తమగు విషయము నకు హరీశ్వరుని రగళికూడ సాధకమగుచున్నది.

శివభక్తులను సాక్షాత్సంగమేశ్వరమూర్తులుగనే సంభావించి, వారు తన్నేది యడిగిన నది యొసంగ బసవడు ప్రతినయొనర్చి యావ్రతమును సర్వవిధముల నిర్వహించినా డని హరీశ్వర సోమనాథు లిరువురుగూడ జెప్పియున్నారు. ఈ విషయమున బసవని ధార్మికజీవన నిరూపణములో హరీ శ్వరుడు వివరించిన యీక్రింది వృత్తాంతములు సోమునికృతు లలో గానరావు.

1. ఒకనాడు పసులకాపరి బసవనమ్రోల కేతెంచి దొంగలు కొందఱు శివలాంఛనధరులయి యరుదెంచి కొట్ట మందలి పసులం దోలికొనిపోయిరని మనవిచేసెను. ఇది విన్నంతనే బసవడు "ఓయి! వెఱ్ఱివాడా! శివలాంఛన ధరు లేమి! దొంగలగుటయేమి! లింగాంగులలో దొంగలుందురే! ఇది పట్టి యసంగతముగాదా!' యని లింగాంగులయెడ దనకు

గల భక్తిభావనను వెల్లడించి 'పోయి వెంటనే పసులవెంట
నేగి మరల్చికొనిరమ్ము' అని యాదేశించెను.

2. బసవని యనుయాయులలో గిన్నరబ్రహ్మయ్య
యాతనికి బహిఃప్రాణముగా నుండెనని సోమునికృతులలో
గానసగును. విటుడొకడు తన వేశ్య గావించు పబ్బమునకయి
పిలిచికొనియేగు గొట్టెను కల్యాణపురమున త్రిపురాంత
కేశ్వరుని యాలయావరణములో ప్రవేశింప దానిని
బ్రహ్మయ్య రక్షించిన కథ (బసవపురాణ పంచమాశ్వాస
మున వర్ణితమయినది) గాని, బసవయ్య, బ్రహ్మయ్య
యన్యోన్య ప్రాణానుసంధానమున నిర్జీవులయి పడియున్నయెడ
మడివాలు మాచయ్య యుద్బోధమునవారు తెలివినొంది
లేచిన కథ (పండితారాధ్యచరిత్ర దీక్షాప్రకరణమున వర్ణిత
మయినట్టిది) గాని హరీశ్వరుని రగళెలో లేవు. కాని కిన్నర
బ్రహ్మన్న విషయమున మఱొక వింతవృత్తాంతమం దున్నది.

"ఒకనాడు బసవని మహానసశాలలో బ్రహ్మయ్య తనకు
బ్రీతికరమయిన నీరుల్లిగడ్డలను దఱిగి శోధించుచుండెను.
అప్పుడచ్చటికి వచ్చిన బసవడు బ్రహ్మయ్యను జూడకయే
నీరుల్లివాసన సోకినంతనే 'ఈ యభక్ష్యవస్తువు నిటకు దెచ్చిన
దెవరు?' అని యాక్షేపించుచు నంతిపురమునకు మరలెను.
ఈ మాట తన చిత్తమునకు హత్తక యుత్తలపాటుతో
బ్రహ్మయ్య యటనుండి వెడలిపోయెను. మధ్యాహ్నము
జంగమారాధనవేళను బసవ డరుదెంచుసరికి భోజనశాల

యందు బ్రహ్మయ్య గానిర్ణింపడయ్యెను. అతనిగూర్చి విచారింప జరిగినసంగతి యెఱుగనయ్యెను. అప్పుడు బసవడు తన తప్పు నొప్పుకొని బ్రహ్మయ్యను వెదకుటకు వెడలి యాతని గొనితెచ్చి తత్సంప్రీతికయి యానాడు నీరుల్లిగడ్డలతో సంతర్పణ మొనర్చుటయే గాక యేటేట నట్టిపబ్బ మొనర్తునని నిశ్చయించెను."

3. కళింగదేశీయుడు మహాదేవసెట్టియను మహేశ్వరు డొకనాటి జంగమారాధన సమయమున జంగముఖంబు 'వలసిన దడుగకున్న శరణులకాన, వా రడిగిన దీయకున్న నాకు ఆన; కూడలసంగ' అను భావముగల బసవని గీతము పాడగా విని యక్కజమంది యాతని భక్తిని బరీక్షింప విడ్డూరపు గోరికల గోరి వ్రతభంగ మొనరింతునని సంకల్పముతో మంగళవాడ కరుదెంచి, బసవని సపర్యలనంది యాతనిపంక్తిని బ్రసాదమును గ్రహించు సమయమున 'బసవా! భక్తులడుగున దెల్లగా దన కొసగెదను' అను నీ బాసనువిని వెక్కసమగు కోర్కులతో బదిపుట్ల బంగారము, బదిపుట్ల మాణిక్యములు బదిపుట్లు ముత్యములు నర్థించి నీ బిరుదుబింకముల బన్న మొనర్చు తలంపుతో నింతదూరము వచ్చినాడను' అని నూతనితో వచించెను. 'అడుగదలచిన దవశ్య మడుగుము' అని బసవడు బదులు పలుక నా పరదేశి జంగముడు తన వాంఛితమును వెలార్చుటలో నీశ్వర ప్రేరణమున 'ముప్పదిపుట్ల జొన్నలు, వడ్లు, వరగలునిమ్ము' అను

మాట లాతనినోట వెల్వారెను. అంత బసవ డాతనితో 'ఈ యల్పమే యడిగినాడ వేమి? ఏ వింటినుండి బయలు దేఱునప్పు డే కోరికల దలపెట్టివచ్చితివో సందేహింపక యావియే యడుగుము. ఇచ్చెడివాడు సంగమాడు. వేడెడి వాడు నాతడే! ఇంక లో నాకు భారమేమున్నది' అని మాఱు వలికి యాతని యసలు కోరికలనే పూరించి పంపెను. (ఇది సోముని బసవపురాణ తృతీయాశ్వాసమందలి 'జొన్నలు ముత్తెములైన కథ' కు రూపాంతరముగ దోచుచున్నది.

బసవని దారేషణరాహిత్య నిరూపణమున కయి బసవపురాణము మూడవ యాశ్వాసములో సోమనాథుడు, మిండజంగమ మొకండు తాను వలచిన వేశ్యకొఱకు బసవని భార్య గంగాంబధరించిన పటవలి ఘట్టమును కోరగా బసవడు కాదన కాఘట్టము నామె యొడలినుండి యొలిపించి యిప్పించెననియు; నంత నా మెకట్టుపుట్టము లక్షయమయ్యెననియు నొక కథను జెప్పియున్నాడు. ఏతాదృశసన్నివేశమునకయి దీనికన్న మిన్నయగు నీ క్రింది కథ హరీశ్వరుని రగళిలో నున్నది.

“కూడలి సంగమేశ్వరుడు బసవని భక్తిపరిణతిని పరీక్షింప నొకనాడు పదునాఱేండ్ల మిండజంగముని వేషముతో నరుదెంచి యాతని సపర్యలనంది శయనాగారమున మృదుతల్పమున బవళించెను. అప్పుడా జంగముడు బసవడు భక్తితో దన పాదముల నొత్తుచుండ 'బసవా! నా ప్రక్క నొక్క

మత్తకాశిని హత్తియుండనిదే నే నిందుండజాల. వేగ మామెను జేకూర్పుము' అని యాదేశించెను. బసవడు పరిచారకుల బిలిచి వేశ్యావాటికకేగి యందరసి యందకత్తె యగు పణ్యాంగనను గొనితెండని నియోగించెను. అంతకు మున్నే సంగమేశ్వరుని యానతిపయి ప్రమథులు కొందఱు విటవేషములతో మంగళవాడకు జనుదెంచి వేశ్యావాటిక యందలి వేశ్యలకెల్ల గోయిడి వారిని విలిచికొని యింటింట నొక్కొక్కరు డొక్కొక్క వెలచెలితో గూడియుండిరి. బసవని పరిచారకులు భగ్నప్రయత్నులయి మరలివచ్చి యాతన కీవృత్తాంతమును విన్నవించిరి. అంత బసవడు తనద్వితీయ సతీతిలకము మాయిదేవిని బిలిచి తనకు వ్రతభంగముకానున్న ప్రమాదము నివేదించి, శయ్యాగృహములోనికిం జని జంగమయ్యకోర్కె దీర్పుమని యాదేశించెను. పల్లెయుని యావనితామతల్లియు లోనికిం జన, బసవడు తదాగారద్వారమును మూసి బయుట గాపుండెను. బసవని దృఢభక్తి కానందించి సంగమేశ్వరుడు మాయిదేవికి నిజరూపముతో సాక్షాత్కరించెను. అంత నామె కంపరపడి పంచవదనములు, త్రినేత్రములు, దశభుజములతోడి యా దేవుని యాకృతిని జూడ నేరక బిరబిర శయ్యనుండి డిగి 'నాథా! జంగమయ్య సంగమదేవ రయ్యెనే' అని బిగ్గఱగ నఱచెను. బసవడు తలుపుదెఱచి 'తల్లీ! తల్లీ! ఏడీ! ఏడీ! అనుహోమభావుడు' అని డగ్గఱునంతలో సంగమేశ్వరు డంతర్ధానమయ్యెను." (ఇది యెల్లవిధముల భల్లాళచరిత్ర కథను బోలియున్నది.

అంత్యజుడగు శివనాగుమయ్య విషయమున బసవపురాణ సప్తమాశ్వాసములో సోమనాథుడు చెప్పిన కథకు హరీశ్వరుని కృతిలోని కథనమునకు విశేషభేదము లేదు. అందలి విధ మిది. "బసవడు వెలివాడకుం జని సెంబలి నాగిదేవయ్య యింట ప్రసాదమును భుజించెనని వైష్ణవపురోహితునివలన విని నారణక్రమి, విష్ణుపెద్ది మున్నగు బాపనయ్యలు బిజ్జలునికడ కేగి 'ప్రభూ! బసవనిపనులు నానాటికి విపరీతములగుచున్నవి. వర్ణాశ్రమధర్మముల మంట గలుపుచున్నాడు. నేడు వెలివాడలో నొక సెంబలియింట భుజించినాడట. ఇక నాతనితో నీ సభాగారమునకుగూడ రానోపును. అట్టిచో మేమిట నుండనేరము' అని విన్నవించిరి. బిజ్జలుడు వారిని సమాధానపఱచి 'బసవనిబిలిచి తప్పక యందుగూర్చి విచారింతును' అని చెప్పి, బసవడా మాలని వెంటబెట్టికొని యే వచ్చునేమో యను సందియముతో రాజాంగణము బయటనే సభాకూటము నేర్పఱచెను." తరువాయికథ యించుమించుగ బసవపురాణమునందున్న విధముననే యున్నది. కాని బసవడు నాగుమయ్యగారి కరాంగుళుల నాస్ఫాలించినంతన గాక యాతని పాదాంగుష్ఠపు మొనను సురియతో నొరయగా నందుండి క్షీరములు ధారాప్రవాహముగ స్రవించినట్లు హరీశ్వరుడు వర్ణించినాడు.

మనకు దొరకిన హరీశ్వరుని బసవదేవరాజరగళె యసమగ్రమని యందలి సగముభాగము మాత్రమే లభ్య

మయి ముద్రితమయినదని యింతకుమున్నే చెప్పియుంటిని. ఈ భాగములో బసవని కన్నిపినముల విధేయుడై బొసటగా నుండిన యాతని మేనల్లుడు చెన్నబసవనిగూర్చిగాని, యాతని తల్లి యక్కనాగమ్మగూర్చి గాని యే ప్రశంసయు గానరా కుంట యక్కజముగ నున్నది. మఱియు నం దుదాహృతము యిన చరిత్రమంతయు మంగళవాడలోనే జరగినట్లు దాని వలన గాననగును. బిజ్జలుడు తనయేలిక తైలపదేవుని బదభ్ర ష్టుని గావించి కల్యాణపురమున బశ్చిమచాళుక్య రాజసింహా సన మధిష్ఠించినప్పుడు మంగళవాడనుండియాతనితో బ్రధా నమంత్రి బసవేశ్వరుడుకూడ క్రీ. శ. 1162 ప్రాంతమున గల్యాణపురమును జేరి తన యంతిమదశలో నారేండ్లపాట చ్చటనుండియే వీరశైవమతోద్ధరణమును సాగించి యుండు ననియు బైని వ్రాసియుంటిని. హరీశ్వరుని రగళెలో మనకు దొరకని కడపటిభాగములో బసవడు కల్యాణపురములో నున్నప్పుడుజరిగిన వృత్తాంతములు చెప్పబడియుండునేమో !

అంతిమదశలో ఘటిల్లిన బిజ్జలునివధకు గల్యాణపుర మందలి గజిబిజికి గారణ మాతడు అల్లయ్య, మధుపయ్య యను భక్తవరుల కనుల నకారణముగ దీయించుటయేయని సోముని బసవపురాణమువలన దెలియనగును, సోమనాథుడు స్పష్టముగ జెప్పకున్నను బిజ్జలుడొనర్చిన యీఘోరకృత్య మునకు వాస్తవకారణ మేదే నొకటియుండియే యుండును. పైని బేర్కొన్న యల్లయ్య (హరళయ్య) మధుపయ్యలలో

మొదటి యాతడు జాతిచే నంత్యజుడనియు, రెండవ యాత డగ్రజుడనియు, బసవని సంస్కరణముల ఫలితముగ వారు వీరశైవదీక్షితులయి రనియు, అట్టి దీక్షనొందినవారికి తొంటి కులముల ప్రసక్తియుండనేరదు కావున బసవని ప్రేరణమున అల్లయ్య కుమారునకు మధుపయ్య కొమారితకు బాణముము కాగా నిందుగూర్చి పూర్వాచారపరాయణులగు బ్రాహ్మణులు గావించిన యలజడికి లోబడి బిజ్జలుడు బసవడు వలదని వారించుచున్నను నూత్నదంపతుల నేనుగుచే ద్రొక్కించి వారి జనకులకనులం దీయించెననియు నిందుచే నాగ్రహపూరితులయి బసవనికి దెలియకుండగనే జగదేవుడు, బ్రహ్మయ్య, మల్లయ్య యను వీరశైవ మతీయులు బిజ్జలుని యంతిపురము నజొచ్చి యాతనినంతమొనరించిరనియు, గౌతమబుద్ధుడు, గాంధిమహాత్ముడువలె కేవల మహింసావాదియగు బసవనికి బిజ్జలుని హత్యతో నెట్టి సంబంధము లేదనియు, అనుచరుల నదలింపజాలక నిస్సహాయుడయి బసవడంత కల్యాణమును వీడి కూడలి సంగమేశ్వరమునకుం జని సంగమేశ్వరగర్భమం దైక్యమయ్యెననియు, నేడు కర్ణాటవీరశైవసోదరులు పలువురు వ్రాయుచున్నారు, కాని సోముని బసవపురాణమందలి జగదేవుని కథను (ఆ-7) సావధానముగ జదువువారి సంగతులు కేవల సత్యసమ్మతములుగ దోపనేరవనియే నా యభిప్రాయము. మునుముందనతికాలములో బిజ్జలునివలన శివాపచారకములగు కృత్యములు జరుగగలవనియు, నష్ట

డందుకు బత్రికియు గావింప జగదేవుడు బాసచేసిననే యాత నియింట జరుగు సమారాధనములో విందారగింతుమనియు బసవడు నాతనియనుచరులు జగదేవు నుద్బోధించి యందుకై యతని ప్రతిన గయికొనినట్టులు, అల్లయ్య మధుపయ్యల కనులం దీయించి తద్ద్రోహపకముగ బిజ్జలుడు శివాపచార మొనర్పగనే బసవడు నాతని యనుయాయులు జగదేవుని బాస నాతనికి జ్ఞాపకముచేసి దానిని నిర్వహింపుమని హెచ్చరించి, కల్యాణపురము పాడగునట్లుశపించి యందుండి నిర్గమించినట్లు సోమనాథుడు చెప్పియున్నాడు. అహింసా ధర్మ మనాదినుండియు సకలదేశీయులకు, మతీయులకు నాద ర్శముగ నాపాదింపబడినదే. కాని యందు కపవాదరూపక ములగు ధర్మములుగూడ నక్కడే ప్రతిపాదింపబడియున్నవి. శిష్ట రక్షణము తోపాటు దుష్టశిక్షణము గూడ బరమేశ్వరునకు, దదంశసంజనితులగు ధరణిపాలురకు గూడ నవశ్యాచరణీయ ధర్మముగ బ్రశంసింపబడియున్నది. శివాపచారములను శివభ క్తులు సహింపరాదనియు, తత్పరిహారమునకయి వారు ప్రాణ ముల గోల్పోయినను మోక్షహేతువేయగుననియు, అట్టి యపచారకులు హంతవ్యులనియు శివాగమము లుగ్గడించియే యున్నవి. మల్లికార్జునపండితుని శివతత్త్వసార మందలి యీక్రింది పద్యములుగూడ దీనికి దోడువలుకుచున్నవి.

"ధ్రువముగ సర్వప్రాణుల
కవశ్యమును జేయకుండు నహింసమదిన్

శివనిందకులగు పాపుల
ననిచారితవృత్తి జంపనగు నీశానా." (ప 27

"శివనిందారతు జంపిన
జవమఱి తత్కారణమున జచ్చిన నీ రెం
డు విధంబుల నీకారు
ణ్యావశంబున ముక్తి బొందు నరు డీశానా". (ప 27

"సంహృత భవ! నీభక్తికి
నంహోమతి వక్రులైన నప్పుడ 'తేశి
ర్ఘం హాంతవ్యా' యనుటను
సంహారించుటయు పథము జనకులనైనన్."

శివాజ్ఞపయి దక్షకుమారుడు వీరభద్రుడు దక్ష
శిరమును దఱుగుటకు హరుని వెలివెట్టి గావించిన యాగ
యాగమున కరుదెంచిన సురకోటుల శిక్షించుటకు మూలకా
రణ మీశివాగమాపాదిత ధర్మనిర్వహణమేగదా! బసవ
సంగమేశ్వరు డొనర్చిన యుద్బోధములలో

'చిత్తజాంతకుభక్తి జెడనాడు ఖలుల
మిత్తి వౌమను ద్రుంపుమీ బసవన్న'

అనికూడ నున్నది. కావున బూర్వోక్త పరిస్థితులలో
జరిగిన బిజ్జలుని సంహృతికి బసవని యనుమతియున్న
అది యాతనికీర్తికి గళంకము కానేరదనియే యెన్నదగును
ఈవిషయమున హరీశ్వరుని కథనముగూడ దొరకియున్న న
సత్యనిర్ణయమునకు మన కుపకరించియుండును. అది యలభ్య
మగుట శోచనీయము.

# బసవేశ్వరునిగూర్చిన ఆంధ్రవాఙ్మయము

[మైసూరుప్రభుత్వమువారు ప్రకటించిన బసవేశ్వరుని అష్టమ శతవార్షికస్మారకసంచికలో శ్రీ తమ్మయ్యగారు ప్రకటించిన Basaveswara in Telugu Literature అను ఆంగ్లవ్యాసమున కనువాదము.]

దక్షిణహిందూస్థానమున సుప్రసిద్ధవీరశైవమతోద్ధారకు డగు శ్రీబసవేశ్వరుడు క్రీ॥ శ॥ 1131 ప్రాంతమున కర్ణాటకదేశమందలి బిజాపురముజిల్లాలో నున్న హింగుళేశ్వర భాగవాటి (Bagewadi) యను గ్రామమున జన్మించెను. బసవేశ్వరుని జీవితకాలము ముప్పదియారు సంవత్సరములు మాత్రమే యని చరిత్రవలనఁ దెలియుచున్నది. బసవనియొక్క చరిత్రను ఆయన వీరశైవమతమునకుఁ గావించిన సేవను తొలుదొలుత వర్ణించినకవులలో కన్నడమున హంపీక్షేత్ర వాస్తవ్యు డగు హరీశ్వరుడును ఆంధ్రమున పాలకురికి వాస్తవ్యు డగు పాలకురికి సోమనాథుడును ముఖ్యులు. ఇరువురుకవులును బసవేశ్వరునికి అత్యంతసమీపకాలమున జీవించినవారవుటచే నాతనిచరిత్రను దెలియుటకు వారికృతులు విశేషప్రామాణికము లనుటలో సందియము లేదు. హరీశ్వరుడు శివగణదరగళె అను పేరుతో కన్నడములో పలువురు పురాతన అద్యతన శివభక్తులచరిత్రములను రగళె యను దేశిచ్ఛందస్సులో రచించి రగళెకవి యని ప్రతీతిని బడసినవాడు. ఆయన బసవేశ్వరునిగూర్చి రచించినకృతి బసవదేవరాజర

గళె అను నామముగలది. అది మనదురదృష్టవశమున సంపూర్ణముగా లభ్యము కాలేదు. కొన్నిసంవత్సరములక్రిందట నది మైసూరులో నసమగ్రరూపమున బ్రకటింపబడినది. వినష్టమైన చివరిభాగము ఇంతవఱకెచ్చటను లభ్యము కానందున ప్రకటితమయియుండలేదు. హరీశ్వరునికృతినిబట్టి బసవేశ్వరుడు వృషభముఖనామాంకితు డగు శివలోకప్రమథుని అవతారమనియు నాతడు తనగురుడు నిష్టదైవము నగు కూడలి సంగమేశ్వరునియాజ్ఞానుసారము బిజ్జలరాజునొద్ద మంత్రిగా కొలువుకుదిరె ననియు తెలియుచున్నది. ఈ బిజ్జలుడు పశ్చిమచాళుక్యచక్రవర్తులక్రింద సామంతుడుగనో దండనాథుడుగనో యుండి తర్దవాడిసీమయందలి మంగళవాడ రాజధానిగా పరిపాలించెను. ఐతిహ్యమునుబట్టియు చరిత్రనుబట్టియు నీబిజ్జలుడు కొంతకాలమువిమ్మట తన ప్రభువు లగు పశ్చిమచాళుక్యచక్రవర్తులపై తిరుగబడి క్రీ॥ శ॥ 1161 ప్రాంతమున తైలపచక్రవర్తి నోడించి కళ్యాణనగరమున ప్రతిష్ఠితుడై పశ్చిమచాళుక్యరాజ్యమును పరిపాలించె నని తెలియుచున్నది. బసవేశ్వరుడు జన్మచేత కన్నడదేశస్థు డయినను అతనిచరిత్రము పురాణరూపమున మొట్టమొదటిసారిగా రచించినకీర్తి తెలంగాణాలోని వరంగలు సమీపమందలి పాలకురికివాస్తవ్యు డయిన తెలుగుకవి సోమనాథునకే దక్కినది. సోమనాథునిబసవపురాణము ఏడాశ్వాసముల ద్విపదకావ్యముగా రచింపబడినది. ఈకావ్యములో బస

వేశ్వరుని జీవితము, చరిత్రియు, ఇతరములగు ననేక పురా తనాద్యతనశివభక్తుల చరిత్రములలో అనుస్యూతముగ వర్ణిం బడినవి. కన్నడములో మొట్టమొదటిసారిగా క్రీ॥ శ॥ 1369 ప్రాంతమున రచిత మయిన భీమకవి కన్నడబసవపురాణము సోమనాథుని తెలుగుబసవపురాణము మాతృకగా గలిగి దానిని మిక్కిలిగా ననుసరించినది. తెలుగుకావ్యమున బస వేశ్వరుడు తొలుదొల్త బిజ్జలునొద్ద మంగళవాడలో మంత్రిగా పనిచేసినసంగతి చెప్పబడియుండలేదు. ఈగ్రంథ మునుబట్టి బసవేశ్వరుని మేనమామ యగు బలదేవుడు బిజ్జ లునిప్రధానమంత్రిగా కళ్యాణనగరమున నుండెననియు, ఆతని కుమార్తె గంగమాంబను బసవేశ్వరున కుద్వాహము గావిం చెననియు, పిమ్మట బలదేవుడు చనిపోగా నతనిస్థానమున బిజ్జలుడు బసవేశ్వరుని ప్రధానమంత్రిగా నియమించెననియు తెలియుచున్నది. హరీశ్వరుని కన్నడరగళెనుబట్టి బసవేశ్వరుడు మంగళవాడలో బిజ్జలునికొలువున బ్రవేశించునాటికి బిజ్జలు నొద్ద సిద్ధదండాధిపుడను నాతడు ప్రధానమంత్రిగా నుండెనని తెలియుచున్నది. హరీశ్వరునికృతిలో బసవేశ్వరుని కళ్యాణ పట్టణమందలి పరిపాలనగురించి చెప్పబడలేదు. బహుశః వినష్టమైన గ్రంథముచివరిభాగములో నీవిషయము చెప్ప బడియుండవచ్చును. సోమనాథుని తెలుగుకావ్యములో బస వేశ్వరుడు మంగళవాడలో బిజ్జలునొద్ద పనిచేసినసంగతి చెప్ప బడలేదు. ఈకారణములవలన బసవేశ్వరుడు తొలుత మంగళ

వాడయండే బిజ్జలునికొలువున ప్రవేశించి యచటనుండియే కన్నడదేశమున వీరశైవమతోద్ధారణకార్యక్రమము నిర్వహించుచు పిమ్మట బిజ్జలునితో కలిసి పశ్చిమచాళుక్యుల రాజధానియగు కళ్యాణమున కేతెంచె నని తలంపనగును. కళ్యాణమునందే ప్రఖ్యాతివహించిన అనుభవ మంటపాదికముల బసవేశ్వరుడు స్థాపించగా దేశములనలుమూలలనుండి వచ్చి శివభక్తగణము లామంటపమున సమావేశమై వీరశైవమతోద్ధారణకును తన్మతసర్వతోముఖవ్యాప్తికిని మిక్కిలిగా తోడ్పడిరి.

బసవ- కళ్యాణమని ఖ్యాతివహించిన ఈనగరము ఆంధ్రకర్ణాటదేశముల సరిహద్దున నెలకొనియుండిన కారణమునను కల్యాణమందలి బసవేశ్వరుని పరిపాలనాప్రభావము వలనను నించుమించుగ నేకకాలమునందే ఆంధ్రదేశమున సహితము వీరశైవమతము వ్యాప్తము కాజొచ్చెను. కళ్యాణమున బిజ్జలుడు పరిపాలించినది కొలదికాలము, అనగా (1162-116౭) ఆఱుసంవత్సరములుమాత్రమే యని మనకు చరిత్రవలన దెలియుచున్నది. బిజ్జలుని మరణానంతరము అతని కుమారులు రాయమురారి మున్నగువారు ద్వాదశాబ్దములు మాత్రమే పరిపాలించినట్లును ఆపిమ్మట వారు పశ్చిమ చాళుక్యవంశజు డగు ఆఱవసోమేశ్వరునివలన నోడింపబడి సింహాసనభ్రష్టులు గావింపబడి నట్లును కూడ దెలియు చున్నది. కావున బసవేశ్వరుడును నాతని యనుయాయులును

కళ్యాణమునం దించుమించుగ నాలు సం॥లు మాత్రమే వీర శైవమత వ్యాప్తికి పాటుపడిరనియు నీకార్యక్రమములో నత్యధికభాగ మంతకుముందు బసవేశ్వరుడు మంగళవాడలో బిజ్జలునిమంత్రిగా నున్నప్పుడే నిర్వహించెననియు తలంపనగును.

వీరశైవమతోద్ధరణమునకు బసవేశ్వరునితో పాటు పరిశ్రమించిన యూతనిసమకాలికప్రముఖులు ఆతని మేనల్లుడనగా నాగమాంబపుత్రుడయిన చెన్నబసవేశ్వరుడును అల్లమప్రభువునై యున్నారు. చెన్నబసవనిగురించి పదునేని మిదవశతాబ్దమున తెలుగున అత్తలూరి పాపయామాత్యుని చేతను కన్నడమున విరూపాక్షపండితుని చేతను రచింపబడిన ప్రత్యేకపురాణగ్రంథములే వెలసెను. అల్లమప్రభునిగురించి క్రీ॥ శ॥ 1440 ప్రాంతమున ప్రౌఢదేవరాయలు విజయనగరము పరిపాలించుచుండుటయందున చామరసుకవి కన్నడమున "ప్రభులింగలీల" యను ప్రత్యేకగ్రంథమును ఇరువదియైదు గతులుగా రచించెను. ఈ చామరసుగ్రంథమునే తెలుగులో ద్విపదకావ్యముగా పిడుపర్తి సోమనాథకవి క్రీ॥ శ॥ 1560 ప్రాంతమున అనువదించెను. ఇంచుమించుగ నాకాలముననే ఆ గ్రంథమును పిడుపర్తి సోమనాథుని పినతండ్రికుమారుడైన బసవప్పకవి పద్యకావ్యముగా రచించెను. బసవేశ్వరునికి వీరశైవమతోద్ధారణకార్యనిర్వాహణమందు అండగా నుండి ఆయనకు కుడిభుజములని చెప్పదగినవారిలో మడివాలు మాచయ్య కిన్నరబ్రహ్మయ్య అనువారు ముఖ్యులు. వారి

కథలుకూడ పైన పేర్కొన్నవిధమున పాలకురికి సోమనాథుని తెలుగుబసవపురాణమున జేర్చబడినవి.

ఆంధ్రదేశమున శైవ వీరశైవమతోద్ధారణకార్య క్రమము నిర్వర్తించిన బసవేశ్వరుని సమకాలికప్రముఖుడు శ్రీ మల్లికార్జునపండితారాధ్యుడు. అతడు సంస్కృతాంధ్ర భాషలలో గొప్పపండితుడు. అతడాంధ్రదేశమున తూర్పు గోదావరిజిల్లాలోని దక్షారామమందు జననమొందెను. బసవపురాణము రచించిన పాలకురికి సోమనాథుడే తదరిచ నానంతరము కొంతకాలమునకు తెలుగున పండితారాధ్య చరిత్రమును ద్విపదకావ్యముగా రచించి ఆకావ్యము బస వేశ్వరునకే యంకిత మొసంగెను. పండితారాధ్యుడు బస వేశ్వరునితో స్వయముగా సంభాషించుటకు బసవకళ్యాణము నకు బయలుదేరెననియు, మార్గమధ్యమున తాను పానగల్లు సమీపముననున్న వనిపురమందు విడిసియుండగా అంతకు పూర్వము ఎనిమిదిరోజులక్రితమే బిజ్జలుని రాజ్యమున కల్లోల మేర్పడి బసవేశ్వరుడు కూడలి సంగమేశ్వరునిలో నైక్యము గుటమూలముగా అవతారపరిసమాప్తి గావించెననియు కొందఱుజంగమములవలన దెలిసికొన్నవాడై మల్లికార్జున లింగములో తా నైక్యమగుటకుగాను తనప్రయాణమును శ్రీశైలమునకు మళ్ళించెనని పండితారాధ్యచరిత్రమువలన మనకు దెలియుచున్నవి.

ఈ కావ్యములేకాక సోమనాథుడు బసవేశ్వరుని

గుణించి పెక్కు లఘుకావ్యములు కూడ రచించెను. బసవేశ్వరుని వచనములవలెనే సోమనాథుని లఘుకృతులును అసంఖ్యాకములుగా రచింపబడినవి. ఆ వచనములవలెనే ఇవియును నత్యధికభాగము వినష్టమై కొలదికృతులుమాత్రమే నేడు మనకు లభ్యమగుచున్నవి. వానిలో ముఖ్యమైనవి "బసవా బసవా వృషాధిపా!" యను మకుటముతో చంపకోత్పలమాలా వృత్తములతో కూర్పబడిన వృషాధిపశతకమును, "బసవలింగ" యను మకుటముతో నలరారు చతుర్వేదసార మను సీసపద్యగ్రంథమును నై యున్నవి. సోమనాథుడు తన పండితారాధ్యచరిత్ర అవతారికలో భక్తగణములు తన్నీవిధముగా పొగడినట్లు వ్రాసికొనియున్నాడు.

"బసవన్నమహిమ సంబంధభక్తియుక్తి
బసరించితివి గద్యపద్యాదికృతుల
అర్ణవావృతధాత్రియందు దొప్ప బసవ
వర్ణనల్ సేసితి వరుసన నీవు
లారంగ ... ... ..."

సోమరాజను కన్నడకవి తన "శృంగారసార" మను నద్భుటచరితావతారికలో సోమనాథు నీక్రిందివిధమున ప్రశంసించెను.

"సముదంచత్ వృషభస్తవామర మహీజారామనం సోమనం."

క్రీ॥ శ॥ 1560 ప్రాంతమున వెలసిన పాలకురికి సోమ

నాథుని శిష్యప్రశిష్యుఁడయిన పిడుపర్తి సోమనాథకవి, పాల
కురికి సోమనాథుని ద్విపదబసవపురాణమునే పద్యకావ్యముగా
విరచించి తన గ్రంథావతారికలో నందీశ్వరుని వీరశైవ
మతోద్ధరణమునకయి భూమిపై బసవేశ్వరునిగా నవతరింపఁ
బంపిన పరమశివుడే మఱియొక ప్రమథుఁడైన భృంగీశ్వరుని
బసవేశ్వరుని చరిత్రాదికముల రచనకై పాలకురికి సోమనాథు
నిగా పృథ్విపై నవతరింపఁజేసె నని వ్రాసియున్నాఁడు.
పిడుపర్తి సోమనాథకవియేకాక విజయవాడవాస్తవ్యుఁ డగు
మఱియొక ఆంధ్రకవి, మహాదేవారాధ్యుఁడుగూడ పాలకురికి
సోమనాథుని ద్విపదబసవపురాణమును బద్యకావ్యముగా విర
చించి విజయవాడయందు వెలసినమల్లికార్జునశివలింగమునకుఁ
దాని నంకితము జేసెను. ఈగ్రంథమునందలి పెక్కుభాగ
ములు శిథిలములగుటచే నది యింతవఱకు ముద్రణభాగ్యము
నోచుకొనదయ్యెను. పిడుపర్తి సోమనాథుని పద్యబసవపురా
ణముమాత్రము పూర్తిగా ముద్రింపబడి ప్రకటితమయ్యెను.
అది పాలకురికి సోమనాథుని ద్విపదకావ్యమునకు సంపూర్ణాను
సరణ మని చెప్పవచ్చును. మఱియు పాలకురికి సోమనాథుని
ద్విపదపండితారాధ్యచరిత్రమును క్రీ॥ శ॥ 1400 ప్రాంతమున
శ్రీనాథమహాకవి యాద్విపదలే తఱచు నిలిపి తెలుగున
పద్యకావ్యముగా విరచించెను గాని దురాంధ్రులదురదృష్టవశ
మున నాగ్రంథ మలభ్యమై యింతవఱ కెచ్చటను బ్రక
టితము కాలేదు.

కొన్నిశతాబ్దములయనంతరము క్రీ॥ శ॥ 1750 ప్రాంతమున కుమ్మరపల్లి నాగభూషణకవి యనునతడు బసవ విజయమను పేర నొక పద్యకావ్యము రచించెను. అది మూడాశ్వాసముల గ్రంథము. ఆకవి కాకతీయచక్రవర్తి యగు రెండవ ప్రతాపరుద్రునికి శివదేవమంత్రి చెప్పినవిధమున బసవచరిత్రను తనపద్యకావ్యమున ననుసంధించితి నని వ్రాసికొన్నాడు. ఈకృతి కించుకముందుగనో తరువాతనో అదేపేరున బసవవిజయ మను మఱియొక కావ్యమును తెలుగుద్విపదలో నల్లనగొండ నాగనారాధ్యు డనుకవి రచించెను.

పైనిపేర్కొనన్న పద్యకృతులేకాక, బసవేశ్వరుని జీవితమునుగూర్చి కతిపయకృతులు యక్షగానములరూపములలో తెలుగుకవులచే కూర్పబడినవి కలవు. యక్షగానములో ఈక్రింద నుదాహరించిన రెండుకృతులును ముఖ్యమైనవి.

(1) అనుమోద సన్న్యాసికవివిరచిత బసవకల్యాణము: ఈ గ్రంథనామమునుబట్టి యిందలియితివృత్తము బసవేశ్వరునికి గంగాంబ నీలాంబికలతో జరగిన వివాహములకు సంబంధించిన దని తెలియనగును.

(2) కానూరి వరవీరభద్రకవివిరచిత బసవమహిమామృతవిలాసము : ఈ గ్రంథమును కవి తెలంగాణాయందలి కొలనుపాక సోమేశ్వరశివలింగమున కంకితముగా రచించెను. అందు బసవేశ్వరుని జీవితచరిత్రయందలి పలువిధఘట్టములు వర్ణితములైనవి. గతశతాబ్దమున కొందఱు ఆధునికవీరశైవ

కవులు బసవేశ్వరస్తోత్రరూపకములైన శతకములు కొన్ని రచించిరి. అందులో సీసపద్యములలో కూర్చబడిన పూత్కోట సోమనారాధ్యకవికృత బసవలింగశతకము ముఖ్యమైన దిగా పేర్కొననగును. పాలకురికి సోమనాథుని వృషాధిపశతకము ననుసరించి తూర్పుగోదావరిజిల్లా ఆలమూరువాస్తవ్యుడును విశ్వబ్రాహ్మణకులజుడును నగు పెనుమెచ్చ మహాదేవకవి కొలదిసంవత్సరములక్రిందట నదేపేరుతో నొకశతకమును రచించి ప్రకటించెను. అంతేగాతడు పాలకురికి సోమనాథకవి పాటించిన "బసవా బసవా బసవా వృషాధిపా!" యనుమకుటమునే పాటించెను. నరసన్నపేట వాస్తవ్యులు కట్టి భీమలింగకవి యను విశ్వబ్రాహ్మణకులజుడు బసవకళ్యాణమను పేర నేకాశ్వాసప్రబంధమును కూడ రచించెను.

ఈవ్యాసమును ముగించుటకుపూర్వము బసవేశ్వరుని మహిమాదికములను మొదటినుండియే తెలుగుకవులు గుర్తించి రనియు బసవస్తోత్రపరముగా అనేక పద్యకృతులను వెలయించిరనియు నేను వినయపూర్వకముగా మనవిచేయుచున్నాను. పైనిజెప్పినవిధమున పాలకురికి సోమనాథుని ద్విపదబసవపురాణమును దానికి పుత్రిక యనదగు నాతని ప్రశిష్యుడు పిడుపర్తి సోమనాథుడు కూర్చిన పద్యబసవపురాణమును బసవేశ్వరునిగూర్చిన ఆంధ్రవాఙ్మయవిహాయసమున నుజ్జ్వలతారలై ప్రకాశించుచు అజరామరవిఖ్యాతి నార్జించి విరాజిల్లుచున్నవి.

## మాయావిలాసము - ప్రభులింగలీల

మాయనుమాయలం బెట్టి, గొగ్గయనుసన్మానించి, ముక్తాయికిన్ శ్రేయఃప్రాప్తి నొసంగి, రామయ కృపన్ జేపట్టి నిష్కర్మచర్యాయుక్తిం బసవేశ్వరాదులను లింగైక్యానుసంధానులంగా యోజించిన యల్లమప్రభుని వేడ్కంగొల్తు నశ్రాంతమున్.

భారతి భాద్రపదమాస సంచికలో బ్రహ్మశ్రీ విద్వాన్ కట్టి సాంబమూర్తి శాస్త్రిగారు, గంజాముజిల్లా పర్లాకిమిడి తాలూకా, తులగాము గ్రామవాస్తవ్యుఁడగు తులగాన నీలకంఠకవి రచించిన "మాయావిలాసము" అను నముద్రిత గ్రంథమును గూర్చి వ్యాసము వ్రాయుచు నందలి యితివృత్తమును గుఱించి యిట్లు లిఖించిరి:—

"మాయావిలాసము నాలుగాశ్వాసముల శృంగార ప్రబంధము. కథ శైవపురాణములలోని యల్లముఁడను శివభక్తుని జితేంద్రియత్వమును, మహిమను వర్ణించునది. కథానాయకుఁడు మాత్రమే ప్రసిద్ధుఁడు కాని మిగిలిన పాత్రములన్నియుఁ గవికల్పితములే."

శాస్త్రిగారు కథానాయకుని ప్రసిద్ధి నాతనినామమునుబట్టి వినుటయేకాని దానిని వెలయించు సుప్రసిద్ధ గ్రంథమును విలకించినట్లు కానరాదు. అల్లమునిలీలలను వర్ణించు ప్రఖ్యాతాంధ్రగ్రంథము ప్రభులింగలీల. అదియే నీలకంఠకవి రచించిన మాయావిలాసమునకు మూలము. అందలి కథైక

దేశమును మాత్రము గయికొని యూతఁ డీప్రబంధమును రచించినట్లు తోఁచుచున్నది. ఇందలిపాత్రములు శాస్త్రిగారు సెలవిచ్చినట్లు కవికల్పితములు గావు. అన్నియు మూలగ్రంథములోనివే. మూలకథ నెట్టిమార్పును లేకయే కవి యనువదించినాఁడు. వర్ణనావిశేషములు మాత్రమే కవిప్రజ్ఞావిలసితములు. శాస్త్రిగారి హెచ్చరికననుసరించి గ్రంథము నెవరైన ముద్రించెడిచో వారి కుపకరించుటకయి మూలగ్రంథమగు ప్రభులింగలీల చరిత్ర మించుక వివరించుచునాఁడ.

ఆంధ్రభాషయందున్న ప్రభులింగలీలలు రెండు. ఒకటి పిడుపర్తి బసవకవిపుత్రుఁడు సోమనాథకవి రచించిన ద్విపదకావ్యము. రెండవది సోమనాథుని తమ్ముఁడు పాలనార్యుని కుమారుఁడు పిడుపర్తి బసవప్పరచించిన వైదాశ్వాసముల పద్యకావ్యము.*

గ్రంథమందు వర్ణింపఁబడిన యల్లమప్రభువు క్రీ. శ. 1160 ప్రాంతమున బసవేశ్వరుని కాలమున వెలసిన యొక నిర్వికార నిర్గుణమూర్తి. కన్నడములో "అల్ల" "ఇల్ల" యను

---

* ఇందులో మొదటిదియే మొదట వెలసినది. అది 1918 సంవత్సరములో శ్రీముదిగొండ శంకరారాధ్యుల వారిచే వరంగలులో ముద్రింపఁబడి ప్రకటింపఁబడినది. రెండవది యంశకుముందే 1901 సంవత్సరములోఁ దప్పులతడికగాఁ జెన్నపురిలో వంకాయల కృష్ణస్వామి సెట్టిగారిచేఁ బ్రకటింపఁబడినది. ఈరెండును గూడ మరలఁ బరిశుద్ధముగఁ బునర్ముద్రణము నందినట్లుగానరాదు.

నని శూన్యార్థవాచకములు. అరబ్బీ భాషయందలి "అల్లా" శబ్దముగూడ నిట్టిదే.

అల్లమప్రభునకు మాయాకోలాహలుఁ డనుబిరుదము న్నది. కన్నడములో నీతఁడు రచించినట్లుగా శూన్యసంపాదనము, మంత్రమాహాత్మ్యము, షట్‌స్థలవచనములు, మంత్రగోప్యపదములు, సృష్టివచనములు, బెడగిన వచనములు, కాలజ్ఞాన వచనములు, ప్రభుదేవరకంఠములు మున్నగు కృతులు గానవచ్చుచున్నవని కర్ణాటకకవిచరిత్ర నుడువుచున్నది.

పిడుపర్తి సోమనాథకవి తానురచించిన ప్రభులింగలీలకు మూలము కన్నడములో చామరసు అను కవీంద్రుఁడు రచించిన గ్రంథమని తన కావ్యాంతమున నిట్లువివరించి నాఁడు:—

"సదమలపదవేది చామరసాది
పదములు వెలినాట పలునోకొండింటఁ
బ్రభులింగలీల యిర్వదియైదు గతుల
నభినవంబుగఁ జెప్పె నది తెనుంగునను
పిడుపర్తిసోమనాభిధుఁడఁ జెప్పితిని
పుడమిభక్తుల కర్థము లేటపడఁగ."

కన్నడ ప్రభులింగలీలకర్తయగు చామరసు క్రీ. శ. 1460 ప్రాంతమువాఁడని Rev. Kittel దొరగారు తమ

కర్ణాటనిఘంటువునందు లిఖించిరి. పిడుపర్తి సోమనాథకవి క్రీ. శ. 1520 ప్రాంతమువాఁడని నా యభిప్రాయము.

ప్రభులింగలీల శివానుభవజ్ఞులకు నమృతప్రాయమైనది. వేదాంతగ్రంథములలో దీనిని మించినది లేదని పలువురు తత్వజ్ఞుల యభిప్రాయము. పిడుపర్తి సోమనాథకవి గ్రంథావతారికలోని యీక్రిందియుక్తుల వలన గ్రంథప్రాశస్త్యము చదువరుల కించుక గోచరము కాఁగలదు:—

"ప్రభులింగలీలకుఁ బ్రతిఁ జెప్ప నరిది
యుభవుభక్తిస్థితి కది యాలవాల
మజ్ఞానతమమున కదియె దీపంబు
విజ్ఞానమున కది విహరణసీమ
అది షట్‌స్థలజ్ఞప్తి కావాసభూమి
అది శివయోగ విద్యానిధానంబు
సదమలసౌభాగ్య సదనంబు నదియుఁ
జిదచిద్వివేకవిశేషంబు నదియు
* * *
మఱి యిదియొకకావ్యమాత్రంబు గాదు
వఱలెడు గురుగుహేశ్వర లింగమూర్తి
లీలావిహారంబు లెస్సగా భక్తు
లాలింపుఁ డింక మోక్షావాప్తి యగును
ప్రొద్దుపోకకు విని పోవెడువట్టి
సుద్దులు గావు విశుద్ధులైవిన్నఁ

దనుమనోధనముల తగు లూడ్చి శివుని
నెనయు మహోపాయ మిది యని వినుఁడు
అన్నదమ్ములును బోట్లాడిన సుద్దు
లెన్నెదుకథలు గా వింతులతోడి
విషయభోగంబుల వెతల వర్ణించు
విషమకావ్యము గాదు వివరించి చూడఁ
గడుపుకక్కుర్తికిఁ గర్మకాండంబు
తడయక పెట్టుతంత్రంబును గాదు
రణ మిందు నంతఃకరణములతోడ
ఫణికన్యతోడి సంబంధంబు సురతి
మలగిదాకాశ మయత్నంబు తృప్తి
విలసిల్లు నీకృతి వేడ్కతో వినుఁడు
సచ్చరిత్రుల సుప్రసంగంబు గాని
నిచ్చనిచ్చలు జన్మనీరధిఁగూడి
పొరలుచు దరిఁ జేరఁబోలేని హీన
నరకీటకముల వర్ణన మిది గాదు
కర్మాంధకార సంగతిఁ జిక్కి శైవ
ధర్మం బెఱుఁగక తమ యిచ్చ నడచు
దుర్మదాంధులఁ జెప్పు దుష్కథ గాదు
నిర్మలశివభక్తి నిశ్శేణి మఱియు
భుక్తిముక్తుల నిచ్చు పుణ్యపణ్యంబు
భక్తు లాలింపుఁ డీ ప్రభులింగలీల."

ఈ గ్రంథమందలి భాగములకు గతులని పేరు. మూల గ్రంథమగు కన్నడకావ్యమును సోమనాథుని ద్విపద కృతియుఁ గూడ నిరువదియైదు గతులుగా రచింపఁబడినది. వాని నామముల నిట నుదాహరించెదను. అందువలన నాయా గతులయందలి విషయములను స్థూలముగా నెఱుంగ నగును. 1. స్తుతి, 2. కైలాసవర్ణనము, 3. మాయపుట్టుక, 4. ప్రభువు విషవేషమునవచ్చుట, 5. మాయ నాడించుట, 6. విమల వచ్చుట, 7. ప్రభు వదృశ్య మగుట, 8. మాయ పార్వతి యొద్దకుఁ బోవుట, 9. ప్రమథులు వచ్చుట 10. అక్కమదేవి కథ, 11, గొగ్గయ్యకథ, 12. ముక్తాయికథ, 13. సిద్ధరామయ్యకథ, 14. ప్రభువు కళ్యాణపట్టణమునకు వచ్చుట, 15. మరుళశంకరునికథ. 16. ఇష్టలింగగతి, 17. అక్కమహాదేవి గతి, 18 ప్రాణలింగగతి, 19. గోరక్షుని గతి, 20. మునుల గతి, 21. శూన్యసింహాసనగతి, 22. ప్రభువుశూన్యసింహాసనం బెక్కుట, 23. ఆరగింపు, 24. భావలింగగతి. 25. వీరశైవమహిమ. ఇందు మొదటి యెనిమిది గతులందలి కథను మాత్రము గయికొని నీలకంఠకవి తన "మాయావిలాసము"ను రచించినట్లు గానవగును. అల్లముని లోఁగొనలేక మాయ హతాశయై యవతారము చాలించి కైలాసమునకుఁ బోయిన తరువాత జరిగిన యల్లముని లీలలను నీలకంఠ కవి తన గ్రంథమున వర్ణింపలేదు. ఆతఁడు రచింపనెంచిన దొక్క మాయావిలాసమే కదా!

పార్వతియొక్క తామసికకళవలన మమకారుఁడను రాజునకు మోహినియను భార్యయందు మాయ జనించినట్లే యీశ్వరుని సాత్వికకళవలన నిరహంకారునకు సుజ్ఞాని యనెడు సుదతియందు అల్లముఁడు జనించెను. పెక్కుపాట్లఁ బడియు మాయ యతనిని నిర్జింపఁ జాలక వెడలిపోయిన కథ మాత్రమే "మాయావిలాసము"న నీలకంఠకవిచే వర్ణితమయి నది. తరువాతికథయే ప్రభులింగలీలలో ముఖ్యమయినది. పెక్కురు భక్తులకు వారి యజ్ఞానాహంకారములను బోనడంచి శివానుభవ రహస్యములను బోధించి యల్లముఁడు వారిని తరింపఁజేసిన విధము లవశ్యము గ్రహింపఁదగినవి. ఈ వ్యాసా రంభమున నున్నపద్యము వీరశైవ ప్రపంచమున పాడుక లోనున్న యల్లమప్రభుని చాటుస్తుతి. దానిలో నాతని ముఖ్య లీలలు సంగ్రహముగాఁ జేర్కొనఁబడినవి.

"కథానాయిక పుట్టినయూరగు బసవశీపురంబును మధు కేశ్వరావాసమగు ముఖలింగమును గని నివాసగ్రామమునకు దగ్గఱగానే యున్నవి" అని కూడ శ్రీసాంబమూర్తిశాస్త్రి గారు మాయావిలాసమందలి కథ కవికల్పితమే యను తమ యభిప్రాయమునకు సాధకముగాఁ గాఁబోలు వ్రాసినారు. కాని యాపురముయొక్క పేరుకూడ మూలగ్రంథములోని దే యని మనవి చేయుచున్నాఁడ. వంశధారా నదీతీరమున ముఖలింగక్షేత్ర మందలి శివుఁడు మధుకేశ్వర నామమునఁ బరగుట సుప్రఖ్యాతమే. కాని దొరతనమువారు ప్రకటించిన

"Alphabetical list of villages in the Districts and Taluks of the Madras Presidency" అను పుస్తకములో పర్లాకిమిడి తాలూకాలో బసవశియను గ్రామము నాకుఁ గానరాలేదు. అది ఏదయిన ప్రధానగ్రామమునకు శివారుగ్రామ మయి యుండదుగదా. ఇంతకు మూలగ్రంథ మగు కన్నడప్రభులింగలీలలోను, పిడుపర్తి సోమనాథుని ద్విపదకావ్యములోను గూడ నీబసవశిపురము మేరుపర్వతమునకు దక్షిణదిగ్భాగమునను న్న బెళ్ళువలిసీమలోనిదని చెప్పఁబడినది.

"హరుఁడు పెల్లుగఁ బంప నమరోరుగణములు
పరిణామవార్తలు పచరింపుచుండఁ
దగినశైలమునకు దక్షిణమందుఁ
దగుబెళ్ళువలిసీమ తనరారు నందు
* * *
ఆ దేశమధ్యంబు నందుఁ జందురుని
మేదురకళలెల్ల మిళితమై యుండు
సదనమో కాక విశ్వంభరారమణి
వదనమో యన బసవశి యనఁ బురము."

మూలగ్రంథకర్తయగు చామరసు కర్ణాటుఁడుగాన నీ బెళ్ళువలిసీమ, బసవశిపురము, మధుకేశ్వరాలయము నన్నియుఁ గూడఁ గర్ణాటదేశమండలివే యని నా యనుమానము. అల్లముఁడు సంచరించినదిగూడ శ్రీశైలప్రాంతముననేకదా. విజ్ఞులావిషయమును నిర్ణయింతురుగాక,

పాలకురికి సోమనాథుని ద్విపదబసవపురాణమునకు సంస్కృతభాషలోఁ బరివర్తన మేర్పడి వ్యాసప్రణీతమని లిఖింపఁబడినట్లు పిడుపర్తి సోమనాథుని ద్విపదప్రభులింగలీలకుఁగూడ నొక పరివర్తన మేర్పడి సూతుఁడు శౌనకాదిమునులకుఁ జెప్పినట్లు భవిష్యత్పురాణములో నిదిగాఁ బేర్కొనఁబడినది. దానిని షోలాపురవాస్తవ్యులును లింగాయతశ్రేష్ఠులు నగు కీ. శే. శ్రీ వారధి మల్లప్పగారి ద్రవ్యసాహాయ్యమున దేవనాగరలిపిలో మణూరు మఠాధ్యక్షులగు శ్రీమల్లికార్జునశాస్త్రిగారు ప్రకటించినారు. దానినిబట్టి తెనాలి వాస్తవ్యులు శ్రీ ములుగు చంద్రమౌళి శాస్త్రిగారొకవచన కావ్యమును సంగ్రహముగా రచించి 1932 సంవత్సరములోఁ బ్రకటించిరి. సంస్కృతబసవపురాణము స్కందాగస్త్యసంవాదరూపమున రచింపఁబడి శ్రీబాదరాయణమహర్షిప్రణీత మని యుద్ఘాటింపఁబడినను నందలి యంతస్సాక్ష్యమును బట్టి యాగ్రంథము ఏలూరునందలి కంటుకూరువారను నారాధ్య బ్రాహ్మణవంశ్యు లెవరో దానిని రచింపించియుందురని యేర్పడును. వివరములువలయువారు శ్రీవేటూరి ప్రభాకర శాస్త్రిగారి బసవపురాణపీఠికను గాని, యాసంస్కృతగ్రంథమును గాని చూడఁదగును. గ్రంథప్రాశస్త్యమునో, ప్రామాణ్యమునో యుద్దేశించి యాధునికరచనములయెడ నిట్టికల్పనలు గూర్పఁబడుట శోచనీయము. ఏగ్రంథమునకైనను ప్రాశస్త్య మందలివిషయాదులనుబట్టి యేర్పడును గాని మది

సంస్కృతభాషలో నున్నంతమాత్రమునఁ గాని, పూర్వుల పేరఁ బ్రకటితమయినంతమాత్రమునఁ గాని కలుగనేరదు.

"పురాణమిత్యేవ న సాధు సర్వమ్,
న చాపి కావ్యం నవమిత్యవద్యమ్"

అను శ్రీ కాళిదాససూక్తి యెంతయు సత్యసమ్మతము. ఈ క్రింది సంగతులవలన భవిష్యత్పురాణాంతర్గత మని ప్రకటింపఁబడిన సంస్కృతప్రభులింగలీల, పిడుపర్తి సోమనాథుని యాంధ్ర ద్విపదకావ్యమునుబట్టి వెలసిన నవీనగ్రంథమని సువ్యక్తము కాఁగలదు. పిడుపర్తిసోమనాథుఁడు తన గ్రంథమును నెల్లూరు రామలింగయ్య యను వైశ్యశిఖామణి ప్రేరణమువలన నాతని దీక్షాగురుఁడగు సిద్ధవీరదేశికుని స్తుతిపూర్వకముగ రచించినాఁడు. గ్రంథావతారికను జూడఁదగును. మఱియుఁ బతి గతిమొదటనుగూడ నాతని పేర్కొనుచు వచ్చినాఁడు. మచ్చున క్రిందిపాదములు చిత్తగింపుఁడు:

"శ్రీసిద్ధవీరదేశిక చక్రవర్తి
భాసురపదపద్మ భజనాభిరతులు,
పరభవంబులఁ బాఱఁబట్టి చిత్తాది
కరణంబులకు శుద్ధి గావించి మీఁద
మరణబాధలఁ బాసి మమతలఁ గోసి
పరమపరానందభరితులై నిత్య
ముక్తిఁగోరెడువారు మోహవర్జితులు
భక్తు లాలింపుఁడీ ప్రభులింగలీల."

(2-వ గతి ప్రారంభము.)

ఈ సిద్ధవీర దేశికుఁ డెవరో తెలియదు కాని బోలుఁ బాపము సంస్కృత ప్రభులింగలీలకర్త కూడఁ దన గ్రంథా ధ్యాయముల మొదట నాతనిని పేర్కొనుచుఁ దనరహస్య మును బట్టబయలు చేసికొన్నాఁడు. మచ్చున కొకటిరెండు తావులు మాత్ర ముదాహరించెదను:—

"శ్రీసిద్ధవీర గురుపాద పయోజభక్త్యా
నిర్ధూత సంసృతిభయాః పరమానుభావాః,
శృణ్వంతు సర్వమునయ శ్శ్రుతిసౌఖ్యశీలాం
భక్తాః పదార్థవిమలాం ప్రభులింగలీలామ్."
"శ్రీసిద్ధవీర గురుపాద సరోజయుగ్మే
భక్త్యా వినిర్జిత మహార్జిత మోహపాశాః,
ముక్తీచ్ఛయా పరవిరక్తిపథం ప్రయాతాః
శృణ్వంతు సన్మునివరాః ప్రభులింగలీలామ్."

ప్రభులింగలీలాచరిత్రవిషయమున సత్య మందలియభి మానముచే నిట్లు వ్రాయవలసి వచ్చినందులకుఁ బెద్ద లాగ్ర హింపకుందురు గాక యని ప్రార్థించుచు నీవ్యాసమును ముగించుచున్నాను.

[పిడుపర్తి సోమనాథుని ప్రభులింగలీల (ద్విపదకావము) నా పరిష్కరణముతోను, విపులపీఠికతోను 1963వ సంవత్సర ములో కృష్ణాజిల్లా వల్లూరిపాలెంలో కొందఱు వీరశైవులచేఁ బ్రకటింపఁబడినది.]

# ఆచార్యపండితుఁడు

శ్లో॥ శ్రీవీరశైవహేతూనా, మాచార్యాణాం చతుర్థకం,
వందే శ్రీశైలపీఠేశం, నిత్య మాచార్యపండితమ్.

ఆంధ్రవాఙ్మయమునఁ గవిత్రయమువారెట్టివారో వీర శైవమత ప్రపంచమునఁ బండితత్రయ మట్టివారని నుడువుచు నా మిత్రులు శ్రీయుత నిడుదవోలు వేంకటరమణ, బి. ఏ. గారు అక్షయ (1926) సంవత్సరమున భారతిలో (సం. 3. సం. 3) శివలెంక మంచెనపండిత, శ్రీపతిపండిత, మల్లికార్జున పండిత, అను పండితత్రయమును గూర్చి యొక వ్యాసమును బ్రకటించి యున్నారు. ఆంధ్రదేశమందలి యారాధ్యబ్రాహ్మణులలోఁ దా మీ పండితత్రయముయొక్క కూటస్థులమని చెప్పుకొనువారు కొందఱు కలరు. పై మువ్వురలోను గడపటివాఁడగు మల్లికార్జునపండితుఁడే తనకుఁ బూర్వులైన తక్కిన యిరువురికంటె లోకమున కెక్కుడుగాఁ బరిచితుఁడయినాఁడు. ఇందుకుఁ గారణము పాండిత్యాతిశయమునఁ గాని భక్తిమహిమోన్నతినిగాని యాతఁడు వారికంటె నెక్కుడగుటగాక పాలకురికి సోమనాథకవీశ్వరుఁ డాతని చరిత్రమును ప్రత్యేక గ్రంథరూపమున లోకమున కొసంగుటయే యని గ్రహింపఁదగియున్నది. మంచెన శ్రీపతిపండితు లీమాత్రమయిన లోకమున కెఱుకపడుటగూడ సోమనాథుని మూలముననేయని తలంచుట సత్యదూరముకానేరదు. సంగ్రహముగనైన వారి చరిత్రములను సోమనాథుఁడు బసవపురాణమున

నుగ్గడించియుండుటచేఁ గాని లేకున్న నా మహనీయు లీవ ఱకుఁ బూర్తిగ విస్మృతులై యుందురేమో ! శ్రీకరభాష్య కర్తృత్వముగూడ శ్రీపతిపండితుఁడు సుప్రసిద్ధుఁ డవుటకుఁ గొంత కారణమైనది. అహో ! కవికృత్యమున కెంత మహ త్తర ప్రభావమున్నది ! కావుననే కల్యాణపండితుఁ డిట్లు వచిం చినాఁడు.

శ్లో॥ భుజతరుపనచ్ఛాయాం యేషాం నిషేవ్య మహౌజసాం
జలధిరశనా, మేది న్యాసీ తపావకుతోభయా
స్మృతిమపి న తే యాంతి క్ష్మాపా వినా యదనుగ్రహం
ప్రకృతిమహతే కుర్మస్తస్మై నమః కవికర్మణే॥

శ్లో॥ యేఽప్యాసనిష్టభకుంభశాయితపదా యేఽప్రిశియం లేభిరే
యేషామప్యవసన్ప్రరాయువత యో గేహేష్వహశ్చంద్రికా
తాన్ లోకోఽయమవైతిలోకతిలకాన్ స్వప్నేఽప్యజాతానివ
భ్రాతస్సత్కవికృత్యః! కింస్తుతిశతైరంధం జగత్త్వాంవినా॥

వీరశైవ మతమునకు మూలకారణులగు పంచాచార్యు లలోఁ జేరిన యాచార్య పండితునివిషయమై యీ పండిత త్రియములను గూర్చి తెలిసినంతమైన నాంధ్రిలోక మెఱుఁగ కుండుట శోచనీయము. పోనిం డాతనిఁ దెలియనేరక పూర్తిగ విస్మరించినను బాగుండెడిదే. వీరశైవులు శుభాశుభ కర్మ ములలో స్మరించి పూజించు పంచాచార్యులలోఁ బేరొకనఁ బడు నామహనీయుఁడు మల్లికార్జున పండితుఁడే యని వని

చుసాహసమునకుఁగూడ లోకము పాల్పడుట యాశ్చర్యము గొల్పకమానదు. వీరశైవము బసవేశ్వరాద్యుత్పజ్ఞమేయనియు నది బసవేశ్వరుని కాలముననే దేశమున నెలకొనెననియు వీరశైవులుపూజించు పంచాచార్యులు బసవేశ్వర సమకాలికులే యనియు నందలి పండితారాధ్యుఁడు మల్లికార్జున పండితుఁడే యనియు వ్రాయుట కాంధ్రవిద్వాంసు లెంతమాత్రము వెను దీయకున్నారు.

నామిత్రులు శ్రీయుత భావరాజు వేంకటకృష్ణరావు M. A. B. L. గారు ప్రబుద్ధాంధ్ర రక్తాక్షి (1924) మార్గశీర్ష సంచికలో (సం. 3 సం. 10) వీరశైవమునుగూర్చి వ్యాసమును వ్రాయుచు, క్రీ॥ శ॥ 7, 8, శతాబ్దులలో నాయనారులను శివయోగీంద్రులచే ద్రవిడ దేశమునఁ బ్రతిపాదింపఁబడిన దాక్షిణాత్య శైవమే యాపిమ్మట వెలసిన కాలాముఖశైవముతోఁగలసి క్రమపరిణామమును జెంది బసవేశ్వరాదుల కాలమున నాంధ్ర కర్ణాటక దేశములందు వీరశైవముగా మాఱె నదని లిఖించిరి, ఈ వ్యాసమందలి—

"నిజముఁ బరికింప బసవేశ్వరుఁడు నూతనమతమును స్థాపించెననుటకు వీలులేదు. ఆతఁడు తనకుఁ బూర్వమున్న శైవమును సంస్కరించి, వీరశైవమతమును స్థాపించెను. ఆతని మతావలంబకులైన వీరశైవులనఁబడు లింగాయతులు పంచారాధ్యులను శివయోగీంద్రులను దమ మతమునకు మూలగురువులుగాఁ బరిగణింతురు. ఈ పంచారాధ్యులు

శివుని పంచముఖములనుండి యావిర్భవించినవారనియు వారి వలన జీవుఁడు శివదీక్షను బడయుచున్నాఁడనియు విశ్వసించు చున్నారు. రేవణసిద్ధుఁడు, మరుళసిద్ధుఁడు, ఏకోరామారాధ్యుఁడు, పండితారాధ్యుఁడు, విశ్వారాధ్యుఁడు అను నీపంచారాధ్యుల పవిత్రనామములను ప్రతిజంగమగురువును, శిష్యునికి శివదీక్ష యొసంగి లింగధారణము సేయునపుడు ఆహ్వానము చేయును. వీరి నామములు ప్రతిజంగముని యింటను సర్వదా వినఁబడుచుండును. అందు పండితారాధ్యుఁడు ఆంధ్రుల కత్యంతచిరపరిచితుఁడు. శివదీక్షాదానసమయమున నైదు పంచపాత్రలను దెచ్చి నాలుగుదిక్కులందును నడుమ నొకదానిని ఉంచి, పంచారాధ్యులక్రింద వానిని పూజింతురు. కొన్నిజంగమభిక్షామఠములందు గురువులు తాము పంచారాధ్యుల సంతతివారమని చెప్పకొనుటయుఁ గలదు. ఈ ఆరాధ్యు లెవ్వరో వారి చరిత్రమెద్దియో వివరముగాఁ దెలియు భాగ్యమింకను మనకుఁ బట్టియుండలేదు. కన్నడభాషయందు చెన్నబసవ కవిచే రచింపఁబడిన "రేవణసాంగత్యము" అను కావ్యమునందు రేవణుఁడు లేక రేణుకుఁడు అను నారాధ్యుఁడు 'కొలనుపాక' యను గ్రామమున జననమొందెననియు నేడుశతాబ్దములు జీవించెననియుఁ దెలుపఁబడియున్నది. మఱియు నీరేవణుఁడు అగస్త్యమహర్షికి అష్టవిధయోగమును లింగార్చనరహస్యమును బోధించెనఁట. రావణుని సోదరుఁడగు విభీషణునిచే నాలుగుకోట్ల లింగముల

ప్రతిష్ఠ చేయించెనఁట. ఆతఁడు దిగంబర వేషధారియై జనుల కసహ్యము కలిగించి యుండినను తనదివ్యమహిమప్రభావములచేత లోకముచే మహనీయుఁడని కీర్తింపఁబడియెను. మహారాజులనేకులాతని దివ్యమహిమఁ గొనియాడుచు తమ తనయల నిచ్చి పరిణయము గావించి యుండిరఁట. ఒకప్పు డీతఁడు కళ్యాణపురాధీశుఁడైన బిజ్జలనృపాలునికడ కేఁగి యాతఁ డొకానొక సిద్ధికై పండ్రెండువేల కన్యల బలి గొనుచుండుటఁ జూచి యాప్రయత్నమునుండి వారించి శివదీక్షనొసంగి యాతని కొమార్తెను పెండ్లియాడెనఁట. పిమ్మట నానగరమున తన భార్యలతోఁ గూడి పారయు గద్దలియు జతఁబూని విశాలమైన తటాకమును నిర్మించెనఁట. ఇతనికి రుద్రముని యని యొకకొడుకు గలఁడు. కళ్యాణనగరమున తటాకనిర్మాణము ముగిసిన పిదప, రేవణుఁడు స్వగ్రామమగు కొల్లిపాక కేఁగి యచ్చట సోమేశ్వరలింగమున నంతర్ధానము య్యెనఁట. పైని జెప్పిన కథ నిజానిజము లెట్లుండినను, కళ్యాణ బిజ్జలుని సమకాలికుఁడని మాత్రము వానివలనఁ దెలియుచున్నది. మఱియు రేవణుఁడు మొదలుగాఁ గల శివయోగులు బసవేశ్వరునిపూర్వులనియు వారల బోధలు చాల భాగము వీరశైవ వ్యాప్తికి మార్గములయ్యెననియుఁ దెలియుచున్నది. మిగిలిన యారాధ్యులచరిత్రము దెలియరాదుగాని పండితారాధ్యునిచరిత్రము ఆంధ్రులకుఁ దెలిసికొన నవకాశములున్నవి. శ్రీనాథుని పండితారాధ్యచరిత్రము నశించినను

ఆతని చారిత్రము దెలుపు ప్రబంధము ఒకటి గలదు. అయ్యా దియును లభింపమిచే నిప్పుడు వారి చరితము నిటవివరింపలే మైతిమి."

అను శ్రీ కృష్ణరావుగారి వాక్యములు బసవేశ్వరుఁడు వీరశైవ మతస్థాపకుఁడనియు, పంచాచార్యు లాతని సమకాలి కులే యనియు, నందలి పండితారాధ్యుఁ డాంధ్రులకుఁ బరిచి తుఁడైన మల్లికార్జునపండితుఁడే యనియు వారిసిద్ధాంతమై నట్లు వ్యక్తమొనర్చుచున్నవి. అర్వాచీనుఁడగు కన్నడకవి 'రేవణసాంగత్య' మను గ్రంథమునుండి యుదాహృతమై పర స్పర వైరుద్ధ్యములతోఁ గూడిన రేవణాచార్యుని (రేణుకుని) గూర్చిన పై కథకుఁ జారిత్రికదృష్టియం దేపాటి ప్రామాణ్య ముండఁగలదో విజ్ఞులకు వేఱ చెప్పనక్కఱ లేదు. ఒకచో నగ స్త్యునకు, మఱొకచో విభీషణునకు సమకాలీనుఁడుగాఁ జెప్పఁ బడిన యీ రేణుకాచార్యుఁడు (రేవణుఁడు) బసవేశ్వరుని కాశ్రియుఁడై క్రీ. శ. ౧౧౬౭ ప్రాంతమున రాజ్యమేలిన కళ్యాణబిజ్జలుని కొమరితను బరిణయమయ్యెననెడి యసంగత కథనుబట్టి శ్రీకృష్ణరావుగారివంటి విమర్శకాగ్రణు లాతనిని బిజ్జల సమకాలికునిగాఁ దలంచుటయు మరల నా వెంటనే స్వవచనవ్యాఘాతముగ "రేవణుఁడు మొదలుగాఁగల శివ యోగులు బసవేశునకు పూర్వులని తెలియుచున్నది" అని వ్రాయుటయునూ మాత్ర మాశ్చర్యజనకము కాకపోదు. ఇఁకఁ బండితారాధ్యునిఁగూర్చి వీరు వ్రాసిన వ్రాతలను గూర్చఁ

జిత్తగింపుఁడు. శ్రీనాథుని పండితారాధ్యచరిత్ర మింత వఱకు లోకమునకే దొరకలేదు. దొరకిన దాని మూలగ్రంథము పాలకురికి సోమనాథుని ద్విపదపండితారాధ్యచరిత్రయే యైనను వీరికి లభింపలేదఁట. దానిని వీరు చదువలేదనుట స్పష్టమే కదా! కాని యా చరిత్రమందు వర్ణితుఁడైన మల్లికార్జునపండితుఁడే పంచాచార్యులలోని వాఁడని తెలుపుటకు మాత్రము తలంకరైరి. తరువాతనైన వీరా గ్రంథమును జదివి మల్లికార్జునపండితుని యథార్థచరిత్రమును గ్రహించి యుందురని విశ్వసించుచున్నాను.

ఆంధ్రగ్రంథమాలలో శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారిచేఁ బ్రకటింపఁబడిన పాలకురికి సోమనాథుని ద్విపద బసవపురాణమునకు విపులమైన పీఠిక వ్రాయుచు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు బసవేశ్వరునకుఁ బూర్వమున్న శైవమతభేదములఁ గూర్చి యించుక చర్చించి వీరశైవము బసవేశ్వరోపజ్ఞమే యనియు, బసవేశ్వరునకుఁ బూర్వ మీ మతము లేదనియు, మల్లికార్జున పండితుఁడు లింగధారణములేని పాశుపత మత ప్రవర్తకుఁడు గాని వీరశైవుఁడు కాఁడనియు, పైని జెప్పిన పండితత్రయములోని తక్కిరువురుఁ గూడ వీరశైవులు గారనియు, తెలుఁగునాటి యారాధ్యులు పూర్వులు లింగధారులనుటకుఁ గాని కృష్ణరాయలకుఁ బూర్వము బ్రాహ్మణులలో లింగధారణ మండెననుటకుఁ గాని యాధారములు గానరావనియు నిత్యాదిగా

వ్రాసియున్నారు. శ్రీ శాస్త్రిగారి బసవపురాణ పీఠిక విపుల పరిశోధన ద్యోతకముగ నున్నను, గొన్ని విషయములలో నది భ్రమ ప్రమాదసంకలితమై ప్రమాణదూర మగుచున్నది. ఈ పీఠిక యారాధ్య బ్రాహ్మణులలోను వీరశైవులలోను గూడఁ జాలసంచలనము గలిగించినది. శాస్త్రిగారి పరమ మిత్రులును మహోపాధ్యాయ బిరుదాంచితులును నగు శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారు తమ శైవరహస్య బోధిని పత్రికలోఁ బ్రశ్నోత్తరరూపకముగ నీ పీఠికపై విమ ర్శన మొకటి ప్రకటించిరి. (విభవ సంవత్సర చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ సంచికలు) అందులో వారు లింగధారణము తాంత్రి కముగాక వైదికమేయనియు, వీరశైవము బసవేశ్వరాద్యు పజ్ఞముగాక చాల ప్రాచీనమనియు, పండితత్రయమేగాక తదితరులు తెలుఁగునాటి యారాధ్యుల పూర్వులందఱుఁగూడ లింగధారులే యనియు నిరూపించుచుఁ జాలవిషయములు చర్చించిరి. అందుకు ఆంధ్రవీరశైవలోకము వారి కెంతయుఁ గృతజ్ఞతఁ జూపఁగలదు. శ్రీ నాగలింగశాస్త్రిగా రిట్లు కొంత వఱకు విమర్శనము సాగించిరి. కావున వారు విడిచినవిషయ ములఁగూర్చియు, బసవపురాణ పీఠికయందలి మఱికొన్ని చారిత్రక, మతవిషయిక, భాషావిషయిక ప్రమాదముల గుఱించియు నాకుఁ దోఁచిన యభిప్రాయములుగూడ లోక మునకుఁ దెలియఁజేయు తలంపుతోఁ గొన్ని ప్రత్యేక వ్యాస ముల వ్రాయనెంచి యింతవఱకు "పాలకురికి సోమనాథకవి

కులగోత్రప్రశంస" "సోమనాథస్తవము" "పిసుపర్తికవులు" "పాలకురికి సోమనాథకవి కావ్యవిశేషములు" అను వ్యాసములఁ బ్రకటించియుంటిని. ఇప్పు డీ వ్యాసమును బ్రకటించి ముందు "తెలుఁగునాటి యారాధ్యులు" "వీరశైవమత ప్రాచీనత" మున్నగు మఱి యెంకు రెండు వ్యాసములు ప్రకటింప నెంచితిని. శ్రీ ప్రభాకరశాస్త్రిగారును లోకమును గూడ వానిని సుహృద్భావముతోఁ దిలకించి సత్యనిర్ధారణ మొనర్తురుగాక యని సవినయముగఁ బ్రార్థించెదను.

సైనిబేర్కొన్న శ్రీ భావరాజు వేంకటకృష్ణరావు గారికిఁగూడ వీరశైవమతమునుగూర్చిన శ్రీ ప్రభాకరశాస్త్రి గారి సిద్ధాంతములు సరిగా సమ్మతమైనట్లు లేదు. 'Journal of the Andhra Historical Research Society' (Vol 3 Parts 2, 3 and 4 Page 234) లో బసవపురాణ పీఠికపై వారొసంగిన యీక్రింది యభిప్రాయముఁ జిత్తగింపుఁడు.

"Mr. Shastri has not been able to throw more light on the historic authenticity of Basava in his discussion of that topic. He has attempted to trace the connection between the Aradhya Saivism of the Andhra and Karnataka countries but has not satisfactorily dealt with the question. Likewise he has not been able to trace the origin and growth of the earlier forms of Saivism in South India with its intricate Philosophy of religious rites, the Pasupatha,

Kalamukha, Aghora, and other varieties and how Basava's Veerasaivism was an improvement or otherwise on the older cults."

భారతీయమతములలో శైవము చాలఁ బ్రాచీనతమమైనది. దానిలో ననేకములగు నవాంతరభేదము లనాదినుండియుఁ గలవు. వీనిలో నొకటి మొదట వెలసినదనియుఁ దక్కినవి దానిలోనుండి క్రమపరిణామము నొంది తరువాత వెలసినవనియు నిర్ధరించి వచించుటకుఁ దగిన సామగ్రి కానరాదు. అట్లూహించుటకూడ సరికాదనియే నామతము. ఈ యవాంతరభేదము లన్నియు నాయా యాచార్యులచేఁ జాల ప్రాచీన కాలమునుండియే వేర్వేఱు ప్రదేశముల వెలయింపఁబడి యుండుననియు నందులోఁ గొన్ని రాను రాను గొంతకాలమునకు నితరమతవ్యాప్తిచేఁ దగిన ప్రచారములేక యంతరించి యుండుననియుఁ దలంచుటయే సమంజస మని నా యభిప్రాయము. నిగమాగమములలో నిగమములు పరమేశ్వరుఁడగు శివుని నిశ్వాసములనుండి జనించినవనియు ఆగమములు తద్వదనసంజనితము లనియుఁ జిరకాలమునుండి భారతదేశమున వ్యవహరింపఁబడుచున్నది. ఆస్తికులకు రెంటియందును గూడఁ బ్రమాణబుద్ధి గలదు. చారిత్రాత్మకముగ నీవేదాగమము లెప్పుడు వెలసినది యిదమిత్థముగ నిరూపించుట యెట్టి విద్వాంసులకును సుకరమయిన పనికాదు. నామరూపరహితుఁడగు పరమేశ్వరునకు నామరూపములు సాధకుని సాధనకొఱకే కల్పింపఁబడినవనుట

నిర్వివాదముగ నంగీకరింపఁదగును, పరమేశ్వరతత్త్వము శివ రుద్రాదినామములతో వేదకాలమునుండియు వ్యవహరింపఁ బడినట్లు ఋగ్యజుర్వేదములవలనఁ గాననగును. "శివస్య ఇదం శైవం" అను నిష్పత్తిచే శైవశబ్ద మేర్పడినది. "మన్ (తలంచు)" అను ధాతువునుండి మతము అను శబ్దము నిష్పన్న మయినది. కావున శైవ మనునది పరమేశ్వరతత్త్వ జిజ్ఞాసకయి యీ భారతదేశమున వెలసిన ప్రాచీనమత మనుట విస్పష్టము. ఆగమములలో శివాగమములు కామికాదినామములతో నిరువదియెనిమిది యున్నవి. శైవమతము నందలి యవాంతరభేదము లీయాగమములందుఁ బ్రతిపాదితములయి యున్నవి. సూక్ష్మాగమములో:

శ్లో॥ సామాన్య శైవం ప్రథమం మిశ్రశైవం తతః పరమ్
శుద్ధశైవం తతో జ్ఞేయం వీరశైవం తతః పరమ్.

అని స్థూలదృష్టితోఁ జతుర్విధ శైవమును, కారణాగమములో:

శ్లో॥ ఆద్యా సామాన్యశైవంతు, పూర్వశైవం ద్వితీయకం
మిశ్రశైవం తృతీయంతు, శుద్ధశైవం చతుర్థకం
పంచమం శ్రౌతశైవంతు, షష్ఠమం మార్గశైవకం
సప్తమం వీరశైవం స్యా, ద్వీర సామాన్య చాష్టకం
విశేషం వీరశైవంతు, నవమం పరికీర్తితం
నిరాభారాఖ్యశైవంతు, దశమం పరిచోదితం
క్రియాశైవం దశవిధం, తత్తద్భేద మిహోచ్యతే.

అని దశవిధశైవములును వేర్కొనఁబడి వాని భేదములు వివరింపఁబడినవి. వీనిలో శ్రౌతశైవ, మార్గశైవ, వీరశైవములలో సాధకునకు గురుదత్తమగు నిష్టలింగమును హస్తపీఠమందునిచి యర్చించుట విధింపఁబడినది. ఇష్టలింగ మెప్పుడును ధరింపఁదగినదనియుఁ దద్విషయమున సాధకుఁడతిజాగరూకతతో మెలంగవలయుననియు, అది ప్రమాదముననైనను భూపతితముగాని వినష్టముగాని యైనచో ప్రాణ పరిత్యాగముకన్న వేఱుగతి లేదనియు వీరశైవుని విషయమున శాసింపఁ బడి యిష్టలింగార్చనమునం దాతనికి విశిష్టభక్తి నియమములు విధింపఁ బడినవి. దహరాకాశ ప్రతిష్ఠితమగు నంతర్లింగమునకు, గురుదత్తమయిన బాహ్య లింగమునకు (ఇష్టలింగమునకు) బింబ ప్రతిబింబ రూపకమగు నైక్యానుసంధానమును నిరంతరము సాధనచేయుచు నాతఁడు కాలమును గడుపవలెను. పంచాక్షరీజపము ఇష్టలింగపూజనము మాత్రమే యాతఁడొనర్పవలెను. అన్యదేవతాస్మరణము మంత్రోపాసనములెల్ల నాతనికి సంపూర్ణముగ నిషేధింపఁబడినవి. ఇందుచేతనే తక్కినమతములు వారాంగనాసదృశములనియు, వీరశైవము కులాంగనాసమ మనియు, అల్పక్రియ గలిగి బహుఫలదాయకమగు నీ వీరవ్రతమును విధియుతముగ నిర్వహించు సాధకున కొక్కజన్మములోనే ముక్తి సిద్ధించు ననియు శై. వాగమములలోఁ జెప్పఁబడినవి.

శ్లో॥ "విశబ్దేనోచ్యతే విద్యా శివజీవైక్యబోధికా
తస్యాం రమన్తే యే శైవా వీరశైవాస్తు తే మతాః"
"వేదాంతజన్యం యద్జ్ఞానం విద్యేతి పరికీర్తితా
విద్యాయాం రమతే తస్యాం వీర ఇత్యభిధీయతే."
"విశిష్టఈర్య తేయస్మాద్వీర ఇత్యభిధీయతే."

ఇత్యాదిగా వీరశైవశబ్దము నిర్వచింపఁబడినది. కావున శివజీవైక్య జ్ఞానము (లింగాంగసామరస్యము) కయి నిరంతరము సాధనచేయు జనుఁడు వీరశైవుఁడని వ్యవహరింపఁబడును గాని కొందఱు సామాన్యముగ భ్రమించునట్లు లితర మతములను, మతస్థులను ద్వేషించువాఁడు కాఁడు. వీరవ్రతుని దృష్టి యెప్పుడు నాత్మోన్నతియందేగాని పరమతద్వేషాదులపయిఁ బ్రసరింపనేరదు.

అనన్య భక్తిజ్ఞాన వైరాగ్య ప్రధానమై మోక్షైక సాధనమగునిట్టి యుత్తమ మతము బసవేశ్వరాద్యుపజ్ఞమే గాని ప్రాచీనము గాదని తలంచుట గొప్ప ప్రమాద మని చెప్పక తప్పదు. వీరశైవమునకుఁ బ్రధానాంగ మిష్టలింగ ధారణ మగుటచే నా మతము నూతనమని తలంచువారు లింగధారణము తాంత్రికమేగాని వైదికము కాదనిచెప్పు సాహసమునకుఁగూడఁ గడంగుచున్నారు. ఇదియుఁ గేవలము భ్రమమూలకమే.

"పవిత్రం తే వితతం బ్రహ్మణస్పతే ప్రభుర్గాత్రాణి పర్యేషి విశ్వతః, అతప్త తనుర్న త దామో అశ్నుతే,

శ్రిత్వాస ఇద్వహంస్త్రత్సమాశత" అను ఋగ్వేదమంత్రము వలనను,

"అయం మేహస్తో భగవాన్ అయం మే విశ్వభేషజో యం శివాభిమర్శనః అయంమ్మాతా అయంపితా అయంజీ వాతు రాగమాత్" మున్నగు నితర వైదిక మంత్రముల వలనను వైదికయుగమునుండియు నిష్టలింగధారణము ప్రాచీ నార్యసమ్మతముగా నుండెననుట వ్యక్తమగుచున్నది. ఇం దుకుఁ దగిన యుపబృంహణవచనములుగూడ నుపనిషత్తుల యందును బురాణములందును ననేకములు కాననగును. పూర్వ మునీశ్వరులు పలువు రిష్టలింగధారులుగా నుండిర నుటకు స్మృతి పురాణప్రమాణములు పెక్కులున్నవి. "వీర శైవమత ప్రాచీనత" యనువ్యాసమునఁ బయివిషయములెల్ల విస్తరింపఁబడును.

వేదాగమపురాణప్రసిద్ధమగు నీ వీరశైవమతమునకుఁ బ్రథమాచార్యులెవ్వ రను విషయము నిఁకవిమర్శింతము. "ఈశానస్సర్వవిద్యానాం" అను ప్రమాణమువలనఁ బరమే శ్వరుఁడే ప్రప్రథమాచార్యుఁడని చెప్పఁదగును. అతని యాజ్ఞవలన నీ మతప్రచారమున కయి యాతని పంచవద నములనుండి పంచాచార్యు లుద్భవించిరనియు యుగభేద ముల ననుసరించి వారు వేర్వేఱు నామములతో వ్యవహ రింపఁ బడిరనియు శైవాగమములు తెలుపుచున్నవి.

శ్లో॥ "సద్యోజాతశ్చ ప్రథమో, వామదేవో ద్వితీయకః
అఘోరస్తు తృతీయస్తు, తత్పురుషశ్చతుర్థకః
ఈశానః పంచమశ్చేతి, ముఖాని మమ సర్వశః
తాన్యాననాని గోత్రాణి, వేదోక్తాని నసంశయః
వృషో నందీ తథాభృంగీ, వీరశ్చ స్కంద ఏవచ
మత్స్యరూపా త్సముత్పన్నాః, పంచగోత్రాధికారిణః,
రేణుకో దారుకశ్శంఖ, కర్ణశ్చ ధేనుకర్ణకః
విశ్వకర్ణశ్చ పంచైతే, పంచగోత్రసముద్భవాః
ఏతేషాం పంచనామాని యుగభేదేన సర్వశః
ఏకాక్షరో ద్వ్యక్షరశ్చ, త్ర్యక్షరశ్చతురక్షరః
పంచాక్షరః కృతయుగే, పంచనామానిసర్వశః
ఏకవక్త్రో ద్వివక్త్రశ్చ. త్రివక్త్రశ్చతురాననః
పంచవక్త్రేతి త్రేతాయాం, పంచనామాని సర్వశః
ద్వాపరే రేణుకశ్చైవ, దారుకశ్చ ద్వితీయకః
శంఖకర్ణః తృతీయశ్చ, ధేనుకర్ణశ్చతుర్థకః
విశ్వకర్ణశ్చ పంచైతే, పంచనామాని సర్వశః
రేవణో మరుళశ్చైకో, రామేతి పండితస్తథా
విశ్వారాధ్య ఇతి ప్రోక్తాః, కలౌ పంచార్యనామకాః
వీరశైవమతోద్ధార, హేతవే పంచ తానపి
మన్ముఖేభ్యస్సముత్పాద్యాః, తైరేవాకర్ణ మంబసా"
(స్వప్రబోధాగమము)

శ్లో॥ 'అతఃపరం ప్రవక్ష్యామి, పంచాచార్యసముద్భవం
తేషాం నామాని దేవి త్వం, ప్రమణు శివ్యచేతసా

ఘంటాకర్ణగణశ్చాద్యో, గజకర్ణో ద్వితీయకః
తృతీయో రేణుకః ఖ్యాతః చతుర్థో దారుకస్తథా
పంచమో విశ్వకర్ణశ్చ పంచారాధ్యా ఇతి స్మృతాః
తఏవ యుగభేదేన ప్రతినామాన్యుపాగతాః
ఏకాక్షరో ద్వ్యక్షరశ్చ, త్ర్యక్షరశ్చతురక్షరః
పంచాక్షర ఇతిఖ్యాతాయాం మేనకాత్మజే!
ద్వాపరే చైకవక్త్రశ్చ, ద్విముఖస్త్రిముఖస్తథా
చతుర్ముఖః పంచముఖ, శ్చేతితే విశ్రుతా గణాః
ఏకోరామః పండితార్యః తథా రేవణసిద్ధరాట్
తథా మరుళసిద్ధేశో, విశ్వారాధ్య ఇతిక్రమాత్
భవితారః ప్రవక్ష్యామి, శృణు తజ్జనన క్రమం
దక్షారామే రామనాథ, లింగే యుగచతుష్టయే
ఏకోరామస్య జననం, ఆవాసస్తు హిమాలయే
సుధాకుండాఖ్యసుక్షేత్రే, లింగే శ్రీమల్లికార్జునే
జననం పండితార్యస్య, నివాసశ్శ్రీగిరౌ శివే!
తథా రేవణసిద్ధస్య కుల్యపాక పురోత్తమే
సోమేశలింగే జనన, మావాసః కదళిపురే
తద్వన్మరుళసిద్ధస్య, వటక్షేత్రే మహాస్తరే
సిద్ధేశలింగజననం స్థానముజ్జయినీపురే
కాశ్యాం విశ్వేశ్వరే లింగే విశ్వారాధ్యస్య సంభవః
స్థానం శ్రీకాశికాక్షేత్రే శృణు పార్వతి! సాదరం'

(స్వాయంభువాగమము)

వీనినిబట్టి రేవణసిద్ధ, మరుళసిద్ధ, ఏకోరామ, పండితారాధ్య, విశ్వారాధ్యనామములు క్రమముగా నీపంచాచార్యులకుఁ గలియుగమునందు వ్యవహరింపఁబడుననియు, వీరిపీఠములు వరుసగాఁ గొలనుపాక (నిజాంరాష్ట్రము), ఉజ్జని (బళ్ళారిమండలము). హిమవత్కేదారము (ఉత్తరహిందూస్థానము), శ్రీశైలము (కర్నూలుమండలము), కాశి (ఉత్తర హిందూస్థానము) అను క్షేత్రములందు నెలకొనెననియు స్పష్టమగుచున్నది. వీనిలో రేవణసిద్ధుని (రేణుకాచార్యుని) పీఠమాతని కాలములోనే కొలనుపాకనుండి మైసూరురాష్ట్రమునందలి కదళీపురము (బాలెహొన్నూరు) నకుఁ దరలింపఁబడినట్లు రేణుకవిజయము మున్నగు గ్రంథములవలనఁ గాననగును. పండితారాధ్యునిపీఠము శ్రీశైలమునుండి గుంటికల్లున కొకశతాబ్దిలోపలఁ దరలింపఁబడినది. తక్కిన మూఁడుపీఠములు నిప్పటికి ఉజ్జని, కేదార, కాశీక్షేత్రములందే నెలకొనియున్నవి. ఇట్టు లీ పంచాచార్యులచేఁ బ్రతిష్ఠింపఁబడిన పంచసింహాసనములు పారంపర్యముగ ననాదినుండి తన్మతాచార్యులచే నధిష్ఠింపఁబడి నిర్వహింపఁబడుచుండ క్రీస్తుశకము 1130–1170 మధ్యఁ గళ్యాణపట్టణమున, బిజ్జలునిమంత్రిగానుండిన బసవేశ్వరుఁడే యీ మతమునకు మూలాచార్యుఁడని కాని యాతని సమకాలికుఁడగు మల్లికార్జున పండితుఁడే పంచాచార్యులందలి పండితారాధ్యుఁ డని కాని తలంచుట కేవల మసంగతము. బసవేశ్వరుఁడు మల్లికార్జునపండితుఁడు

కన్యలఁ బరిణయము సంతానముఁ బడసి రాజవంశముల స్థాపించినట్లును, శాసనాదికములగు చరిత్రాధారము లా దేశములందుఁ గానవచ్చుచున్నవి. రేణుకాగస్త్యుల సంబంధము చిరకాలమునుండి మనదేశమున శైవవాఙ్మయమున వినవచ్చుచున్నది. రేణుకాచార్యునివలన దీక్షనొంది శివాద్వైతసిద్ధాంతముల సాంతముగ నెఱింగిన యనంతరమే యగస్త్యుఁడు తన్మతవ్యాప్తికై దేశాంతరములకుఁ గూడ నేఁగినట్లు కానవగును. అగస్త్యుఁడు క్రీస్తుపూర్వము 400 లకు ముందుండినవాఁడేగాని తరువాతివాఁడు మాత్రము కానేరఁడని శ్రీ యమ్. శ్రీనివాసఅయ్యంగారు అనువారు Tamil Studies అను గ్రంథమున వ్రాసియున్నారు. అతని ప్రశంస రామాయణమునఁ గూడఁ గలదు; పూర్వోక్తములైన విదేశములందీతఁడు స్థాపించిన రాజవంశములకుఁ జెందిన రాజు లీతని సంబంధము నుగ్గడించుచు నెలకొల్పిన శాసనములు క్రీ॥శ॥ 890 నుండియు నా దేశములందుఁ గానవచ్చుచున్నవి. అగస్త్యుని పోలు జావాద్వీపమున క్రీ॥ శ॥ 700 కుఁ జాల పూర్వమునుండియు నున్నట్టులనేకాధారములు గానవచ్చుచున్నవి. విశేషవివరములు వలయువారు The Cult of Agastya (అగస్త్యుని మతము) అను శీర్షికతో (శ్రీయుతులు అర్ధేంద్రకుమార గంగోలీ గారు Rupam అను నాంగ్ల త్రైమాసిక పత్రికలో 1926 సంవత్సరము జనవరిలో వ్రాసిన వ్యాసము చూడ

నగును. విభీషణుఁడు స్థిరజీవులలో నొకఁ డని పుర గ్రంథ ములవలనఁ దెలియనగును.

మంగళవాడ పురాధీశ్వరుఁడగు వీరబిజ్జలుఁడు బసవే శ్వరుని యేలికయగు కల్యాణబిజ్జలుఁడని పాఠకులు భ్రమింప రాదు. అతఁ డీ కల్యాణబిజ్జలుని పూర్వులలో నొకఁడయి యుండును. కల్యాణబిజ్జలుఁడుఁ గూడ మూఁడవ తైలపుని గల్యాణము నుండి పాఱఁదోలి పశ్చిమ చాళుక్యరాజ్యము నాక్రమించుకొనక పూర్వ మా తైలపునికి సామంతుఁడుగా తర్దవాడి మున్నగు సీమల మంగళవాడలో నుండి పరిపాలించు చుండినట్లు, అట్టగా నాతని పూర్వులకుఁగూడఁ గాణాచిగా నుండినట్లు మడగిహాళు శాసనము (Epigraphia Indica Vol.X.V,) వలన వ్యక్తమగును. ఆసంగతి "బసవేశ్వరుఁడు-బిజ్జలుఁడు" (విభూతి సం. 1 సం. 7) అనువ్యాసమున వివరించి యేయుంటిని. కావున రేణుకవిజయమునఁ జేర్పఁబడిన వీర బిజ్జలుఁ డత్యంత ప్రాచీనుఁడని యే తలంపనగును. అతనికాల మిదమిత్థమ్మని నిర్ణయింపఁజాలము. ఈ వీరబిజ్జలునిఁగూర్చిన కథ యర్వాచీనులు రచించిన రేవణసిద్ధ పురాణాదులలో విచి త్రిముగ వికృతాకృతులఁ దాల్చుట పాఠకులు గమనింపఁదగి నది. వీరబిజ్జలుని కల్యాణబిజ్జలునిగా మార్చుటయేగాక చెఱ నుండి విడిపింపఁబడిన పదిరెండు వేల కన్నియలను రేణుకుఁడు పెండ్లియాడెననియుఁ బారయు గుద్దలిగొని తటాకమును ద్రవ్వెననియు విపరీతముగ వ్రాసి యా తరువాతి కవులు

కల్యాణ బసవేశ్వరునకు బిజ్జలునకు సమకాలీనుఁడగు సొన్నలిపురపు సిద్ధరామయ్యతో రేణుకునకు సంబంధము గల్పించిరి. శంకరాచార్యుఁడు క్రీ॥ పూ॥ 509-477 వఱకు నుండినట్లు చాలమంది యభిప్రాయము. శంకర విజయాది గ్రంథము లట్లే నిరూపించుచున్నవి. రేణుకాచార్య ప్రదత్తమగు చంద్రమౌళీశ్వర లింగము శంకరాచార్యుఁడు స్థాపించిన శృంగేరిపీఠమున నిప్పటికిని బారంపర్యముగఁ బూజింపఁబడుచున్నది. తన్మఠస్థులు ప్రకటించిన గురువంశకావ్యమునను కెళది బసవప్పనాయకుని శివతత్త్వరత్నాకరము నందును గూడ రేణుకాచార్యుఁ డాదిశంకరుల కొసంగిన యీ లింగ ప్రదానము పేర్కొనఁబడినది. మఱియు రేణుకాచార్యుని రంభాపురపీఠమున రుద్రమునీశ్వరాలయమున నీ విషయమును నిరూపించు ప్రాచీన శిలాప్రతిమగూడఁ గలదని తెలియుచున్నది. చోళరాజులలో విజయేంద్ర, రాజేంద్ర నామాంకితులు వేర్వేఱు కాలములలోఁ బలువురు కాననయ్యెదరు. కావున రేణుక విజయమునఁ బేర్కొనఁబడిన రాజుల కాలముకూడ నిదమిత్థముగ నిర్ణయింపఁజాలము, విక్రమాదిత్యుఁ డాపేరిట శకమును స్థాపించిన రాజోత్తముఁడే యని తలంచినచో నాతనికాలము క్రీ॥ పూ॥ 56 ప్రాంతమగును. సిద్ధులలో గోరక్షనాథనామాంకితులు పలువురు వేర్వేఱుకాలములందు వినవచ్చెదరు. కావున రేణుకునిచే గర్వభంగమునొందిన కొల్లాపుర గోరక్షసిద్ధుని కాలముగూడ

సరిగా నిర్ణయింపఁదగిన యాధారములు కానరావు. కావున క్రీ॥ శ॥ 960 సంవత్సరమున రచింపఁబడినట్లు గ్రంథము నుండియే తెలియనగు నీ రేణుకవిజయమునుబట్టి రేణుకుఁడే గాక వీరశైవ పంచాచార్యులలోఁ దక్కిన నలువురుఁగూడ బసవేశ్వరునకు ముందు చాలకాలము క్రిందటనే వీరశైవ మతమును దేశమున నెలకొల్పినట్లు నిస్సంశయముగ నెంచ వచ్చును. రేణుకుఁడు తన సంచారములోఁ దక్కిన నలువు రాచార్యుల పీఠములను గూడ సందర్శించి వారితో సంప్రతిం చినట్లు లీగ్రంథమునఁ గాననగును గదా! మఱియు నొక్క విశేషము. ఈ గ్రంథమున రేణుకుఁడు కొలనుపాక సోమేశ్వరి గర్భమునుండి యుదయించిన తరువాత రంభాపురికిఁ దరలి యచ్చట మఠము నెలకొల్పినట్లు చెప్పక యాతఁ డగస్త్యు నకుఁ దన సిద్ధాంతమును బోధించిన తరువాత నాతని వీడ్కొని యేఁగి పూర్వయుగములలోఁ దనచే రంభాపురియందుఁ బ్రతి ష్ఠింపఁబడి క్షీణదశ నొందుచున్న తన ధర్మపీఠమును దర్శించి యటనుండి తరలి యాకాశపథమునఁ బారావారతీరమునకుం జనినట్లు చెప్పఁబడినది. చూడుఁడీ క్రిందివాక్యములు.

"అగస్త్యాయ మత్సిద్ధాంతిత సిద్ధాంత శాస్త్ర మత్ర పరివర్త్యే త్వాజ్ఞాప్యపశ్యతస్తస్య. పురతోంతర్ధాయాంత రాత్మనా చింతయు న్నహూకాంతం తన్మలయమహీధ్ర మధ్యవిద్యోతమాన భద్రతర భద్రాతీర భాసమాన శ్రీమద్రం భాపురీ ప్రత్యేక యుగస్థ ప్రతిష్ఠితం, ధర్మపీఠం, క్షీణదశా

మాపన్న మభివీక్ష్య తతస్తారాపథ పథేన ప్రస్థాయ, పాశా వారతీర మాససాద." దీనిని బట్టి గ్రంథకర్త సిద్ధనాథుఁడు వీరశైవ పంచాచార్యులు యుగయుగములందు వేర్వేఱు నామములతో వానికి శివునిచే నిర్ణీతములయిన యా యా క్షేత్రములం దుద్భవించి శివాగమోక్తము లగు నా యా స్థానములందుఁ దమ ధర్మపీఠముల నెలకొల్పి యందు దావాస మొనరించిరను నాగమోక్తులనే ప్రమాణముగఁ గొని యిట్లు వ్రాసియుండు నని వ్యక్తమగును. అందుచే మన ప్రభాకర శాస్త్రి ప్రభృతులు శివాగమములు బసవేశ్వరుని కాలమందే వెలసినట్లు వ్రాయుట వట్టి దబ్బర యని యీ గ్రంథము వలనఁ గూడఁ దెల్లము కాకమానదు. మఱియు రేణుకుని నామము శైవవాఙ్మయమునందేగాక తదితర వాఙ్మయ మునఁ గూడ మన దేశమున వినవచ్చుచున్నది. అతని పేరఁ గొన్ని తీర్థములు గూడ వెలసియున్నవి. మహాభారతము వనపర్వములో 81-82 అధ్యాయము లందలి పుణ్యతీర్థ వర్ణన ములోఁ బేర్కొనఁబడిన తీర్థములలో రేణుకతీర్థమొకటి. వ్యాస భారతము ననుసరించి వ్రాసిన తన భారతమంజరిలో క్షేమేంద్రుఁడు గూడ దాని నుదహరించినాఁడు. కావున సంస్కృత వాఙ్మయమును బరిశోధింప రేణుకుఁడు మున్నగు వీరశైవ పంచాచార్యు లతిప్రాచీనకాలము నుండియు శివా ద్వైతమతమును భరత దేశమున నెలకొల్పిరని ఘంటాపథ ముగ నిర్ణయ మగునని నిస్సంశయముగఁ జెప్పవచ్చును...

ఇంక నీ పంచాచార్య పీఠముల ప్రాచీనతను నిరూపించు శిలావిగ్రహ శాసనాదిక ప్రమాణములను బరిశీలింతము......

పంచపాండవుల మనుమండు జనమేజయ చక్రవర్తి తనపితృదేవతల శాశ్వతశివలోక ప్రాప్త్యైకై యుధిష్ఠిరశకము 89 వ సంవత్సరమున ననంగా నిప్పటికి రమారమి యయిదు వేల సంవత్సరముల క్రిందటం బ్లవంగ సంవత్సర మార్గశీర్ష బహుళ అమావాస్య సోమవారమునాండు సూర్యగ్రహణ సమయమునం గేదారేశ్వరుని పూజార్థము సరస్వతీ మందాకినీ నదుల సంగమస్థానమున మందాకినీ, క్షీరగంగా, మధుగంగా, స్వర్గద్వారగంగానదుల మధ్యనున్న దేశమునంతయు హిమవత్కేదారమందలి జగద్గురు ఏకోరామారాధ్య పీఠమున కపుడాచార్యత్వమును వహించిన శ్రీగోస్వామి ఆనందలింగ జంగమస్వామి కాతని శిష్యుండగు శ్రీజ్ఞానలింగ జంగమస్వామి ద్వారమున స్వర్ణధారాపూర్వకముగ నొసంగి నట్లు లిఖించిన శాసన మిప్పటికిని తత్పీఠమున వెలయుచున్నది. ఉత్తరహిందూస్థానమున టెహ్రీ, నేపాళము, కాశ్మీరము, ఉదయపురము మున్నగు సంస్థానములం బాలించు రాజులెల్ల నిప్పటికి నీ మఠమునకు శిష్యులయి యేటేటం గానుకల నర్పింతురని తెలియుచున్నది. కాశియందలి జగద్గురు విశ్వారాధ్య పీఠమున ననేక శాసనము లిప్పటికిని నిలిచియున్నవి. వానిలో నిక్కిలి ప్రాచీనము లయినవి:

(1) విక్రమశక వత్సరము 631 లో కార్తిక శుద్ధైకాదశి నాఁడు కాశీరాజు జయనందదేవుఁ డప్పటి విశ్వారాధ్యపీఠాధ్యక్షుఁ డగు (శ్రీ) మల్లికార్జున శివయోగికిఁ దన్మఠమునకు సంబంధించిన గోవుల సంరక్షణమునకై జంగమపుర మను పేరుగల ప్రదేశమును ధారవోసియిచ్చిన భూర్జపత్రి శాసనము. ఈ శాసనము శిథిలమవుచుండుటచే నిప్పటి కాశీ రాజుగారు దానిని బరీక్షించి తన పూర్వు లొసంగిన దే యని పండితులవలన నిశ్చయించి మరల దాని నకలువ్రాసి తమ సంతకముతో నొసంగియున్నారు. (2) కాశీవిశ్వారాధ్య పీఠమునకుఁ (జంగమవాడి మఠమునకు) జేరిన శాఖామఠ మొకటి నేపాళదేశమున భాతగాం గ్రామమునఁ జిరకాలమునుండియు నెలకొనియున్నది. అదియు జంగమవాడి మఠ మనియే యిప్పటికి వ్యవహరింపఁబడుచున్నది. ఆ మఠమునకు శిష్యులయి నేపాళదేశాధీశు లనేకదానము లొసంగియున్నారు. జయరుద్ర మల్లదేవుఁడను నేపాళరాజు విక్రమశకవత్సరము 692 లో జ్యేష్ఠశుద్ధ అష్టమినాఁ డీ మఠమునకు భూదాన మొసంగుచు నెలయించిన శిలాశాసన మా మఠమున నిప్పటికిని నిలిచియున్నది. ఈమల్లదేవుని వంశ్యుఁడు విశ్వమల్లుఁడు సంస్కృతశ్లోకములతోను నేపాళభాషతోను వెలయించిన శాసనముకూడ నందు నెలకొని యున్నది.

మొగలుచక్రవర్తులు బాబరు, హుమాయూన్, అక్బరు, ఔరంగజేబు అను వారొసంగిన యర్వాచీనములుగూడఁ

గాశీపీఠమునఁగలవు విశ్వారాధ్యుని ద్వాపరయుగ వ్యవహార నామ మాగమములలో విశ్వకర్ణుఁడని కొన్నిచోట్లను, ఘంటాకర్ణుఁడని మఱికొన్నిటను గానంగును. ఇది యేకో రామారాధ్యుని ద్వాపరవ్యవహార నామమని మఱి కొన్నిటి వలనఁ గానంగును. కాశీక్షేత్రమున వ్యాసుఁ డీ ఘంటాకర్ణ శివాచార్యునివలన దీక్షఁబొంది వ్యాసేశ్వరలింగమును స్థాపించి మహా శివభక్తుఁ డైనట్లు స్కాందపురాణాంతర్గత కాశీఖండమువలనఁ గానంగును.

శ్లో॥ పారాశర్యస్తదారభ్య । శంభుభక్తిపరోఽభవత్
లింగం వ్యాసేశ్వరం సాప్య । ఘంటాకర్ణ హ్రిదాగతః॥

శ్లో॥ విభూతి భూషణో నిత్యం । నిత్యం రుద్రాక్షభూషణః
రుద్రసూక్తపరో నిత్యం । నిత్యం లింగార్చకోఽభవత్॥

వ్యాసేశ్వరలింగము నెదుట ఘంటాకర్ణ శివాచార్యుని విగ్రహ మిప్పటికిని నిలిచియున్నది. అచ్చటనే ఘంటాకర్ణ హ్రదమిప్పుడుగూడ నున్నది. జనులు దానిని "ఘంటా కర్ణతలావ" అని వ్యవహరించి ఘంటాకర్ణ శిలావిగ్రహమును "వ్యాసజీకా గురు" (వ్యాసుని గురువు) అని చెప్పుచుందురు. మరుళ సిద్ధారాధ్యుని యాజ్ఞని పీఠమున క్రీ॥ శ॥ మూఁడవ శతాబ్దియందు శివభక్తులగు పాండ్యరాజులు పున ర్నిర్మాణాదికములు గావించినట్లు తెలియఁజేయు శిలాశాసనము గానవచ్చుచున్నది. ఇఁక మనయాచార్య పండితుని

శ్రీశైలపీఠమున కాంధ్ర, కర్నాట, ద్రవిడ, మహారాష్ట్ర దేశములలో శాఖామఠము లనేకములున్నవి. అందులో మైసూరు రాష్ట్రమున కోలారుజిల్లా భాగేపల్లితాలూకా గూడూరు దగ్గఱ నున్న నిడుమామిడి యందలి సుప్రసిద్ధ మఠ మొకటి. ఈ మఠమునకుఁ దృతీయ పట్టభద్రులగు శ్రీ చంద్రగుండ మల్లికార్జున శివాచార్యులు దేవరదాసి మార్యునకు (శంకరదాసిమయ్య) లింగధారణ మొనర్చినట్లును, తరువాత నా దాసిమార్యుఁడు ముదనూరు రామనాథ శివాలయము నాశ్రయించి యచ్చటనే బయలయినట్లును, గొన్ని శాసనములవలనఁ దెలియున్నది. ఈ లింగధారణప్రశంస శివశరణవిలాస మను కన్నడగ్రంథమునను, పుల్లకవి రచించిన తెలుఁగు పండితారాధ్య చరిత్రమునందును, ఇగడూరు రుద్రకవి వ్రాసిన పండిత చరిత్రమునందునుఁగూడఁ గలదనియు నీ మూఁడు పుస్తకములకుఁ బ్రాచీన తాళపత్రములు నిడుమామిడి మఠమున నిప్పటికిఁ (గూడఁ) గలవనియు శ్రీ వీరభద్రశర్మగారు (విభూతి సంపాదకులు) నాకుఁ దెలిపియున్నారు. శంకరదాసిమయ్య ప్రశంస సోమనాథుని బసవపురాణమునఁ గూడఁ గలదు. అతఁడు బసవేశ్వరునకు ముందొక శతాబ్దికిఁ బయిగ జగదేకమల్లుని కాలమున నున్నవాఁడు. ఆచార్య పండితుని శ్రీశైలపీఠమునకు శిష్యప్రశిష్యుఁడయిన శంకరదాసిమయ్య వృత్తాంతముగూడ నీ శ్రీశైల పీఠ ప్రాచీనతకుఁ బ్రబలనిదర్శనము కాఁగలదు.....

కావున సంస్కృత వాఙ్మయమునందలి యాగమములఁ బట్టియేమి, తదితర గ్రంథజాలమును బట్టియేమి, పంచాచార్య పీఠములందును తచ్ఛాఖామఠములందును నిలచియున్న శిలావిగ్రహ శాసనాదిక ప్రమాణములఁ బట్టియేమి, వీరశైవము బసవేశ్వరోపజ్ఞము గాక పంచాచార్య పరిశోధితమై భరతవర్షము నలుదిశలఁ జిరకాలము నుండియే కొలఁదిగనో గొప్పగనో వ్యాప్తమై యుండెననియు, పండితత్రయమనఁ బరఁగు శివలెంక మంచన, శ్రీపతి, మల్లికార్జున పండితారాధ్యులలో నెవరికి వీరశైవ పంచాచార్యులతోఁ బ్రసక్తియెంతమాత్రము లేదనియు, తక్కిన నలువురాచార్యుల వలెనే యాచార్యపండితుఁడు గూడ మిక్కిలి ప్రాచీనుండనియు నిష్పక్షపాత బుద్ధితో విషయ విమర్శన మొనర్చువారికి విశదము కాక మానదని తలంచుచున్నాను. విజ్ఞులు యథార్థమును నిర్ణయింతురు గాక !

వీరశైవము బసవేశ్వరునకు ముందే దక్షిణ హిందూదేశమున నుండె ననుటకుఁ బ్రాచీనమగు ద్రవిడ వాఙ్మయము నుండియు, పంచాచార్య పీఠములందుఁగాక యితరత్ర లభించు శాసనాదికము ల నుండియు విశేష ప్రమాణములను "వీరశైవమత ప్రాచీనత" యను వ్యాసమున వివరింతును.



## శ్రీశైలచెన్నమల్లికార్జునస్వామి – ఆస్థానకవులు

'శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే' అను పురాణ ప్రసిద్ధికిఁ దావలమయిన శ్రీశైల మహాపుణ్యక్షేత్రము భారతదేశమందంతటఁ జిరప్రశస్తిని బడసియుండుట సర్వవిదితము. ఇచ్చట శ్రీభ్రమరాంబా నామక శక్తియుక్తుఁడై వెలసిన శ్రీచెన్నమల్లికార్జునస్వామి సకలజనులను నభీష్టప్రదుఁడు, వరదుఁడు నగు పరమేశ్వరుఁడు. వీరశైవ పంచాచార్యులలోని చతుర్థాచార్యుఁడయిన పండితారాధ్యుఁడు, శ్రీమల్లికార్జున లింగగర్భ సంజనితుఁడేయని స్వాయంభువ సుప్రబోధాదిక శివాగమ ప్రసిద్ధి. అనాదినుండియు సామాన్య జనులతోపాటు సుప్రసిద్ధకవీశ్వరులుగూడఁ జెన్నమల్లికార్జున స్వామిని సేవించి యాతనిపయిఁ దమ కృతుల వెలయించి శివసాయుజ్యము నొంది చరితార్థులయిరి. అట్టివారిని మనమీ మల్లికార్జునస్వామి యాస్థానకవులుగా గణింపఁదగును. ధూర్జటి మహాకవి శ్రీకాళహస్తీశ్వరుని వలె వీరు మల్లికార్జునుని జీతబత్తెములు లేకయే నిండారు బత్తితో సేవించిన మహనీయులు. ఇట్టి కవులలోఁ బ్రప్రథమమున నెన్నఁదగువారు (1) మల్లికార్జున పండితారాధ్యుఁడు (2) పాలకురికి సోమనాథుఁడు (3) నాగలూటి శేషనారాధ్యుఁడు.

మల్లికార్జున పండితారాధ్యుని తల్లిదండ్రులు, భీమన పండితుఁడు, గౌరాంబ. గోదావరీ మండలమున దక్షిణకాశి

యని పేర్వడసిన దక్షారామక్షేత్రమున వెలసిన భీమేశ్వర స్వామి నారాధించు నర్చకులయ్యు సంతానార్థము శ్రీశైల యాత్ర కేగి మల్లికార్జునస్వామిని భజించి యాతని యను గ్రహమునఁ బుత్త్రునిఁ బడసి యాతని కాస్వామి పేరునే పెట్టినవారు. మల్లికార్జున పండితుఁడును దూరమున గోదా వరీ మండలమున నివసించినవాఁడయ్యు తల్లిదండ్రులకుఁ దన్నుఁ బ్రసాదించిన శ్రీశైల మల్లికార్జునస్వామియెడ విశేష భక్తి గలిగి మునుముం దాస్వామిపేర శ్రీగిరి మల్లికార్జున శతకమును రచించి, భావికాలమున నాంధ్రవాఙ్మయమున నానాటికి విస్తరిల్లిన శతక వాఙ్మయమునకు శ్రీకారమును జుట్టినాఁడు. మన దురదృష్టవశమున నా శతకరాజమిప్పుడు కాలగర్భమున నడఁగి పోయినది. ఆరాధ్య దేవర శ్రీగిరిమల్లి నకార్జున శతకములోనిది దని కొన్ని లాక్షణిక గ్రంథములలో నుదాహృతమయిన యీక్రింది పద్యమువలన మన కీ శతక విషయము తెలియుచున్నది.

"లోకములెల్ల నీ తనువులోనివవ నీవఁట యెంతగల్గుదో
నాకప పద్మసంభవ జనార్దనులాదిగ నెల్లదేవతల్
నీకోలఁ దింత యంత యన నేరరటన్నను నిన్ను నింక నే
నేకరణిన్ నుతింతుఁ బరమేశ్వర! శ్రీగిరి మల్లికార్జునా!"

ఈ మల్లికార్జున పండితుఁడే 'శివతత్త్వసార' మను శివకృతినికందపద్యములతో నొక శతకరూపముననే రచించి నట్లు కాననగును. అందు నియమితమయిన యొక ఘట్టము

గానరాక పలుపద్దియములు మతసిద్ధాంత బోధకములుగా నున్నను గొన్ని పద్దెములు శివా, రుద్రా యను మకుటముతో ముగియుచుండును, ఇది రసూరము ౧౦౦౦ పద్యములతో రచింపఁబడి యుండునని తోఁచును. తొలుదొలుత రసూరము ౭౮౦ పద్యములు మాత్రము ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికయందు ముద్రితములై ప్రత్యేక పుస్తకరూపమునఁ గూడఁ బ్రకటితము లయినవి. మదరాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయములో నీ శివతత్త్వసార పద్యములు కొన్ని కన్నడమున గూడ లభించుటచే మల్లికార్జున పండితుఁడు తన యాంధ్రప్రతిని గన్నడమునఁ దానే యనువదించి యుండునని చెప్పవచ్చును.

పండితుని తర్వాతఁ బేర్వడసిన వీరశైవకవి పాలకురికి సోమనాథారాధ్యుఁడు తన ప్రథమకృతి యగు 'యనుభవసారము'న మల్లికార్జున పండితుని మూఁడు పద్యములలో నుతించుచు నందొకదానిలో-

"...శతకంబు శివతత్త్వ
సార గద్య పద్య సమితి శివుని
మహిమఁ దెల్పినట్టి మల్లికార్జున పండి
తయ్యగారిఁ దలఁతు ననుదినంబు"

అని నుతించి యున్నాఁడు. ఇది ద్వంద్వసమాసముగా నన్వయింపఁదగును. శ్రీగిరిమల్లికార్జునశతకము, శివతత్త్వసారము, గద్యపద్య కృతులు మూలమునఁ బండితుఁడు శివుని

మహిమ స్థాపించి నాఁడని యర్థము సేయఁదగును. ఇందులో నాతఁడు పేర్కొనిన శతకము పైని నుదాహరించిన శ్రీగిరి మల్లికార్జునశతకమే యైయుండును. ఈశతకము, శివతత్త్వ సారమేగాక, పండితుఁడు శ్రీముఖదర్శనగద్య పంచగద్యలు మున్నగు మాత్రాగణబద్ధములగు గద్య (గేయ) కృతులు రచించినట్లు తెలియుచున్నది. పండితునిగూర్చి సోమనాథుఁడు రచించిన పండితారాధ్యచరిత్ర యను ద్విపదకావ్యములో—

"పాంచభౌతిక పంచ పంచేంద్రియ ప్ర
పంచదూరు నుతించు బంచగద్యలను"

అని పండితునిఁ బ్రశంసించినాఁడు. గద్యలన నేఁడు మనము వ్యవహరించునట్లు కేవల వచనములు కావు. అవి మాత్రాగణబద్ధములగు గేయకృతులయి చాలవఱకు లక్షణముతో రగడలకు సరిపడుచుండును. వాని స్వరూపమును గూర్చి ముందు విస్తరించెదను. సోమనాథుఁడు బసవపురాణ, పండితారాధ్య చరిత్రావతారికలలో—

"ఉరుతగద్య పద్యోక్తులకంటె
సరసమై పరఁగిన జాను తెనుంగు
చర్చింపఁగా సర్వసామాన్యమగుటఁ
గూర్చెద ద్విపదలు కోర్కెదైవాఱ:
ఆరూఢ గద్యపద్యాది ప్రబంధ
పూరితసంఖ్య ...

మానుగా సర్వసామాన్యంబుగామి
జాను తెనుఁగు విశేషము ప్రసన్నతకు"

అని తన ద్విపదకావ్య రచనమున కుపబలముగాఁ బ్రశంసించియున్నాఁడు. మల్లికార్జున పండితుని శివతత్త్వ సార పద్యములు గొన్నిటి మకుటములో శివా, రుద్రా యని సంబోధింపఁబడిన దతనిదృష్టిలో మల్లికార్జునస్వామియే యనియు, శివతత్త్వసార కృతికూడ నా స్వామి కంకితముగా రచించిన దే యనియు సంభావించుట కభ్యంతర ముండరాదు. మల్లికార్జున పండితు ననుసరించి, పాల్కురికి సోమనాథుఁడు కూడఁ దాను తెలంగాణమున ఓరుగల్లు ప్రాంతమున పాల కురికి యందు జనించిన వాఁడయ్యు నాగ్రామ మందలి సోమేశ్వరస్వామికే గాక, శ్రీశైలమల్లికార్జునస్వామికిఁ గూడఁ బరమభక్తుఁడై యూత్మేశుగా నాతని గణించి భజించి నవాఁడు. ఈతని విద్యాభ్యాసము చాలవఱకు త్రిపురాంత కము, శ్రీశైలము పరిసరములందు కరస్థలి సోమనాథుఁడు. విశ్వనాథుఁడు మున్నగు భక్తవరుల సన్నిధినే జరిగియుండునని తోఁచుచున్నది. అతని బసవపురాణ పండితారాధ్య చరిత్ర రచనముల కుద్బోధము శ్రీశైలక్షేత్రమున మహాశివరాత్రి కేతెంచిన భక్తుల యొడ్డోలగములందే జరిగినట్లు లా గ్రంథ ములందలి యూతనియవతారికల వలనఁ దెలియుచున్నది. త్రిపు రాంతక వాస్తవ్యుఁడు కరస్థలి విశ్వనాథుఁడే సోమనాథుని కవితాగురువు.

"విభుకరస్థలంబు విశ్వేశు కారుణ్య
జనిత కలిత కావ్యశక్తియుతుఁడ"

నని అనుభవసారావతారికలో నాతఁడే స్వయముగఁ జెప్పికొన్నాఁడు.

"చరలింగఘన కరస్థలి విశ్వనాథ
సంకృపాంచిత కవిత్వస్ఫూర్తిఁ బేర్చి"

అని బసవపురాణ గద్యము, షట్స్థల విజ్ఞాన విషయకముగ నీతఁడు చెప్పిన చెన్నమల్లు సీసము లాంధ్రవాఙ్మయమునఁ జిరవిశ్రుతములు.

"చెనమల్లేశ్వరు పేరిట
సునిశితముగఁ బాలకురికిసోమేశుఁడు దా
ఘనభక్తి వెలయఁ జెప్పెను
చెనమలుసీసము లనంగఁ జెలఁగ ధరిత్రిన్.

అని కృత్యవసానమున నాతఁడే చెప్పికొన్నాడు.

సోమనాథునివాఙ్మయము చాలవఱకు బసవేశ్వరస్తోత్రపూర్వక మనుట సుప్రఖ్యాతము. బసవఁడు కర్ణాటదేశీయుఁడయినను నాతనిచరిత్రమును బురాణరూపకముగ మును ముందు బసవనిసమీపకాలమున రచించినది మనయాంధ్రకవి సోమనాథుఁడే.

"బసవన్నమహిమ సంభద్భక్తియుక్తిఁ
బచరించితివి గద్యపద్యాదికృతుల
సర్వ నావృతధాత్రియం దొప్ప బసవ

వర్ణనల్ చేసితి వరుసన వీను
లారంగ..."

అని భక్తులు తన్ను నుతించినట్లు పండితారాధ్యచరిత్రావతారికలో నాతఁడే చెప్పికొన్నాఁడు. ఆచరిత్రమును గూడ నాతఁడు బసవనికే యంకిత మొనర్చినాఁడు. బసవేశ్వరునియందు భక్తి ముదిరినకొలఁది నీతఁడు బసవతన్మయుఁడవుటచే సమస్తశైవప్రపంచము నతనికి బసవరూపకముగనే గోచరింపఁజొచ్చెను.

"తెల్లంబుగా నస్మదీయేశుఁ జెన్న
మల్లికార్జున దేవు మహితరూపంబు
తా నెయ్యా బసవనదండనాయకుని
జానొంద మత్కృతిస్వామి గావించి.
... ... ... ..."
"మసలక మా చెన్నమల్లికార్జునుని
బసవనామం బిడి భక్తి పెక్కు-సను
బసవలింగం బని ప్రణుతించువాఁడ."

అను పండితారాధ్యచరిత్రావతారిక యందలి వాక్యములఁ జిత్తగింపనగును. కావున, సోమనాథునిదృష్టిలో శ్రీశైలచెన్నమల్లికార్జునునకు బసవేశ్వరునకు నభేదమనియుఁ దలంపనగును. అందుచే బసవేశ్వరునిగూర్చి సోమనాథుఁడు చెప్పిన గద్యపద్యకృతు లన్నియు మల్లికార్జునాంకితములే యని తలంచుట కభ్యంతరము లేదు. 'బసవా! బసవా!

బసవా! వృషాధిపా!' యనుమకుటముతో నీతఁడు రచించిన వృషాధిపశతకము, మల్లికార్జునపండితుని శ్రీగిరిమల్లికార్జున శతకము తరువాత నాంధ్రమున వెలసిన వృత్తశతకములకెల్ల మార్గదర్శకము. ఇట్లే పండితుని శివతత్త్వసారము కందపద్య శతకములకు 'బసవలింగ' అనుమకుటముతో నున్న సోమనాథుని చతుర్వేదసారము సీసపద్యశతకములకు మార్గదర్శకములు.

శివప్రమథులలో నందీశ్వరుఁడు ద్వితీయశంభుఁ డని గణింపఁబడినవాఁడు. ఆ నందీశ్వరునియవతారమే బసవేశ్వరుఁ డని వాలోకప్రమథునియవతారము మల్లికార్జునపండితుఁడని, భృంగీశ్వరుని యవతారమే పాలకురికి సోమనాథుఁ డని వీరశైవుల విశ్వాసము. శంభునకు, ద్వితీయశంభునకు నభేదాధ్యవసాయము గనుక మనము పైనిగణించినట్లు బసవ నిపేరనున్న సోమనాథునివాఙ్మయము ఛెన్నమల్లికార్జునస్వామికే చెల్లుననుట శాటంకము లేదు. అందుచే మల్లికార్జున స్వామియాస్థానకవులలో ద్వితీయస్థానము సోమనాథునిది. ఇతని గద్యపద్యకృతులలో, పంచప్రకారగద్య, నమస్కారగద్య, అక్షరాంకగద్య, పద్యములు, శరణుబసవరగడ అను వానిని నేను క్రమముగ మున్ను ఆంధ్రపత్రిక, ప్రజోత్పత్తి, అంగీరస, శ్రీముఖ, భావ, యువసంవత్సరాదిసంచికలలో నాయుపోద్ఘాతములలోఁ బ్రకటించియుంటిని. తరువాత 1962 సంవత్సరములో 'పాలకురికి సోమనాథకవి-లఘుకృతులు' అను

పేరితో వివిధములగు నిరువదియొక్క లఘుకృతుల నొకసంపుటముగాఁ బ్రచురించి యుంటిని.

మల్లికార్జున పండితారాధ్య, పాల్కురికి సోమనాథులతర్వాత చెన్నమల్లికార్జునస్వామి యాస్థానకవిగా గణింపఁదగినవాఁడు నాగలూటి శేషనారాధ్యుఁడు. ఈతఁడు శ్రీశైలప్రాంతమందలి నాగలూటిపురవాస్తవ్యుఁడు. సోమనాథుని పండితారాధ్యచరిత్రమందలి పర్వతప్రకరణము, స్కాందపురాణమందలి శ్రీశైలఖండము ననుసరించి పర్వతపురాణ మను పేర నాలుగాశ్వాసముల ప్రౌఢప్రబంధమును రచించినాఁడు. ఈతఁడు విద్వత్కవి. పెక్కువ్యాకరణవిశేషముల కీతనిగ్రంథము నిధానము. సంస్కృతమునకు నాంధ్రమునకుఁ గల జననీజన్యరూపకసన్నిహితత్వము నగ్గడించుచుఁ జెప్పినపద్యము నిసర్గమనోహరము. తరువాత వల్లభరాయు, శ్రీనాథరచిత మగు క్రీడాభిరామమందలి·

"జనని సంస్కృతంబు సకలభాషలకును
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స
జననికన్న మిగుల సౌభాగ్యసంపద
మెచ్చుటాఁడుబిడ్డ మేలు గాదె.

అనుపద్యమునకు శేషనారాధ్యునిపద్యమే మార్గదర్శకముగఁ దోఁచును. ఈతనిగ్రంథము ముద్రితమయి రమారమి డెబ్బదివత్సరము లయినది. ప్రతు లిప్పుడు దొరకుటలేదు. పరిశుద్ధముగఁ బరిష్కరింపించి దీనిపునర్ముద్రణము గావించు

బాధ్యత శ్రీశైలదేవస్థానవర్గముపై నున్నదని చెప్పనక్కఱ లేదు.

"జనని సమస్తభాషలకు సంస్కృతభాష ధరాతలంబునన్
ఘనలలితార్థగౌరవవికాసి తెనుంగభిరామ మంతకున్
గనుఁగొనఁ జాతబీజమునకంటెను గోమలపత్రపుష్పశో
భనమృదుపల్లవాభినవబాలరసాలము సొంపు నింపదే."

ఇట్లు శ్రీశైలచెన్నమల్లికార్జునస్వామిసాన్నిధ్యమున నేమి, పరోక్షముననేమి, యాతని కంకితముగానేమి, శ్రీశైలక్షేత్రమాహాత్మ్యప్రతిపాదకముగనేమి కృతులు రచించి యర్పించినకవులనుగూడ మన మాతని యాస్థానకవులుగనే గణింపవచ్చును. అందులో ముఖ్యముగా క్రీ॥ శ॥ 1440 ప్రాంతమున శ్రీశైలమందే కొన్నిదినములు భిక్షావృత్తిమఠమున వసించి భిక్షావృత్తియతీశ్వరుని యానతిపై నాతనిమూలపురుషుఁ డగు ముమ్మయశాంతయ్య కంకితముగా శివరాత్రిమాహాత్మ్యము అను కృతిరచించిన శ్రీనాథమహాకవిని, ఇంచుమించుగ నాసమీపకాలముననే ఆక్షేత్రమునందే యుండి భిక్షావృత్తియతీశ్వరుని కంకితముగా నవనాథచరిత్ర మను ద్విపదకావ్యమును, మల్లికార్జునస్వామిపేర హరిశ్చంద్రోపాఖ్యాన మను ద్విపదకావ్యమును రచించిన గౌరనమహాకవిని మనము మల్లికార్జునస్వామి ఆస్థానకవులుగా పరిగణింపవచ్చును.

# గణసహస్రమాలిక

పాలకురికి సోమనాథమహాకవి తెలుఁగులో రచించిన పండితారాధ్యచరిత్ర మహిమప్రకరణములో గణసహస్ర మాలికాస్తవము గర్భితమై యుండుట పలువురెఱింగిన విషయము. పండితారాధ్య చరిత్రమును బసవపురాణమునుగూడ సోమనాథుఁడు తెలుఁగులో ద్విపదచ్ఛందముననే రచించి యుండుటచే నీ సహస్రగణమాలికయు ద్విపదలోనే కూర్పఁబడి యున్నదని చెప్పనక్కఱలేదు. మల్లికార్జున పండితారాధ్యుఁ డాంధ్రదేశీయుఁడు. గోదావరీ మండలమందలి దక్షారామక్షేత్రము దక్షిణకాశియను ప్రశస్తిని చిరకాలమునుండి వహించియున్నది.

అతఁడు ఆ క్షేత్రమందలి భీమేశ్వర మహాలింగము నర్చించు భీమనపండితునికి నాతనిభార్య గౌరాంబకు నందనుఁడు. కర్ణాటకదేశమున వీరశైవ మతోద్ధరణమునకయి నందికేశ్వరుఁడు బసవేశ్వరుఁడుగ నవతరించినట్లు మఱొక ప్రమథమూర్తి శివునియాజ్ఞ నీ యాంధ్రదేశమున శైవ మతోద్ధరణమునకయి మల్లికార్జున పండితుఁడై యవతరించి నట్లు పండితారాధ్యచరిత్రమునఁ జెప్పఁబడినది. బసవేశ్వరుఁడు, మల్లికార్జునపండితుఁడు దూరముగ వేర్వేఱు ప్రాంతముల మతప్రచార మొనర్చుచున్నను వారిరువురు నొకరివిషయములను మఱియొకరు భక్తులవలనఁ దెలిసికొనుచుఁ బరస్పర

గౌరవ ప్రేమములతో నన్యోన్య సందర్శనాభిలాషులయి వర్తించుచుండిరి.

పండితారాధ్యుఁడు తన దేశమందే యుండి నిజ మత ప్రచార మొనర్చు కాలములో నొకనాఁడు శివపూజా సమయమున కర్ణాటమునుండి వెలిదేవ వేమనారాధ్యుఁడు, సూరసానమ్మయను భక్తు లాతనికడకరుదెంచి బసవేశ్వరుని చరిత్రము నాతని మహిమాదికములను వినుపింపఁగా మిక్కిలి సంతసించి వారిని గౌరవించి పూజించి పండితారాధ్యుఁడు బసవేశ్వర సందర్శనమునకయి మఱింతకుతూహలము నొందుచుండినట్లు పండితారాధ్య చరిత్రమున మొదటి ప్రకరణమగు దీక్షాప్రకరణమందే సోమనాథుఁడు వర్ణించియున్నాఁడు. వేమనారాధ్యుఁడు, సూరసానమ్మ మరలిపోయిన యనంతరము పండితారాధ్యుఁడు కల్యాణపట్టణమునకు బసవేశ్వరదర్శనార్థము ప్రయాణమై మార్గమధ్యమున నాఁగి గుంటూరు మండలమందలి చందవోలు (సనదవోలు, ధనదపురము)లో రాజ్య మొనర్చుచుండిన వెలనాటిచోళుని యాస్థానమున కేఁగి యచ్చట బౌద్ధపండితులతో వివదించి వారిని జయించిన సందర్భమున బౌద్ధు లొనర్చిన యపచారముల ఫలితముగ జరిగిన విపరీత సంఘటనలలో పండితారాధ్యుని శిష్యులు బౌద్ధగురుని సంహరించుటయు నందుకయి కినిసి వెలనాటిచోళుఁడే నేరమును పండితునిపయి మోపి, యాతని నేత్రము



పండితా

రాధ్యుఁడు వెలనాటిచోళుని శపించి చందవోలునుండి కదలి యచ్చటికిఁ గొంతదూరమునున్న యమరావతికిఁ (అమరారామక్షేత్రము) గదలి యందలి యమరేశ్వరునిఁగూర్చి యమరేశ్వరాష్టకము మున్నగు కృతులు రచించి యాస్వామి సన్నిధిని పురాతనశివభక్తగణసహస్రముల సన్నుతించి తత్ప్రసాదమున నూర్ధ్వనేత్రలాభమును బడసినట్లు సోమనాథుఁడు పండితారాధ్య చరిత్రమున మహిమ ప్రకరణమున వర్ణించినాఁడు.

ఆనాఁ డాసందర్భమునఁ బండితుఁ డొనర్చిన యా పురాతన భక్తగణ సంకీర్తనమే గణసహస్రమాలికా స్తవమని పేరేర్పడినది. ఆనాఁడు పండితుఁడు వాస్తవముగ నెవ రెవరిని స్మరించి వాయూర స్తుతించెనో యెరికిని తెలియదు. సోమనాథుని గ్రంథమందలి నామములు వేయికిఁబయిగానే రమారమి 1064 వఱకునున్నవి.

వీనిలో మల్లికార్జున పండితుని సమకాలికులు పూర్వోదాహృతు లయిన బెలిదేవ వేమనారాధ్యులు, సూరసానమ్మ, బసవేశ్వరాదులేగాక కేవలము పండితారాధ్యుని శిష్యులయిన వెల్లగొండ మహాదేవయ్య, ధవళేశు నామయ్య మున్నగువారి నామములుగూడఁ జేరియున్నవి. సోమనాథుఁడు పండితారాధ్యచరిత్ర రచించినది పండితుని నిర్యాణానంతరము చిరకాలమునకుఁ గాన యాతఁడు సంధానించిన యీస్తవములోఁ బండితుని సమకాలికులను శిష్యులను

కూడ నాతఁడు పురాతనులలోఁ జేర్చి యుండుట కొంతసంగత ముగా నుండునుగాని పండితుఁడే వారిని పురాతనగణములోఁ జేర్చి స్తుతించెననుట సమంజసముగా నుండదని చెప్పనక్కఱ లేదు.

మఱియుఁ బైని జేర్కొనిన ధవళేశునామయ్య పానుగంటి యుదయావనీశుని కొలువులోనివాఁడు. పండి తుఁడు అమరావతినుండి తరలి కల్యాణమునకు వనిపురము మీఁదుగా నేఁగునపుడు పానుగంటిలోనే యీ ధవళేశునా మయ్యచరిత్రము ప్రసక్తమయినది. మొట్టమొదట పండితుని గురుత్వ మాతని కచ్చటనే యేర్పడెనో? యింతకుఁబూర్వము నుండియు నుండెనో యిదమిత్థముగ నిర్ణయింపఁజాలము. పండితారాధ్య చరిత్రమందలి తెలుఁగు సహస్రగణమాలికా స్తవమునకుఁ గన్నడభాషలో "లలితరగళె" రూపములో నొక యనువాదము సోమనాథుని పేరనే వెలసియున్నది. దానిలో మునుముందు కొన్ని సంస్కృతమంత్రములు, అంగ న్యాస కరన్యాస మంత్రములు కూర్పఁబడియున్నవి. వానిని సోమనాథుఁడే చేర్చెనో తరువాతివా రెవరయినఁ జేర్చిరో కూర్చిగఁ జెప్పఁజాలము.

ఈ కన్నడస్తవమును, సంస్కృతభాషలో అనుష్టుప్ ఛందములోనున్న మఱియొక స్తవమును రెంటిని జేర్చి పండితరత్న, బి. శివమూర్తి శాస్త్రిగారు తమ "శరణసా హిత్య" గ్రంథమాలికలో గణసహస్రమాలికయను పేరితో

విపుల ప్రస్తావనాదికములతోఁ బ్రత్యేక గ్రంథరూపమునఁ బ్రకటించి యున్నారు. సంస్కృతస్తవములో దాని నెవరు కూర్చినది యుండుఁ జెప్పఁబడలేదు. అందుచే దానికర్త యెవరైనది స్పష్టముగఁ దెలియరాకున్నది. కర్ణాటక కవిచరిత కారులు, శ్రీ నరసింహాచార్యులుగారు మల్లికార్జున పండితుని చరిత్రమును వ్రాయుటలో నాతని కృతులను జెప్పుటలో గణసహస్రమును గూడ నందుఁ జేర్చియుండుటచే సంస్కృతమందున్న యీ గణసహస్రమాలికాస్తవమును మల్లికార్జున పండితుఁడే రచించియుండునని శ్రీ శివమూర్తి శాస్త్రిగారు తమయభిప్రాయమును బ్రకటించిరి. అట్లయ్యు నీ విషయము విస్పష్టముగఁ జెప్పరాకున్నదని కూడ వారు సెలవిచ్చిరి. అందుచే దీని కర్తృత్వము సంశయగ్రస్తముగనే యున్నదని చెప్పనక్కఱలేదు.

పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్రమునకు గురురాజకవి క్రీ॥ శ॥ 1500 ప్రాంతమున సంస్కృతానువాదమును రచించినట్లు కర్ణాటక చరిత్రకారులు వ్రాసియున్నారు. ఆగ్రంథము నేను చూచియుండలేదు. అది ముద్రితమయినదో లేదో తెలియదు. శ్రీ శివమూర్తిశాస్త్రిగారు తాము ప్రకటించిన గణసహస్రమాలికయను గ్రంథమునఁ బ్రకటించిన సంస్కృతకృతి గురురాజకవి సోమనాథుని తెలుఁగు ద్విపద కావ్యమందలి గణసహస్రమాలికకుఁ గావించిన యనువాద మేమో యనెడి యనుమానము నాకున్నది. ఆ విషయము

శ్రీ శివమూర్తి శాస్త్రిగారు తమ ప్రస్తావనలోఁ జర్చింపనందున
దీ చేతే మఱియొక గ్రంథమే యై యుండవచ్చునని యు
నేను తలంచితిని.

తెలుఁగునందు, కన్నడమునందు, సంస్కృతము
నందున్న యీ గణసహస్రమందలి నామములు నీ మూఁడు
కృతులందు నొకేతీరున లేవు. హెచ్చుతగ్గులు, వ్యత్యా
సములు ఎక్కువగనున్నవి. ఈ గణసహస్రమందలి నామము
లకు ప్రమథగణములు 465, రుద్రగణములు 171, అమరగణ
ములు 234, దశాచార్యగణములు 10, తేరసులు 13, షోడ
శులు 16, త్రిషష్టిపురాతనులు 63, యోగాచార్యులు 28 అని
మొత్తము వేయింటికి సరిపడునట్లు విభాగ మేర్పడియున్న
దని శివమూర్తిగారు తమ ప్రస్తావనలో నుదాహరించి
యున్నారు.

వీరివిభాగము సంస్కృతకృతినిబట్టి చేసిరో, కన్నడ
కృతినిబట్టి చేసిరో స్పష్టముగ వ్రాయలేదు. సోమనాథుని
తెలుఁగు పండితారాధ్యచరిత్రయందలి నామములు వేయికిఁ
బై గానున్నట్లు మున్నే వ్రాసియుంటిని. అందు అమరగణ
ములు వేఱుగా నుదాహృతము కాలేదు.

పండితారాధ్యుఁడు అమరావతిలో అమరేశ్వరలింగ
స్వామిని గణసహస్ర నామావళిని స్మరించి స్తుతించినపుడు
గాని నాతఁడు తా నంతకుమున్నే రచించిన యొక గ్రంథ
మునుబట్టి పేర్కొనెననుట కెట్టిసూచనలు సోమనాథుని

పండితారాధ్య చరిత్రమునుబట్టి తెలియరావు. అట్టికృతియే యున్నచో సోమనాథుఁ డావిషయము నా సందర్భమునఁ జెప్పియుండకపోఁడు.

పండితారాధ్యుఁడు నిత్యము శివపూజా సమయములందు బోధించు నాతని స్వరచిత కృతుల నామములు, పురాతన స్తవముల నామములు దీక్షాప్రకరణమున నుదాహృతము లయినవి. బెలిదేవ వేమనారాధ్యుఁడు, సూరసానమ్మ తన్ను సందర్శించుట కేతెంచినప్పు డాతఁడు వానినే పఠించుచుం డెను. (చూడుఁడు : దీక్షా ప్రకరణము పుటలు 111, 113.)

"హరలీలఁ దేలుచు హరలీల దనర
హరలీల యనుకృతి హరలీలఁ బాగడు
మహిఁ జెప్పబడు మహిమ్నస్తవంబునను
మహిమాకరుండని మహిమఁ గీర్తించు
మలహరణంబగు సులహరణంబునను
మల్హణప్రియుని గ్రిమలహరుఁ బొగడు
శ్రీమయంబైన వామయంబున ని
రామయుండగు కరుణామయుఁ బొగడు
నాయతప్రీతి హలాయుధంబున హ
లాయుధప్రియుఁ ద్రిశూలాయుధుఁ బొగడుఁ
బాంచభౌతిక పంచపంచేంద్రియ ప్ర
పంచదూరు నుతించుఁ, బంచగద్యలను

శివతత్త్వసారసంచిత మహామహిమ
శివతత్త్వసారమన శివకృతిఁబొగడు
మహనీయమగు రుద్రమహిమయన కృతిని
మహనీయమగు రుద్రమహిమఁ గీర్తించు
నలరు సంసార మాయాస్త్రవంబునను
నలరు సంసారమాయాదూరుఁ బొగడు
శంకరగీత భాస్వత్ప్రదావళిని
శంకరదురిత భయంకరుఁ బొగడు
నానందగీతంబులను పదంబుల స
దానందు భక్తగణానందుఁ బొగడు
బండారి బసవన్న భవ్యగీతముల
బండారిబసవన్న ప్రాణేశుఁ బొగడుఁ
బ్రాక్తన నూతన భవ్యగీతప్ర
సూక్తుల నెండియు భక్తాత్ముఁబాడు
పనిగొని యిబ్భంగిఁ బాడుచుఁ బొగడు
చును నాల్క కిసివోవఁశూలిఁ గీర్తింప."

మఱియు వెలనాటిచోడుని సభలో బౌద్ధగురునితో
ంవదించుటకై మహాసంరంభముతోఁ బండితుఁ డరుదెంచు
ంపుడాతనివెంటఁ జను భక్తగణములుకూడ నెన్నియో యిట్టి
్తపములఁ బఠించుచునేఁగినట్లు వాదప్రకరణమున వ్రాయఁబడి
ంది, చూడుఁడు: (పండితారాధ్య చరిత్రమందలి వాదప్రక
రణము పుటలు 512-516) వీనిలో దేనియందును నీ గణస

హస్రమాలికా నామముకానరాదు. పండితుఁడంతకుమున్నే యిట్టి కృతి రచించి యున్నచో నది యిందుదాహృతము కాకుండ నుండియుండదు. అమరేశ్వరుని సన్నిధి నూర్ధ్వనేత్ర లాభమును బడయు నవసరమునసే యీతఁడా నామముల ఛందోరూపమున నొక గ్రంథముగ గ్రంథించి పఠించెననుట కెట్టిసూచనలు సోమనాథుని కావ్యమునఁ గానరావు. కావున నీ గణసహస్రనామములను మునుముందు పండితారాధ్యచరిత్ర రచనావసరమున ద్విపదలలోఁ గూర్చినది తరువాత లలిత రగళెలో వానిని కన్నడమున ననువదించినదియు పాల్కురికి సోమనాథుఁడే యనియు, సంస్కృతమందలి కృతి గురురాజకవి తాను సోమనాథుని తెలుఁగుకృతి కనుకృతిగా రచించినదనియు నేను తలంచుచున్నాను.

ఈ యభిప్రాయముననే నేను ప్రకటించిన "పాల్కురికి సోమనాథుని లఘుకృతులు" అను గ్రంథముయొక్క పీఠికలో వెలువరించితిని. కర్ణాట కవిచరిత్రకారులు దీనిని మల్లికార్జున పండితుని కృతిగా గ్రహించుటకాధారములు లేవు, శివమూర్తి శాస్త్రిగారు తమ ప్రస్తావనారంభమున నుదాహరించిన యీక్రింది కందపద్యము బహుశః సోమనాథుఁడు లలితరగళెలోఁ గూర్చిన కర్ణాటానువాదముయొక్క యవతారికలో నిది కావచ్చును.

క. "శ్రీ మల్లికార్జునాఖ్యం
ధీమంతం సాపరహిత గణసంకులమం

ప్రేమదితులితిసిద సానెర
నామవజప నెందుప్పెగళ్దు విస్తరిసిదపెం."

దీనినిబట్టికూడ మల్లికార్జునపండితుఁడు గణసహస్రనామములను మక్కువతో జపించె (పఠించె) ననియేగాని యీ తఁడిట్టి కృతినేరచించెనని యేర్పడఁజాలదు. విమర్శకు లీవిషయము నింకను బరిశోధించి సత్యనిర్ణయ మొనర్తురుగాక యని ప్రార్థించుచున్నాను.

కాని యిటీవల మహబూబునగరవాస్తవ్యులు బహులిఖితగ్రంథముల ప్రతులను విశేషవ్యయప్రయాసలతో సేకరించిన వారునునగు శ్రీ హన్నబాదు నాగలింగశివయోగిగారు నాకు వ్రాసినలేఖలో సంస్కృతమున ప్రకటితమయిన యీసహస్రగణమాలిక గురురాజకవి సంస్కృతపండితారాధ్య చరిత్రములోనిదే యని తెలియఁబఱచియున్నారు. ఇందువలన నాసందేహము తీఱినది. కావున సంస్కృతములో ప్రకటితమయిన సహస్రగణమాలిక కర్ణాటకవిచరిత్రకారులు తలంచినట్లు మల్లికార్జున పండితారాధ్యరచితము కాక సోమనాథుని తెలుఁగుపండితారాధ్యచరిత్రలోని సహస్రగణమాలికకు గురురాజకవి సంస్కృతానువాదమే యని స్పష్టమగుచున్నది.

# శివకవి గౌరనమంత్రి - అతని కృతులు

శ్రీశైలక్షేత్రమున శ్రీ చెన్నమల్లికార్జునస్వామి సన్నిధిని క్రీ॥ శ॥ 1440 ప్రాంతమున విరచితమయిన శ్రీనాథమహాకవి శివరాత్రి మాహాత్మ్యము తరువాతఁ దత్సమీపకాలముననే యచ్చట వెలువడిన గౌరనమంత్రి శివకృతులు హరిశ్చంద్రోపాఖ్యానము, నవనాథ చరిత్రము నను రెండు ద్విపద కావ్యములు. వీనిలో నవనాథచరిత్రము, శ్రీనాథుని శివరాత్రి మాహాత్మ్యమువలెనే యప్పటి శ్రీశైలక్షేత్రపరిపాలకులగు వీరశైవభిక్షావృత్తి మఠాధీశ్వరుల యాస్థానమున శాంతభిక్షావృత్తియతీశ్వరు నానతిపయి నయిదాశ్వాసములతో రచితమయి యాతని ప్రేరణమున శ్రీమల్లికార్జునస్వామికే యంకితము గావింపఁబడినది. ఇందాశ్వాసాద్యంతములందు భిక్షావృత్తియతీశ్వరుని వైభవ ముద్వేలముగ వర్ణింపఁబడినది. శైలినిబట్టి చూడ నిది గౌరన మునుముందు రచించిన ప్రాథమికకృతియని తలంపఁదగియున్నది. హరిశ్చంద్రోపాఖ్యానమింతకన్నఁ బ్రౌఢతరశైలిలో నుండుటచే నది యాతరువాతనే విరచితమయి యుండునని తలంపనగును. ఇదికూడ శ్రీమల్లికార్జునస్వామి కంకితము చేసినట్లు గౌరన విస్పష్టముగ నందుఁ బేర్కొనకున్నను నిదియు నా స్వామికే యంకితమయినట్లు మనమూహింపఁదగును. అందలి గ్రంథారంభము గనుఁడు—

"శ్రీగిరిజాధీశు శ్రీగిరినాథు
నాగచర్మాంబరు నాగకేయూరు
బాణవత్సలుఁ బంచబాణసంహారు
వాణీశవినుతు గీర్వాణీశవంద్యు
గంధర్వ కిన్నర గాంధర్వలోలుఁ
గంధర శ్యామల కంధరోదారు
దారుణాంధకదర్ప దళనవిహారుఁ
జారుజాంబూనద శైలకోదండుఁ
గారుణ్యజలధి గంగాధరు నభవు
శారదాచందన శారదాంభోద
మల్లికాకర్పూర మాలికాభూషుని
మల్లికార్జునదేవు మహితప్రభావు
మానాల నేపట్ల మమ్మేలువేల్పుఁ
బాపాళిఁబాప సద్భక్తిఁ బూజించి
పరమ యోగీంద్ర హృత్పద్మసద్మముల
మరగి క్రీడించెడి మాయలతేటిఁ
గడునొప్పు భ్రమరాంబికామహాశక్తిఁ
దడయక వరములు దయసేయఁ గొల్చి"
మఱియు నటుతరువాత
"భూతనాయక పాదపూజాభిరతుఁడ
గౌతమ గోత్రుండ గౌరనాహ్వయుఁడ
సరససాహిత్య లక్షణవిచక్షణుఁడ
బిరుదవిఖ్యాతిచేఁ బెంపొందువాఁడ"

ననియు గ్రంథాంతమున

"భ్రమరాపరిశాద సంప్రాప్తకవిత్వ
సుమహిత సామ్రాజ్య సుఖపరాయణుఁడు
చతురసాహిత్య లక్షణచక్రవర్తి
ప్రతివాదిమదగజ పంచాననుండు"

అనియు వ్రాసికొనినాఁడు. ఇందుచే నితఁడు శ్రీమల్లికార్జునస్వామి, భ్రమరాంబికాదేవులకు వంశానుగతముగనే వలసిన సహజభక్తుఁడనియు నవనాథచరిత్రమువలెనే యీ హరిశ్చంద్రోపాఖ్యానమునుగూడ మల్లికార్జునస్వామికే యంకితమొనర్చెననియు నిరాఘాటముగ నెంచవచ్చును.

శ్రీరంగమాహాత్మ్యము, రత్నశాస్త్రము, కవిగజాంకుశము నను కృతుల రచించి ప్రశస్తిగాంచిన యీతని తనయుఁడు భైరవకవిగూడఁ దనకృతులలో

"భ్రమరాంబికా మహావర
సముచిత నిరవద్యహృద్యసాహిత్యకళా
క్రమవిమలప్రతిభాసం
క్రమణుఁడ, మతిశాలినైన గౌరనసుతుఁడన్."

"శ్రీమత్పరమశివానన
తామరసవికాసలీలఁ దనరిన భ్రమరాం
బామధుమత్తభ్రమరిక
నామాంసపసరసిరుహంబుల నర్చించుచున్."

అని వ్రాసికొనినాఁడు. ఇందుచే గౌరనయు నాతని సుతుఁడు భైరవకవియు భ్రమరాంబికావరప్రసాదలబ్ధసరస కవితా సంపన్నులనియు నిరువురు మల్లికార్జునస్వామి భక్తుల నియు శ్రీశైల ప్రాంతవాస్తవ్యులనియు మనమెంచఁదగును. గౌరనమంత్రి యీ రెండు ద్విపదకావ్యముల యవతారిక లందును దాను సింగయ మాధవక్షితిపాల మంత్రిపుంగవుఁ డయిన పోతరాజునకుఁ దమ్ముఁడయిన యయ్యలమంత్రి తన యుఁడనని చెప్పికొనినాఁడు. వీనినిబట్టి సింగయ మాధవక్షితి పాలుని వివరములు మనకు విస్పష్టముగఁ దెలియరావు. ఈ గౌరనమంత్రి సంస్కృతమున "లక్షణదీపిక" యను ఛంద శ్శాస్త్రముగూడ నొకటి రచించెను. అందు "అస్తి ప్రశస్తావ నిపాల మౌళిరత్నావళీరంజితపాద పీఠః । రేచర్లవంశార్ణవ పూర్ణచంద్రః మహాబలస్సింగయ మాధవేంద్రః॥ అని కొంత వివరించినాఁడు. రేచర్లవంశ్యుఁడయిన యీసింగయ మాధ వేంద్రుఁడు గౌరన పెదతండ్రి పోతరాజామాత్యున కేలికయని వెలుగోటివారి వంశచరిత్రమునం దుదాహృతమయిన యొక శ్లోకమునుబట్టి తెలియుచున్నది.

శ్లో. శ్రీమతో మాధవేంద్రస్య రాజ్యాంగైక ధురంధరః
మంత్రీ పోతననామాసీత్ సర్వశాస్త్ర విశారదః
యస్యామాత్య శిఖామణే కవివరస్తోత్రైక పాత్రీకృతాం
మత్వావాక్పతి రిద్ధనీతి సుభగాం వాగ్వైఖరీం లజ్జతే

సోఽయం పెద్దన మంత్రివర్యతనయః శ్రీపోతరాజోన్వహం
దేవస్యాస్య మహోపకార రచనాం సమ్యఙ్ముదాచీకరత్॥

రేచర్లవంశ్యులు, పద్మనాయక వీరులు, తెలంగాణ మండలి రాచకొండ, దేవరకొండ రాజధానులుగాఁ గాకతీయ సామ్రాజ్యపతనానంతరము పరాక్రమోపేతులయి చిరకాలము పరిపాలించినట్లు చరిత్రప్రసిద్ధము. ఈ రావువంశ్య సింగయ మాధవనృపాలుఁడు రామాయణమునకు రాఘవీయ మను టీకను రచించి యశంబుగాంచెనని యూతనిధర్మపత్ని, రాచకొండ సమీపమందలి నాగార గ్రామములో శాలివాహనశకము 349 (1427 A. D.) లో నొక శిలాశాసనము నెలకొలిపెను.

శ్లో. శాకాబ్దేఽధిహార్ధి రామశశిగేష్వబ్దే ప్లవంగే శుభే
మాసేప్యాశ్వయుజే రఘూద్వహపదే సోమా రాఘవీయా
హ్వాయం
టీకామర్థపటు ప్రబోధఘటనా మాణిక్య పుష్పాంజలిం
కృత్వారాజతి రావు మాధవనృపో రామాయణస్య శ్రియే॥

కావున క్రీ॥ శ॥ 1427 సంవత్సర ప్రాంతమునందుండిన సింగయ మాధవనృపాలుని మంత్రి పోతరాజు తమ్ముని కుమారుఁడయిన మన గౌరనకవి శ్రీనాథమహాకవి కించుమించుగ సమకాలీనుఁడయి హరిశ్చంద్రోపాఖ్యాన నవనాథచరిత్రములను క్రీ॥ శ॥ 1440–1450 ప్రాంతమున రచించియుండునని మనము తలంపనగును.

ఇఁక నీకవివరుని కృతుల పరిశీలనమునకుఁ గడంగుదము.

(1) హరిశ్చంద్రోపాఖ్యానము:- సత్యసంధుఁడని పేర్వ డసి భరతఖండమును బాలించిన హరిశ్చంద్ర చక్రవర్తి షట్చక్రవర్తులలో నొకఁడు. ఇతఁడు ఇక్ష్వాకువంశజుఁడు. అయోధ్యాపురము రాజధానిగా నేలినవాఁడు. ఇతని సత్య వ్రత చరిత్రము జగద్విఖ్యాతమయి యాబాలగోపాలముగ భారతదేశమున వన్నె కెక్కియున్నది. వేదములందును, స్కాందపురాణ మార్కండేయపురాణములందును గూడ నది వర్ణిత మయియున్నది. స్కాంద మార్కండేయ పురాణము లందలి కథలలోఁ గొన్ని స్వల్పభేదములున్నవి. ముఖ్యముగా మార్కండేయపురాణములో హరిశ్చంద్రుని భార్యపేరు శైబ్య యని యుండఁగా స్కాందపురాణమునఁ జంద్రమతి యని యున్నది. మార్కండేయ పురాణకథ యుత్తరహిందూస్థా నమునను, స్కాందపురాణకథ దక్షిణహిందూస్థానమునను వ్యాప్తములైనవి. స్కాందపురాణమునననుసరించియే గౌరనా మాత్యుఁ డీ హరిశ్చంద్రచరిత్రమును మునుముందు పూర్వ కథ, ఉత్తరకథ యను రెండుభాగములుగా నాంధ్రభాషలో ద్విపదకావ్యముగ రచించినాఁడు. దానినిబట్టియే తర్వాత శంకరకవి, కంచిశరభకవి, మల్లారెడ్డియనుకవీంద్రులు పద్య కావ్యములు రచించిరి. వీనియన్నిటికి మూలము గౌరన మంత్రి ద్విపదకృతియేయని తలఁపవచ్చును. ఈతనిద్విపద కా వ్యమందలిశైలి మృదుపదసంఘటితమై లోకోక్తి స్వభావోక్తి

సంయుతమయి ధారాశుద్ధికలిగి ప్రౌఢతరముగను, హృద యంగమముగను నలరారుచున్నది. వీరశైవ కవిశేఖరుఁడగు పాలకురికి సోమనాథుని బసవపురాణ పండితారాధ్య చరిత ములను గౌరన బాగుగాఁ బరిశీలించి యాతనివలెనే జానుతె నుంగుపై మక్కువగొని జాతీయత జాలువాఱ తీయని తెలుఁ గుఁబలుకుఁబడులతో వెలయించిన తావు లీకృతియందుఁ బలుతావులఁగాననగును. అందందు సంస్కృతపదబంధముతో దీర్ఘసమాసము లు ఘటించినతావులును గనవచ్చుచుండును. మచ్చునకుఁ క్రిందియుదాహరణముఁలఁదిలకింపుఁడు.

"మంచార మంజరీ మంజుమరంద
నందదిందిందిర సందనారామ
కమనీయవికసిత కనకారవింద
కమలినీతటలతాగారలతాంత
రచితశయ్యాతల రతిరయగళిత
కచభరసురపుర గణికాకిపోల
కలితఘర్మోదక కణగణమిళిత
మలయసమీర కోమలకంపితాగ్ర
మహితచిత్రిత ధ్వజ మాలాసహస్ర
సహితచింతామణి సౌధపాళికల
నందంద డెందంబునందు నెయ్యంబు
పొందొంద నీయిందుముఖులతోఁ గూడి
నేడుకసలిపెదవేని నీబొంద్ధి

తోడనే నిన్ను నింద్రునిపురి కనుచు"
"అరుణారవిందంబు లడుగులుగాఁగఁ
దరలఁగుమ్మరు వనదంతావళముల
యురుతరతుండంబు లూరులుగాఁగ
సరససైకతసీమ జఘనంబుగాఁగ
సురుచిరంబగు మేటిసుడినాభిగాఁగ
గర మొప్పుచిఱుతరగలు వళుల్ గాఁగ
నునుదీఁగనాచు లేనూఁగారుగాఁగ
నెనయ జక్కవలు పాలిండ్లనుగాఁగఁ
జెలువంపు బిసములు సేతులుగాఁగ
వెలిదమ్మి వదనారవిందంబుగాఁగ
సరవి బెల్లెసఁగెడు జలకణపంక్తు
లరుదార మౌక్తికహారముల్ గాఁగ
నవలఁగ్రీడించు రాయంచలరవము
నవహేమనూపురనాదంబుగాఁగఁ
బెనుపొంద నెరసిన ఫేనంబు దెలుపు
దనరారుచున్న చందనచర్చగాఁగఁ
గూలావనీరుహకుసుమపరాగ
జాలంబు చిత్రవస్త్రంబుగా మెఱయ
జనలోకపావని జాహ్నవిగంగఁ
గనుఁగొని హస్తపంకజములు మొగిచి"
"కులు నెండ్రుకల కోరకొప్పిడి కాని

యె యప్పుడు తలనిట్టునట్టునుజుట్టి
జేగురుఁబొప్పిట్టిచెవి సంకుగొఱపు
లాగుగాఁ వ్రేలఁ దెల్లనిముద్దునిల్పి
తోలుబూవోయిన ప్రాఁతతోలునుగప్పి
బలుగత్తి మొలనచ్చుపడ నమరించి
కడుమైలపీలికఁ గాసించినడుము
బడికివేసిన యురపట్టె బిగించి
యెడమచేఁ బశుమాంసమేర్చిన గుదియ
గడమచే నినుపయుంగరముల గుదియ
గడజాతిగాఁబూని క్రిందుసందడిని
జడియుచు శంభలి శంభలి యనుచు
దళముగా మెఱసెడి తనమేనికుష్ఠు
పొలుసక్రజుమ్మని పొలయుమక్షికలఁ
గుంచియతోఁజోఁపుకొనుచు చెన్నలర
మించికందెసనూనె మేఁగినట్లున్న
మొగమునఁ జీకట్లు ముడివడఁ గల్లు
సగముద్రావినకుండఁ జంకలోనిఱికి
మీఱినమదమున మెయిదేలగిలఁగఁ
బాఱంగ వెడపాటఁ బాడుచు బయలు
జారుచు నల్లపచ్చనిపొడి మ్రింగి
కోరమీసమునుల్చి గుడ్లెఱ్ఱజేసి
కెలనివారల బూతుగెరల వెట్టుచును

దౌలఁగు రాజెవ్వఁడు దొరయెవ్వఁ డనుచు
ద్రాగినరోజు మత్తుంగాని యిన్ని
లాగుల నల్లనల్లన నృపుగదిసి"
(వీరబాహుని చండాలరూపవర్ణన)
"వెన్నముద్దకు రూపు వెట్టినమాడ్కి-
నన్నమెత్తనిమేన నొప్పెడివాఁడు
ఎన్నఁడు నెండకన్నెఱుఁగనినివువు
కన్నుల ముత్యాలుగార నేడ్చెడిని"
(మున్నగుజాతీయములు)
"అంతుగా నాఁబోతు అంకెవేసినను
గంతులుదక్కనే కంఠీరవంబు
"నీరువట్టాఱునే నెయిద్రావికొనిన"
"కాదని ముకుఁదాళ్లఁ గాలుదీయుకుము"
"బెడిదంపుబావురుఁబిల్లి వాతికినిఁ
దొడిబడరాచిల్క-ద్రోయుచందమున"

ఇటువంటి లోకోక్తులు, అసంఖ్యాకములుగ నీకృతి యందుఁ గానవయి ముద్దులొలుకుచుండును.

(2) నవనాథచరిత్రము:- దీనిని శ్రీగిరి యను కవిరచించిన పద్యకావ్యమునే ద్విపదకృతి వ్రాసినట్లు గౌరన యుదాహరించినాఁడు. కాని యాతఁ డనుసరించిన యామూలకృతి మనకు లభింపలేదు. ఆ శ్రీగిరికవి యెవరోకూడమనకు సరిగాఁ దెలియరాదు. పాలకురికి సోమనాథకవి ప్రత్యర్థియై యతని వాదములలో నాతనిచే నోటువడిన యనంతర మాతనికి

శిష్యుఁడయి వీరదీక్షవడసిన చక్రపాణి రంగనాథుఁడే, శ్రీగిరినాథవిక్రమ మను పేరితో శ్రీమల్లికార్జునస్వామి స్తుతులొనరించిన పిమ్మట శ్రీగిరినామధేయమును ధరించెనేమోయని నేనభిప్రాయపడుచున్నాను. నవనాథసిద్ధులు వైష్ణవమునందును శైవమునందును గూడఁ గలరు. గౌరనకృతి శైవనవనాథులకు సంబంధించినది. అందువర్ణితులయినవారు (1) శివుఁడు (2) మీననాథుఁడు (3) చౌరంగి (సారంగధరుఁడు) (4) గోరక్షనాథుఁడు (5) మేఘనాథుఁడు (6) నాగార్జునుఁడు (7) సిద్ధబుద్ధుఁడు (8) విరూపాక్షుఁడు (9) కణికుఁడు. ఇందు తండ్రిచే సవతితల్లి చిత్రాంగి దుస్తంత్రముచేఁ గాలుసేతులు నఱకుపడిన సారంగధరుఁడే చౌరంగి. మీననాథుని యనుగ్రహమున మరల ఖండితావయవముల యథాస్థితిలోఁ బడసినవాఁడు, ఇతని కథ యాంధ్రదేశీయులకుఁజిరపరిచితము. సారంగధరుని తండ్రి రాజమహేంద్రవరము నేలిన రాజరాజనరేంద్రుఁడేయని, యీకథ జరిగినది రాజమహేంద్రవరమునందే యని మనవారి యైతిహ్యము. కాని చేమకూర వేంకటకవి రచించిన సారంగధర చరిత్రమునుబట్టి యిది మాళవదేశమునకు సంబంధించినదిగాఁ గాన నగును. ఈద్విపద కావ్యశైలి హరిశ్చంద్రోపాఖ్యానశైలి యంత రసవంతము ప్రౌఢము కాదని యిది గౌరన ప్రాథమికకృతి కావచ్చునని మున్నె చెప్పియుంటిని. ఇందుఁ జెప్పఁబడిన కథలు చాలవఱకు మనోహరములై చదువ నింపుగొలుపుచుండును. అందును, పంచకపురోహితుని కథ మిగుల బాగుండును.

ఒక బ్రాహ్మణుఁడు రాజపురోహితుఁడు సౌందర్యవతియు, యౌవనవతియునగు రాజపుత్రికను గామించి మాయోపాయముచే దక్కించుకొననెంచి. యామె రాజమందిరమునందుండుటవలన రాజ్యము, రాజవంశమును నిర్మూలమగుననియు, నట్టియరిష్టములు దొలఁగించుటకై యామెను స్వర్ణాభరణపూర్ణమయిన మందసయందుంచి తలుపులుమూసి దానినొక తెప్పమీఁదఁబెట్టి నదీప్రవాహమున విడువవలెననియు రాజునకు దుర్బోధగావించి నమ్మించి యొప్పించెను. రాజాప్రకారముగాఁ జేసినపిమ్మట నీటివాలునఁబడి కొట్టుకొనిపోయెడి యాపెట్టెను బట్టుకొని యొడ్డునబెట్టి యొకమఱుగు ప్రదేశమున దానిని జదిలఁబరుపుఁడని ముందుగా నతని శిష్యులకుఁజెప్పి నియమించెను. ఇంతలో నాతనిశిష్యులు దానిని పట్టకమున్నె పరిసరారణ్యమున వేఁటకు వచ్చి డస్సిదప్పిదీర్చుకొననెంచి యేటియొడ్డునకువచ్చినరాజకుమారుండొకండుచూచి యాపెట్టెను నొడ్డుకుచేర్చి తలుపులు తెరచిచూచి యందున్న రాజకుమారినిగాంచి మోహించి, యామెవలన వృత్తాంతమెఱింగి గాంధర్వవివాహమున నామెను బరిణయమయి కొనిపోయి మందసలోఁ దాను వేటాడి పట్టుకొనిన యెలుగుగొడ్డు నొకదానినిబెట్టి తలుపులు మూయించి యథాప్రకారము నదీప్రవాహమునఁ ద్రోయించెను. పురోహితునిశిష్యులు దానిఁ గాంచి యొడ్డునఁజేర్చి భద్రపఱచి గురువునకు సమర్పించిరి. ంతసముతో నాతఁడు రాజకుమారిని గాంచ నువ్విళ్లూరుచు

మందస మూఁత దీయింపఁగా నందలి భల్లూకమాతనిపైఁబడి భక్షించి యాతని దుష్కృత్య ఫలితము నావెంటనే యాతని కనుగ్రహించెను.

ఈకథనుండి కొన్నిపంక్తుల నిట నుదాహరింతును.

"చెడితిరా! యికనేమిచేయుదుననుచుఁ
గడుపును బిసుకుచుఁ గటకటాయనుచు
నిలిచినచో నొకనిమిషార్ధమైన
నిలఁవనోపక కూడు నీళ్లను బాసి
కడుజాలిఁబొందుచుఁ గన్నంబులోన
వడితేలుకుట్టిన వానిచందమున
వెడఁగురీతిని గడువేదనఁ జాల
నడరుచు నొకయుపాయమును జింతించి
... ... ...
విను వినకుండుము వివరించికొనుము
కొనకుండుమనుచును గుటిలాత్ముఁ డతని
చెవిడాసి కూఁతురుచేవ్రాఁతఫలము
విపరించి చూచితి వినుమీకుమారి
నీయింటనుండిన నీవు నీప్రజలు
నీయేలు దేశంబు నిర్మూలమగుదు
రనవిని భీతితో నతఁడాడుమాట
తనకునంతకుమున్న తార్కాణయగుట
తలపోసి యక్కట! తల్లిపెంచినది

మెలమి నీ బాలిక యేగతివిడువ
నొడఁబడుబుద్ధి నీయువిదయ నాకు
గొడుకైనఁ గూఁతైనఁ గూర్మినెక్కొన్న

... ... ...

వెఱతుము నీమాట ద్రోవలెడుగడవ
నెఱిఁగింపు మీపాప నేమిచేసెడిది
నావుడు సిద్ధించె నాకోరికనుచు
భావంబులోఁ బలఁ బ్రమదంబుమోపి
యాతఁ డిట్లనె వసుధాధిప! మిగులఁ
జాతురిగా మందసంబును జేసి
యాలోన మణికనకాంబరాభరణ
జాలంబుతోడ నీచపలాక్షినుంచి
తలుపులు వదలించి తిగుతెప్పమీఁదఁ
బొలుపొంద నునిచి యుప్పొంగుపెన్నేట
వెసజాఱవిడిచిన ద్రోవకగు శుభము
లెసఁగు మీకెల్లను నెలనాగభాగ్య

... ... ...

నృపతియాకన్యపాణిగ్రహణంబు
విపులసముద్రమున వెలయఁ గావించి
మనమూగ మొదల నమ్మందసనున్న

బూని తానంతకుమున్న వేఁటాడి
బోనులోఁ దెచ్చిన భూరిభల్లూకము
జొరఁగొప్పితలుపులచ్చులు వదలించి
తిరముగాఁ దొల్లిటి తెప్పపై నునిచి
యేటిలో విడిచి యాయింతి దోడ్కొనుచు
ఘోటకభటదంతికోటులతోడఁ
దనపురి కేఁగెను దదనంతరంబ
యనువునఁ జనుచున్న యామందసంబు
వడుగులుగని యుబ్బి వడిఁ గుప్పిగంతు
లిడుచు నొండొరులఁ బల్విడి కేకలిడుచుఁ
గొట్టి అంకెలు వేసికొనుచుఁ జెలంగి
పట్టి మందసఁ దెచ్చి పరగ నవ్వేటి
పొంత బ్రబ్బిన ప్రబ్బపొదలలో నునిచి
సంతసంబెసఁగ నొజ్జలరాక కెదురు
చూచుచునుండ నచ్చోటను విప్రుఁ
డే చేలుపాటు దానెఱుఁగక దక్కె
రాచకూఁతురు మనోరథసిద్ధియెసఁగె
నాచపలాక్షి జమ్యానఁ బొందకున్న
నేచినయామనం బెట్లాపవచ్చు?''

తనకృతులరెంటిని శ్రీశైలక్షేత్రముననే రచించి యంబా మల్లికేశ్వరుల కంకితమొసంగిన శివకవివతంసుఁడు, గౌరనమంత్రి సర్వవిధముల ధన్యాత్ముఁడు. చిరస్మరణీయుఁడు, ఆంధ్రసోదరులు వానినాదరముతోఁ జదివి యానందించి తరింతురుగాక !

గౌరనవీరశైవకవిశేఖరుఁ డగు పాలకురికిసోమనాథుని మార్గము ననుసరించి తన ప్రధానకావ్యముల ద్విపదలోనే రచించినను సోమనాథుఁడు విరివిగాఁ బాటించిన ప్రాసయతిని హరిశ్చంద్రోపాఖ్యానములో నీతఁడు వాడినట్లు కానరాదు. నవనాథచరిత్రమున మాత్రము కొన్నితావులందు బ్రాసయతులు క్వాచిత్కముగఁ గాననగును.



శ్రీపతి ప్రెస్, కాకినాడ - 1969

# శుద్ధ పత్రిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 3 | రుద్రాపతారు | రుద్రావతారు |
| 9 | 15 | ఇత్యాతి | ఇత్యాది |
| 11 | 21 | యాచయు | మాచయ |
| 13 | 16 | యుతనకి | యుతనికి |
| 14 | 23 | నిరమనవి | రనిమనవి |
| 20 | 19 | వజ్జాన | వజ్ఞాన |
| 21 | 13 | పానవిన్నియు | పావలిన్నియు |
| 24 | 22 | సాంత్వ | సాంత్వన |
| 29 | 6 | కథాకర్ణ | కథార్ణ |
| 38 | 11 | మురాది | మురారి |
| 39 | 1 | బసకేశ్వ | బసవేశ్వ |
| 49 | 21 | దండానాయ | దండనాయ |
| 67 | 8 | ప్రామాణ్యయు | ప్రామాణ్యము |
| 68 | 22 | కవస్థలి | కరస్థలి |
| 75 | 20 | మతోద | మతోద్ధ |
| 76 | 10 | మలప్రహరి | మలప్రహారి |
| 86 | 5 | సంగతి | సంతతి |
| 91 | 23 | భల్లాళ | భల్లాణ |
| 96 | 13 | సురశోటు | సురకోటు |
| 107 | 1 | మాయను | మాయన్ |
| 111 | 10 | సురతి | సురత |
|  | 11 | మయత్నంబు | ప్రయత్నంబు |
| 112 | 7 | విఃవేషము | విటవేషము |
| 128 | 4 | మస్ | మన్ |
| 203 | 16 | వనాపయంబు | వనవామయంబు |
| 210 | 5 | గ్రంథించి | గ్రథించి |
| ,, | 12 | [illegible] | [illegible] |

"ఇటీవల ఆంధ్రసాహిత్యక్షేత్రమునందు వీరశైవమతము గుఱించి శివకవులనుగుఱించి పుట్టిన యనేకములయినయపో హములను శ్రీ తమ్మయ్యగారు సప్రమాణముగా ఖండించి వీర శైవసాహిత్యముయొక్క కీర్తిని గౌరవమును కాపాడినారు. ఆంధ్రులకు వీరశైవధర్మసాహిత్యముల పరిచయము శ్రీతమ్మ య్యగారివలననే కల్గినదని చెప్పుట యతిశయోక్తిగాదు. ఆ మహనీయులు ఆంధ్రసాహిత్యమునకు, శైవసాహిత్యమునకు గావించిననిస్స్వార్థసేవ యమోఘమైనది. వారిప్పుడు వృద్ధు లయియుండియు సాహిత్యసేవ నకుంఠితముగా జరుపుచుండుట మన భాగ్యవిశేషము. "స్వధర్మ" పత్రికానిర్వహణము నెట్టి ప్రతిఫలాపేక్ష లేకయే వహించి దీక్షతో సమాజసేవచేయు చున్నారు. వారి నిస్స్వార్థసేవను పరిగణించి వారి ముద్రితా ముద్రితగ్రంథములను, వ్యాసములను ప్రకటించుట మన పవిత్ర కర్తవ్యము. ఈకార్యమును నిర్వహించుటకొక స్థాయిసంఘ మేర్పడవలెను."

కీ॥ శే॥ T. H. M. సదాశివయ్య, M. A., B. L., గారు

[1959 ఏప్రిలులో నెల్లూరులో జరగిన అష్టమ ఆంధ్రరాష్ట్ర వీరశైవజంగమ మహాసభ అధ్యక్షభాషణమునుండి.]

శివశ్రీ బండారు తమ్మయ్యగారు పరిష్కరించి ప్రకటించిన గ్రంథముల వివరములు

## పరిష్కరించిన గ్రంథములు

1. చతుర్వేదసారము- పాల్కురికి సోమనాథుఁడు 2-50
2. పాల్కురికి సోమనాథుని లఘుకృతులు 1-25
3. ప్రభులింగలీల- పిడుపర్తి సోమనాథకవి (ద్విపదకావ్యము) 2-50

## కన్నడభాషనుండి ఆంధ్రీకరింపబడిన గ్రంథములు

4. శక్తివిశిష్టాద్వైత సిద్ధాంతము 0-50
5. ఆంధ్రవీరశైవ వివాహవిధి 0-25

## స్వయముగ రచించిన గ్రంథములు

6. కుమారసంభవము (కాళిదాసకృతికి గద్యానువాదము) 2-00
7. పాల్కురికి సోమనాథకవి | ఈకవుల జీవితచరిత్ర. 5-00
8. శ్రీనాథమహాకవి | వాఙ్మయవిమర్శనములు 5-00
9. రఘువంశకథనము (కాళిదాసకృతికి గద్యానువాదము) పునర్ముద్రణ పొందవలసియున్నది.
10. మడివాలు మాచయ్య చరిత్రము 1-50
11. వ్యాసావళి ప్రథమభాగము 5-00
12. వృషాధిపశతకము (టీకాసహితము) 1-00